













శ్రీరస్తు

శుభమస్తు అవిఘ్నమస్తు



# అన్నమయ్య - అనుయాయులు

**(పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య, తరిగొండ వెంగమాంబ)**

## భక్తి, రక్తి, విరక్తి కీర్తనలకు

**అవతారిక మరియు భావ వివరణ**

రచన

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
**M.Tech.**

# అన్నమయ్య - అనుయాయులు

మొదటి ప్రచురణ
**జూన్ 2012**

రచన
**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

వెల : **అమూల్యం**

ప్రతులకు :
ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం. 61, సిద్దార్థ నగర్,
హైదరాబాద్ - 38. ఫోన్ : 093930 21360

డి.టి.పి. ప్రింటింగ్ :
**కె. వి. ఆర్**
98495 79345



అన్నమయ్య - అనుయాయులు

## అంకితము

## తిరుమల సప్తగిరులకు



ఉ ॥ కొండను మోసి దేవతల కొండల కోర్కెలదీర్చి, రాముడై
కొండలద్రిమ్మరౌ కపికి కొండలవైరి సుతున్ వధించితో
కొండను యెత్తి లేత చనుకొండల నంటితివయ్య కృష్ణుడై
కొండలవేంకటేశ! తమ కొండల కంకితమిత్తు దీనినిన్

తా॥ కొండలలో నెలకొన్న శ్రీవేంకటేశ్వరా! నాడు కృతయుగంలో దేవతలకు అమృతం కోసం కొండలవంటి వాళ్ళ కోర్కెలు తీర్చటం కోసం మందరము అనే కొండను మోశావు. త్రేతాయుగంలో రాముడవై కొండల వైరి అయిన ఇంద్రుని కొడుకు వాలిని వధించి ఋష్యమూకం కొండలలో దేశద్రిమ్మరిగా తిరుగుతున్న సుగ్రీవుడనే కపికోసం నిందను కూడా నీవు భరించావు. ద్వాపరయుగంలో గోవర్ధనం అనే కొండను యెత్తి గోకులంలో గొల్లెతల హృదయాలనుదోచి, వారి లేత చనుకొండలను స్పృశించి పరవశింపజేశావు. నేడు కలియుగంలో ఈ తిరుమల ఏడుకొండలపై వెలసి మా కొంగుబంగారమైనావు. యుగయుగాల నుండి నీకు కొండలంటే కొండంత ఇష్టం. అవునా? అందుకనే నేను "అన్నమయ్య - అనుయాయులు" అనబడు నా రచనను నీ కొండలకే అంకితము ఇస్తున్నాను. భక్తితో వాటిని యెక్కినవారందరికీ దీని మూలంగా నాకు దక్కే పుణ్యము సమముగా లభించుగాక!

# అన్నమయ్య - అనుయాయులు

## అన్నమయ్య "భక్తి" కీర్తనలు

## విషయ సూచిక

## పెదతిరుమలయ్య "రక్తి" (శృంగార) కీర్తనలు







## చినతిరుమలయ్య "విరక్తి" (అధ్యాత్మ) కీర్తనలు

## విషయ సూచిక

## తరిగొండ వెంగమాంబ సంకీర్తనలు

## విషయ సూచిక

# ప్రార్థన

కం॥ శ్రీవేంకటేశు గొల్చుచు
ఆవలనీ "అన్నమయ్య - అనుయాయులు"నే
కోవిదులూచగ శిరసుల
నేవివరించెదను వినుదు నిపుణత లొలుకన్

శా॥ ఊహాతీతము నీదలీల భళిరా! ఉర్వీధరా! శ్రీహరీ!
ఆహా! యిత్తరి అన్నమయ్యకృతులన్ అందింతు జోడించుచున్
సౌహార్దంబున భావమంత తెలియన్ సాధ్యంబగున్ శ్రీవిభో!
మాహాత్మ్యంబిది నీది నేర్వనగునే మాబోంట్లకున్ యెన్నడున్

ఆ.వె॥ తాళ్ళపాక కవుల తరతరాల బొగడ
సొరిది జేసికొనిన సుకృతమాయె
వేంగమాంబ కృతుల వివరించుటయునాదు
తొంటిజన్మఫలమె తోయజాక్ష!

కం ॥ పెదతిరుమల, చినతిరుమల
కుదిరిరి యీ తాళ్ళపాక కులయుద్ధతికై
ఇదిగో వీరల కృతులను
ముదముగనాస్వాదమంది మ్రొక్కుడు హరికిన్

చం ॥ ఇదికద! భాగ్యమౌ, హరికి నింపుగ బాడిరి తాళ్ళపాకలో
ముదముగ సత్కవుల్ కొలిచి మూడుతరాలుగ కీర్తనంబులన్
అదనుగ అన్నమార్యుడును ఆతనిపుత్రుడు వానిబిడ్డడున్
కుదిరిన జన్మసత్ఫలము కూర్చెదనొక్కెడ నేను ముప్పురన్

మ.కో॥ వేంగమాంబను వుద్ధరించిన వేంకటాచలనాయకా!
రంగుగా నిను భక్తిపాడెను లాలినిద్దురబుచ్చెరా
చెంగటన్ సిరులొల్కు రీతుల చెప్పి వివరంబివ్విధిన్
కొంగుగట్టితి పున్నెమంతయు కోరునదియే ముందిరా?





సీ॥ బ్రతికుండగా తండ్రి బాటలోనే వోయి
తృప్తినిచ్చినవాడె అప్పుడగును
"ఆత్మజుండు"ర వీడు అని మెచ్చిపెద్దలు
పొగడుచుండినవాడె పుత్రుడగును
నారాయణుడు కూడ నయమైన బిడ్డంచు
తలనూచువాడు పో తనయుడనగ
దివిజేరు తండ్రికి దివ్యలోకములిచ్చు
కర్మకాండను జేయు ఘనుడు కొడుకు

తే ॥ ఇన్ని గుణములు వొడిగొన్న ఇతడె సుతుడు
ఔర! యీపెదతిరుమల అన్నమయ్య
నియమమును నిల్పి చెప్పెను నిత్యమొకటి
కీర్తనము దాను వేంకన్న కీర్తినుడివి.

ఉ ॥ జన్మల చక్రబంధముల జాడనెరుంగక మ్రగ్గు దీనులున్
చిన్మయమూర్తి సప్తగిరి శ్రీపతిచేరగ దారిజూపుటన్
జన్మనొసంగు తండ్రికిని సాటిర వీడని మెచ్చురీతిగా
తన్మయమొందుకీర్తనలు తాన్పెదతిర్మలపాడి చెప్పెరా

మ॥ అరరే! బిడ్డలు నూర్వురేటికినిరా ఆ దుష్టదుర్యోధనుల్
హరిదాసుండొకడైనమేలు గదరా! అందించ వైకుంఠమున్
తరువుల్ కోటియు చందనంపు తరుకున్ తామెట్లు సాటౌనురా?
తిరువేంకన్నను జేర్చువాడె సుతుడౌ దీప్తించురా వంశమున్

చం॥ నిలిపితి నీలవర్ణునెద, నీరజనాభుని లీలలన్నిటిన్
అలపెదతిర్మలయ్య తను అల్లెను కీర్తన, లిట్లు భావసం-
కలనము జేసి కూర్చితిని; కమ్మగపాడుదు జన్మధన్యమౌ
తొలగును పాపపంకిలము దూరపుమోక్షము సుంత చేరువౌ

# ముందుమాట

శ్రీవేంకటేశ్వరుని ఆరాధనే జీవితంగా గడిపిన తాళ్ళపాక అన్నమాచార్యులవారు 32,000 పైగా సంకీర్తనలు చెప్పారు. శ్రీవేంకట మకుటం ఆయన కీర్తనలకు సంకేతం. క్రీ.శ. 1408లో జన్మించిన ఆ మహానుభావుడు క్రీ.శ. 1503లో తన తనువు చాలించే నాటిదాకా ఆ దీక్షను కొనసాగించారు. ఆయన శ్రీనివాస సాయుజ్యం పొందిన నాటినుండి ఆయన అంతిమ కోరిక మేరకు ఆయన సుపుత్రుడు పెదతిరుమలాచార్యులవారు అదే దీక్షను కొనసాగించారు.

క్రీ.శ. 1468లో జన్మించిన పెదతిరుమలయ్య సహజ పాండితీ గరిమ సంతరించుకొన్న వాగ్గేయకారుడు. ఈయన వాడిన భాష అనేక సామెతలతోను, ఆనాటి వ్యావహారిక నుడికట్టు పదాలతోనూ అలరారుతుంటుంది. సామాన్యులకు తండ్రీకొడుకుల భాషాశైలి విడదీయుట అసాధ్యము. వీనిని చదివి నేను పొందిన దివ్యానుభూతిని పాఠకులతో పంచుకోవటమే ఈ రచన ప్రధానోద్దేశ్యం. క్రీ.శ. 1553లో ఆ ధన్యజీవి విష్ణు సాయుజ్యం పొందేదాకా ఆ దీక్ష కొనసాగించారు. ఆయన చెప్పిన అధ్యాత్మ కీర్తనలు కూడా సులభశైలిలో మనోరంజకముగా వుంటాయి. ఈ తండ్రీకొడుకులు పదసాహితీ ప్రపంచంలో సూర్యచంద్రులు.

పులి కడుపున పులే పుడుతుందన్న సత్యాన్ని నిరూపిస్తూ, పదకవితాపితామహునికి క్రీ.శ. 1493లో మనుమడు చినతిరుమలయ్య ఉదయించాడు. ఈయనకూడా తన తండ్రి దారిలోనే తరాల అంతరాలు సడలించి పదకవితకు పదునుపెట్టాడు. తన తాత భక్తి, భావగాంభీర్యం ఈయన పుణికి పుచ్చుకొన్నాడని రసజ్ఞుల అభిప్రాయం

"తాళ్ళపాక అర"లో లభించిన ఈ వాఙ్మయసంపద అంతా రాగిరేకులపై లిఖింపబడి భావితరాలకు శ్రీవేంకటేశ్వర ప్రసాదమైనది. క్రీ.శ. 1545, 1547, 1554 మరియు 1558 సంవత్సరములనాటి శాసనములలో కూడా ఈ భాండాగారము గురించి ప్రస్తావించబడినది.

ఈ ముగ్గురి రచనా వైదుష్యాన్ని పరిచయం చేయటమే ఈ రచన ప్రధానోద్దేశ్యం. తన తండ్రి పెదతిరుమలను దివికి అనుసరించిన చినతిరుమల క్రీ.శ. 1553లోనే తానూ విష్ణుసాయుజ్యం పొందాడు. అన్నమాచార్యులవారు వెలిగించిన ఆ సంగీతారాధనాజ్యోతి నేటికీ దివ్యకాంతులీనుతూనేవున్నది.





ప్రపంచంలో స, రి, గ, మ, ప, ద, ని – అనే సప్తస్వరాలు వున్నంతవరకు అది వెలుగుతూనే వుంటుంది. ద్వాపరంలో యశోదాదేవి కలియుగంలో వకుళమాలై అవతరించగా శ్రీహరి శ్రీనివాసునిగా ఆమె ఆశ్రయంలో చేరాడు. తమిళులు ఆయనను శ్రీనివాసుడనే అంటారు. అన్నమాచార్యులవారు శ్రీనివాసునే తన ఆరాధ్యదైవమైన శ్రీవేంకటేశ్వరుడని "వేంకట" మకుటంతో 32,000 పైగా కీర్తనలు చెప్పి తరించారు. కారణం యేమై వుంటుంది?

జన్మత: శైవుడైన అన్నమయ్య ఆదివన్ శఠగోపయతి చేతులద్వారా విశిష్టాద్వైతమతం స్వీకరించి అన్నమాచార్యులవారు అయినారు. ఆయనే కాదు వారి తరువాత వారి వంశస్థులంతా విశిష్టాద్వైతులే అయినారు. శఠగోపయతీంద్రులు అహోబలం వాసులయినందున అన్నమాచార్యులవారు అహోబలంలోనే మంత్రోపదేశం పొందారు. అహోబలం నరసింహుని మూలమంత్రమున అక్షరముల సంఖ్య 32. దానినే శఠగోపయతీంద్రులు అన్నమాచార్యులవారికి ఉపదేశించియందురనుట స్వాభావికమే. అన్నమయ్యకూడా అహోబలేశ్వరునిపై వేలాది కీర్తనలు చెప్పిరనుట జగమెరిగిన సత్యమే. ఆ నృసింహుని శృంగారపురుషునిగా కీర్తించుట అన్నమాచార్యుల ప్రత్యేకత. అన్నమయ్య 32000 కీర్తనలు చెప్పిన వెనుక ఆయన జీవితకాలం ముగిసినదనుట సత్యమే అయిననూ వరప్రసాద జనితులైన అన్నమయ్య 32000 కీర్తనలతో ఆయన బృహద్యత్నం ముగియుటకూడా భగవత్సంకల్పమే అయివుండవచ్చును.

ఈనాటి నాబోంట్లు, అల్పజ్ఞానులు, అల్పసామర్థ్యులు, అల్పాయుష్కులూ. అట్టివారికి ఏకాగ్రత యెలావుంటుంది చెప్పండి? వీరు జంటలేనిదే బ్రతకలేరు; ముగ్గురైతే ముచ్చట్లు; నలుగురైతే నవ్వులూ చలోక్తులు; అయిదుగురైతే అనవసర విషయాలు; ఆరుగురైతే అర్థంలేని రాజకీయాలు; ఏడుగురైతే ఎగతాళి; ఎనిమిదిమందయితే ఎదురుదాడి; తొమ్మిదిమంది అయితే దొమ్మి దొమ్మీ; పదిమంది అయితే పడరానిపాట్లు.

మనబోటివారు 32 అన్నమయ్య కీర్తనలు నేర్చితే... అదే ఒక ఘనకార్యం. పైగా 32 విశిష్టమైన సంఖ్య అని తెలుసుకొన్నాము కదా! నేను ఈ నా ప్రయత్నంలో 32 అన్నమయ్య భక్తి కీర్తనలు, 32 పెదతిరుమలయ్య శృంగార కీర్తనలు, 32 చినతిరుమలయ్య అధ్యాత్మ కీర్తనలు, 5 తరిగొండ వెంగమాంబ

మంగళహారతి కీర్తనలు వివరిద్దామని సంకల్పించాను. శ్రీవేంకటేశ్వరుని కృపవుంటే కుంటివాడు ఏడుకొండలెక్కినట్లు నేనూ కృతకృత్యుడనవుతాను. సందేహం లేదు.

మనుష్యునికి ఆ మాయదారి దేవుడు బుద్ధి వికసిస్తున్న కొద్దీ అరిషడ్వర్గాల పీడ అంటగడతాడు. కామం వల్ల శృంగారభావనలు కలుగుతాయి. కొన్నాళ్ళు దాంట్లో కొట్టుకొనిపోయి శ్రీహరి కృపతో ఒకనాడు వైరాగ్యం కలుగుతుంది. అది భక్తికి పునాది వేస్తుంది. చివరికి జన్మల చక్రబంధంలో సతమతమై ఏదో ఒకనాడు వైకుంఠ ప్రాప్తితో మోక్షం దక్కించుకొంటాడు. ఈ వైకుంఠపాళిలో ఆ స్వామి ఆశల నిచ్చెన లెక్కిస్తూనే వుంటాడు. కోరికలనే పాములతో కరిపిస్తూనేవుంటాడు. నిరాశ చెందక శ్రీనివాసునే శరణని న్యాయబద్ధుడై ఆడితే తప్పక నెగ్గి మోక్షం పొందుతాడు. ఆ తరువాత జయమంగళం నిత్య శుభమంగళం అవునా?

తిరుపతికి 100 కి.మీ దూరంలో పశ్చిమాన తరిగొండ అనే గ్రామం వున్నది. అక్కడ వెలసిన జాతిరత్నం తరిగొండ వేంగమాంబ. ఈమె జీవితకాలం చరిత్రకారులు క్రీ.శ॥ 1780 నుండి క్రీ.శ॥ 1817గా నిర్ణయించారు. సంసార జీవితం త్యజించి తిరుమలచేరుకొని స్త్రీ అయినందున మొదట వ్యతిరేకత నెదుర్కొన్నా తరువాత ఆమె భక్తితత్పరతవల్ల ఆదరింపబడింది. తుంబురకోనలో స్థిరనివాసమేర్పరచుకొని సాంఘిక వివక్షతనెదిరించి సంప్రదాయంపేరిట జరిగే వివక్షను వెంగమాంబ వేలెత్తి చూపింది. శివకేశవులకు అభేదం ప్రతిపాదించి ఎన్నో యక్షగానాలు, పద్యాలు, ద్విపద కవితలు ఆశుగేయాలు చెప్పింది. వేంకటేశ్వరునికి, తిరుమలలో ఏకాంతసేవ జరిగే సమయంలో ఆనాడు ఈ కవయిత్రి స్వామికి హారతినిస్తూ పాడుతూవుండిన మంగళగీతికను ఈ"అన్నమయ్య- అనుయాయుల" అంతిమ కీర్తనగా అందించడం అమరవాది వంశం చేసుకొన్న అజరామర పుణ్యం.

భక్తి కీర్తనలు జనబాహుళ్యం పొందినవిగా ఎన్నుకోవటానికి ప్రయత్నించాను. వీటి ప్రధానోద్దేశ్యం నిత్యమూ పాఠకులు గానం చేయాలనే. వీటిలో సాధ్యమైనన్ని సంస్కృత కీర్తనలు వుండేలా ప్రయత్నించాను. శృంగారకీర్తనలు వాఙ్మయ విశిష్ఠత పరిచయం చేయాలనే ప్రధానాశయంతో ఎన్నుకోబడినాయి. అధ్యాత్మ కీర్తనలు అందులోనూ చినతిరుమలయ్యవి భక్తి, రక్తి, విరక్తి రుచిచూపాలనే సంకల్పంతో యెన్నుకొన్నాను. ఇటువంటి బృహత్ ప్రయత్నంలో పొరబాట్లు తప్పులూ లోపాలూ వుండటం ఎంతో సామాన్యం. బుధజనులు ఉదారహృదయంతో మన్నిస్తారని





భావిస్తాను. ఎంత త్రాగినా తృప్తి దీరనిది హరినామ రసాయనం. దాని మాధుర్యం అనుభవిస్తేనేగాని తెలియదు. అది గత జన్మల సుకృతం వలన మాత్రమే లభిస్తుంది. శ్రీహరే స్వయంగా అన్నమయ్యను తనవైపు తిప్పుకొన్నట్లు మనము గ్రహించాము కదా! అట్లాగే ఎం.టెక్‌నని యమటెక్కుతో కొన్ని ఇన్‌స్ట్రుమెంట్స్ నేనే సృష్టించానని గర్వించి డబ్బే ముఖ్యం అని జీవించి అవిటివాడినై చివరి దశలో ఆ ఏడుకొండలవాడి దారిలో చేరాను. దాని పర్యవసానమే ఇది.

అందుకే 32 పెదతిరుమలయ్య రక్తి (శృంగార) కీర్తనలు, 32 చినతిరుమలయ్య విరక్తి (ఆధ్యాత్మ) కీర్తనలు, 32 అన్నమయ్య భక్తి కీర్తనలు, 5 తరిగొండ వెంగమాంబ మంగళహారతి కీర్తనలు ఒక్కచోట చేర్చి, వాటికి 'అవతారిక'లనే ఉపోద్ఘాతాలు, 'భావవివరణ'లనే తాత్పర్య విశేషములను జోడించి... ఈ నా ప్రణాళికకు ఆలోచించి, అన్నమయ్య - అనుయాయులు అని పేరుపెట్టాను. అనుయాయులు అంటే అనుసరించినవారు అని అర్థం. ముఖచిత్రం చూడండి.

ఈ ముందుమాట ప్రధానోద్దేశ్యం కీర్తనల విభజన వివరించడమే. ఇక్కడే ఈ కవుల జీవిత చరిత్ర చెప్పాలంటే, సాధ్యమయ్యే పనికాదు.

అవతారికలు సాధ్యమైనంత క్లుప్తంగా, భావవివరణలు సాధ్యమైనంత వివరంగా వ్రాయడానికి ప్రయత్నించాను. శృంగారకీర్తనలలో వయసురాని, వయసుమళ్ళినవారి సౌకర్యార్థం గోప్యం అవసరమై ప్రతిపాదించబడింది.

తిరుమల తిరుపతి దేవస్థానాలవారి గ్రంథాలు, శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులవారి రచనలు ఎనలేని సహాయం అయ్యాయి. సంస్కృతం తెలియని నాకు ఓపికగా సంస్కృత కీర్తనలు వివరించిన శ్రీ శంకరచంద్ర పవన్ గారికి సర్వదా కృతజ్ఞుడను.

నా ఇతర రచనలన్నీ www.geetadeeksha.com అనే వెబ్‌సైట్‌లో పాఠకులకు లభ్యమవుతాయి. ప్రతి ప్రాణిలోను పరమాత్మను దర్శిస్తే ఇక మనుష్యులు సాధించవలసిందేమీవుండదు. "అంతయు నీవే హరి పుండరీకాక్ష" అన్నారు అన్నమయ్య. రక్తి, విరక్తి, భక్తి వంటి మెట్లెక్కినవాడికే "ముక్తి". ఎక్కనివాడు దిక్కూమొక్కులేక అక్కడికక్కడే నిక్కుతాడు. ఆప్తులారా! ఇక చదవండి.

## పెదతిరుమలచార్య శృంగార కీర్తనలు

సంపుటి: 17  కీర్తన : ఇతవుసేసినవారి కిది కాదా యమ్మలాల
సంఖ్య : 33  పుట : 22  రాగం: రామక్రియ

### రామక్రియ

1 ఇతవుసేసినవారి కిది వాటా యమ్మలాల
కతలు చెప్పఁగఁ బోతే కాఁక రేఁగీ నితఁడు ॥ పల్లవి॥

కడు దప్పిదేరఁగాను కప్పుర మియ్యఁగఁ బోతే
వుడికి తిట్టఁగవచ్చీ నో యమ్మ వీఁడు
వడియుఁ జెమట తుడువఁగఁబోతే పయ్యదను
తడిపొఁత మెడ గొంత తలమనీ నితఁడు ॥ఇతవు॥

కురులు చెదరినవి కూడఁ జెరుగఁగఁ బోతే
విరసాల విదలించివేసీనే వీఁడు
సరుగఁ గస్తూరిబొట్టు చక్క తిద్దఁ బోతేను
వురిసీ నందుకుఁ దో దుప్పని నితఁడు ॥ఇతవు॥

సిగ్గుతో విజనగరసింగారవనములోన
వెగ్గళించి కోనేటి శ్రీవేంకటేశుఁడు
నిగ్గుల నన్నుఁ గూడఁగా నిజాన మెచ్చఁగఁ బోతే
వొగ్గి మాటలబెల్లాల కొడిగట్టీ నితఁడు ॥ఇతవు॥33

**అవతారిక:**

అన్నమాచార్యులవారి సుపుత్రుడు పెదతిరుమలాచార్యులవారు చెప్పిన సరస శృంగారకీర్తన నాస్వాదించండి. ఇది విజయనగరంలోని శృంగారవనము అనే చోట వెలసిన కోనేటి వేంకటేశ్వరునిపై చెప్పిన కీర్తన. నాయిక తన చెలికత్తెలతో చెబుతున్నది. "ఓ అమ్మలారా! మంచి చేసినవారికి ఇది వాటా? (తిప్పలా)? జరిగింది చెప్పబోతే ఎందుకీయన





చిరుబురులాడుతాడు?" అని ఆయన చేష్టలన్నీ వివరిస్తున్నది. ఆయన కూటమిని మనస్ఫూర్తిగా మెచ్చుకుంటే కూడా వొగ్గి మాటల బెల్లాల కొడిగట్టీనితడు - అంటున్నారు. అంటే...?

**భావ వివరణ:**

ఓ అమ్మలారా! ఇదెక్కడి అన్యాయం? ఇతవు (హితము) చేసినవారికి ఇది వాటా (తిప్పలా?) కతలు (జరిగిన సంగతులు) చెప్పబోతే ఇతడు కాక రేగీని (మండిపడుతున్నాడు).

ఓ అమ్మలారా! దూరంనుంచి వచ్చాడులే, పాపం కడు దప్పికతో నున్నాడేమోనని కర్పూరతాంబూలం ఇయ్యబోయాను. ఉడుకుకొని అడ్డమైన తిట్లు తిడుతున్నాడు. తన వంటికి బట్టిన చెమటను మెల్లగా నా పైటకొంగుతో తుడువబోతే, ఆ తడిపైటనే నా గొంతుకు ఉరిలా బిగించి రుసరుసలాడినాడు.

ఓ అమ్మలారా! చెదరిన తన కురులను (ముంగురులను) నేను చక్కగా సవరించబోతే, వీడు ఎంత విరసుడు!! నన్ను విదిలించివేసినాడు. తన నుదుట నున్న కస్తూరి తిలకం చెదిరిపోయిందని నేను మళ్ళీ చక్కగా దిద్దబోతే ఉరిసీ (నన్ను ఉరిమినట్లు చూచాడు). అందుకు ఏమాత్రం సహకరించలేదు.

ఆ తరువాత చల్లబడిన అతడు తన ప్రవర్తనకు తనే సిగ్గుపడ్డాడు. ఎందుకంటే, విజయనగరం (హంపీ విజయనగరం) సింగారవనము (శృంగారవనము)లో నెలకొన్న ఈ కోనేటి శ్రీవేంకటేశుడు ఎక్కువ సిగ్గరి. ఆయన, నిగ్గుల నన్ను గూడగా (ఉత్కృష్టుడై నన్ను రమించగా) నిజానమెచ్చబోతే (మనస్ఫూర్తిగా మెచ్చుకొనబోతే), వొగ్గి (అన్నీ వదిలేసి) మాటలబెల్లాల కొడిగట్టీనితడు (మాయమాటలు చెప్పటానికి సిద్ధపడ్డాడు).

సంపుటి: 17 కీర్తన : ఏమి నీ కింత బలువు యెవ్వరిచ్చిరి
సంఖ్య : 386 పుట : 223 రాగం: రామక్రియ

## రామక్రియ

2. ఏమి నీ కింత బలువు యెవ్వ రిచ్చిరి
మామీఁదిచలములు మాను మన్నా మానవు ॥ పల్లవి॥

వాడుమోము వంచి నీతో వలపు చెప్పితినో
కూడు మని బత్తి నీకు గొట్టానఁ బెట్టితినో
యేడనుండో వచ్చి నీవు యిచ్చకము లెల్ల నాడి
వోడక వేఁడుకొనేవు వోపనన్నా మానవు ॥ఏమి॥

వట్టి చనవు సేసుక వద్దికి వచ్చితినో
రట్టు తోడ రమ్మని యాఅడిఁ బెట్టేనో
గుట్టుతో నుండక నన్ను కొంగువట్టి తీసినీవే
తట్టువడఁ బెనఁగేవు తగ దన్నా మానవు ॥ఏమి॥

కన్ను లార్చి నీమీఁద కాఁకలు చల్లితినో
తిన్ననిమాటల తరితీపులు సేసితినో
కన్నచో శ్రీవేంకటాద్రికడపరాయఁడవై
సన్నలఁ గూడితి వింకాఁ జాలు నన్నా మానవు ॥ఏమి॥ 386

**అవతారిక:**

దేవుని గడప (నేడికాలంలో కడప)లో నెలకొన్న కడపరాయునిపై చక్కటి శృంగార సంకీర్తన చెబుతున్నారు పెదతిరుమలయ్య. తిరుమల చేరటానికి ఆనాడు అందరూ దేవుని గడపలో స్వామి ఆశీస్సులు పొంది ఆ తరువాత తిరుమలకి నడక ప్రారంభించేవారట. ఏమయ్యా స్వామీ! మాపై నీకు ఇంత అధికారం ఎవరిచ్చారు? మామీద నీకు ఇంత మచ్చరము యెందుకు మానుమన్నా మానవు, అంటున్నారు. సన్నల గూడితివి అంటే





మాపటివేళ రమింతువు అని అని అర్థం.

తరి తీపులు చేయటం అంటే ఆపేక్ష చూపించటం అని అర్థం. ఈ కీర్తనపాడే నాయిక ఏమంటున్నదో చదవండి.

**భావ వివరణ:**

ఓ కడపరాయా! ఏమిటయ్యా? నీకు ఈ బలవు (అధికారము) ఎవ్వరిచ్చారు? మామీద చలములు (మచ్చరము) దేనికి? అందువలన మమ్ము ద్వేషించుట మానుమన్నా మానలేకున్నావు.

సిగ్గుతో వాడిన మొగము వంచి నీకు నా వలపు నెరింగించితినా? నన్ను కూడుమని బత్తితో (భక్తితో) నీకు గొట్టానవెట్టితినా (బజారులో పెట్టానా?) అన్నీ చేసింది నీవే కదా! ఎక్కడనుండో వచ్చావు నాతో ఇచ్చకపు మాటలు (పైపై ప్రియవచనములు) ఆడినావు. ఈ రోజు ఓటమినంగీకరించక నన్ను బ్రతిమిలాడి వేడుకొంటున్నావు. నేనిది సహించలేను స్వామీ! అన్నప్పటికీ నీ ప్రయత్నం మానవు.

ప్రభూ! వట్టి చనవుసేసుక (వుత్తుత్తి అనురాగం ప్రదర్శించి) నేను నీ దగ్గరకు వచ్చితినా? రట్టుతో (నానా యాగీ చేసి) నిన్ను నా వద్దకు రమ్మని ఆరడిబెట్టితినా (ఇబ్బంది పెట్టానా?) నీవే ఇన్నీ చేశావు. గుట్టుతో (గుంభనంగా) వుండక అందరూ చూస్తుండగా నా చీరె కొంగుబట్టి లాగావు. తట్టువడ బెనగేవు (అందరికీ వినిపించేటట్లు నాతో పోట్లాడావు). ఇది తగదన్నా మానవు. ఇక నేనేమి చేయగలను?

నా ప్రయత్నం నేనూ చేశాను. నా కళ్ళను ఆర్చి (కదలించి) నీమీద కాకలు చల్లాను (నిప్పులు కురిపించాను). నేరుగా మాట్లాడి తరితీపులు సేసితినో (నా ఆపేక్షను ప్రదర్శించాను). సరే, నేడు గమనిస్తే శ్రీవేంకటాద్రి గడపలో నెలకొన్న కడపరాయుడవై నన్ను సన్నలుగూడితివి (మాపటివేళ రమించితివి). మహానుభావా! ఇంక చాలునన్నా మానవు.

సంపుటి: 17 కీర్తన : ఉంగరము సీతవొద్ది కొగి నంపినవానికి
సంఖ్య : 436 పుట : 252 రాగం: లలిత

**లలిత**

3\. ఉంగరము సీతవొద్ది కొగి నంపినవానికి
వుంగరాలు వేళ్లనిండా నొనరించరే ॥ పల్లవి॥

మద్దులు విఱిచిన మనపిన్న క్రిష్ణునికి
మద్దికాయ లమరు నెమ్మదిఁ బెట్టరే
గద్దించి రావిమానై కాంతలఁ బొందేవానికి
ముద్దుగారే రావిరేక ముంగురులఁ గట్టరే ॥ఉంగర॥

ఘంటాకర్ణునిభక్తి గైకొనేటివానికి
ఘంటలు మొలనూళ్లుఁ గట్టరమ్మా
గెంటక గోరనే దైత్యుగీరి చంపినవీనికి
జంట పులిగోరు మెడఁజక్క గట్టరే ॥ఉంగర॥

పాదముననే బండి పడఁ దన్నినవీనికి
పాదపుగజ్జలందెలు వాని యిడరే
గోదిలి గోవర్ధనపుఁగొండ యెత్తినవానికి
యీదెస శ్రీవేంకటాద్రి యెక్కి యాడఁదగునే ॥ఉంగర॥436

**అవతారిక:**

తన తండ్రి అన్నమయ్య భావపటిమ సంతరించుకొన్న సుపుత్రుడు పెదతిరుమలాచార్యులవారు. ఆనాడు సీతవద్దకు తన బంటు హనుమతో తన గుర్తుగా ఉంగరమును పంపిచిన ఈ స్వామికి నేడు వేళ్ళనిండా వుంగరాలను ధరింపచేయండి అంటున్నారు. ఈ కీర్తనలో ఆయన ప్రస్తావించిన కొంతమంది కథలు నేటి తరాలకు పరిచితం కావు. ఆ కథలను విపులంగా ప్రస్తావించటం కూడా స్థలాభావం వల్ల సాధ్యం కాదు.





అయినా ఈ కీర్తన వివరణ మనకు పెదతిరుమల పాండితీగరిమను పరిచయం చేస్తుంది. రసజ్ఞులు దీనినాస్వాదించండి.

**భావ వివరణ:**

సీతాదేవి వద్దకు తన ముద్దుటుంగరమును గుర్తుగా తన బంటు హనుమతో పంపిన ఈ దేవదేవుని వ్రేళ్ళకు నిండా ఉంగరాలను తొడగండే.

ఆనాడు బాలకృష్ణునివలె పాకుతూ, తనను కట్టివేసిన రోటిని రెండు మద్దిచెట్ల మధ్యనుండి లాగి వాటిని విరిచి మణికంఠునికి, నలకూబరునికి శాపవిమోచనమిచ్చిన చిన్నికృష్ణుని చెవులకి మద్దికాయలు (ఒక రకమైన చెవి దిద్దులు) నెమ్మదిగా అలంకరించండి. రావి చెట్టుకింద గద్దించి (బెదిరించి), కాంతలను (గోపికలను) కూడినవానికి, రాగివర్ణంతో మెరిసిపోతున్న ముద్దొచ్చే ముంగురులను చక్కగా కట్టి అలంకరించండి.

ఘంటాకర్ణుడనేవాడు తనకు హరినామం వినపడకూడదని చెవులకు గంటలు కట్టుకొని తిరిగాడట. ఈయన వాడివెంటపడి వాని బుద్ధి మార్చి తన భక్తుని చేసికొనినాడట. అటువంటి భక్త జనోద్ధరునికి గంటలున్న మొలత్రాడు కట్టి అలంకరించండి. ఆనాడు హిరణ్యకశిపుడు తనకు ఏ ఆయుధముతోను చావురాకూడదని వరం పొందితే, తను నృసింహుడై, గెంటక (ఆ వరం తిరస్కరించక) గోళ్ళతోనే గీరి వాడిని అంతమొందించాడు. అట్టి, ఈ దేవదేవునికి నేడు 'జంటపులిగోర్ల గొలుసు' మెడలో కట్టండి.

బాలకృష్ణుని శకటాసురుడు బండి రూపంలో సంహరించటానికి కంసునిచే నియోగించబడ్డాడు. చిన్ని పాపాయియైన కృష్ణుడు చాచి కాలుతో ఒక్కతన్ను తన్ని ఆ బండిని నుగ్గునుగ్గు చేశాడు. అట్టి ఈ స్వామి పాదాలకు గజ్జెలున్న కాలి అందియలు అలంకరించండి. గోదిలి (తనవారిని కాపాడవలెనను మమకారముతో) గోవర్ధన పర్వతమునెత్తి దానిక్రింద రేపల్లెవాసులను ఇంద్రుని వడగళ్ళవాననుంచి రక్షించిన ఈ మహానుభావునికి, ఇక్కడ నేడు శ్రీవేంకటాద్రినెక్కి ఆడిపాడి సన్నుతించవలెను కదా!

సంపుటి: 17 కీర్తన : ఒయ్యన చేరి పాదా లొత్తవమ్మ
సంఖ్య : 396 పుట : 229 రాగం: రామక్రియ

## రామక్రియ

4\. ఒయ్యన చేరి పాదా లొత్తవమ్మ
తియ్యని నోరనే మాట తియ్యవమ్మా ॥ పల్లవి॥

పదియారువన్నెబొమ్మ పట్టపు వొలుకేమమ్మ
యెదురుగొండ లెక్కితి వేమమ్మ
పెదవిపై వాదులనే బేఁట్లు రాలి తమ్మ
యిదివో నీపతితోడ నింత వద్దా అమ్మా ॥ఒయ్యన॥

అతనునిఁ గన్నకొమ్మ హరియఱచేతి నిమ్మ
యితని యలుక దేర్చ వేమమ్మ
మతకాలే నెరపేవు మదము చెక్కులఁ గమ్మ
యితవరిపతితోడ నింత గద్దా అమ్మ ॥ఒయ్యన॥

యీవిఁ గల్పకపు రెమ్మ యింటిలో దాఁచిన సొమ్మ
యీవిభుఁ దప్పక చూచే వేమమ్మ
శ్రీవేంకటేశుఁడైన శ్రీనరసింహునితోడ
యీవేళనే యెక్కుకొంటి వింత గద్దా అమ్మా ॥ఒయ్యన॥ 396

**అవతారిక:**

అహోబల నారసింహుని దేవేరియైన శ్రీలక్ష్మికి తన భర్తనెలా వశపరచుకోవాలో ప్రబోధిస్తున్నారు పెదతిరుమలాచార్యులవారు. ఒయ్యన అంటే మెల్లగా అని అర్థం. మరి ఆయన ఉగ్రనరసింహుడు. అందుకని పాదములనొత్తి తీపిమాటలతో తియ్యవమ్మా అంటున్నారు. అంటే దారికి తెచ్చుకోవడమన్నమాట. అన్నమయ్య తన ప్రజ్ఞనంతా పుత్రునికి వరప్రసాదం చేశారేమో అనిపిస్తుంది. శ్రీ నరసింహునితో ఈ వేళనే





మొక్కుకొంటిని, ఇంత కద్దా! అమ్మా! అంటున్నారు. ఆనాటి వ్యావహారిక తెలుగే ఈనాటికి వివరణ అవసరమైనదంటే... అది మన దురదృష్టం. అంతే. ఎంత మధురమైన భావసౌందర్యం!!

**భావ వివరణ:**

తల్లీ! శ్రీదేవీ! నీవు నీపతివద్ద ఒయ్యన చేరి (మెల్లగా చేరి) ఆయన పాదముల నొత్తవమ్మా! తియ్యని (మధురమైన) నోటితో మధుర సంభాషణలు చేసి ఆయనను తియ్యవమ్మా (దారికి తెచ్చుకోవమ్మా!)

అమ్మా! నీవు పదియారు వన్నెల బంగారు బొమ్మవు. నీవు రాజసపు ఠీవిలొలుకుచున్నావు. ఈ నారసింహుడు వెలసిన ఎదురుకొండపై నీవునూ వెలసినావు. బెట్టుసరిచూపి నీ భర్తతో వాదులాడుచున్నావు. ఇదిగో ఎంతైనా ఆయన ఉగ్రనరసింహుడు. ఆయనతో ఇంత వద్దా (అనుకూల్యమా?) తల్లీ!.

నీవు "అతనుని" (మన్మథుని) కన్న సుందరాంగివి కదా! అందుచేత నీవు హరి అరచేతి నిమ్మవు (కరతలామలకవు... అనగా ఎప్పుడు అవసరమైతే అప్పుడు వుపశమనమిచ్చు దానవు... అని అర్థం). మరి ఈ స్వామి ఇప్పుడు అలిగియున్నాడు. ఈయన అలుకనెందుకు తీర్చవు? మదము చెక్కులగమ్మ (చెక్కిళ్ళపై అద్దిన కస్తూరి వ్యాపించగా) నీవు మతకాలు నెరపేవు (ఆయనను సమ్మోహన పరచెదవు). ఇతవరిపతితో (అనుకూలుడైన భర్తతో) ఇంత కద్దా (దిట్టతనమా) తల్లీ!

నీవు ఈవి గల్పకపురెమ్మవు (ఈప్సితములను తీర్చు కల్పవృక్షపు తొబుట్టువవు). ఇంటిలో అందరు దాచుకొనే సంపదవు. ఈ విభుని (జగన్నాథుని) తప్పక చూచేవేమమ్మా? (అట్లా తేరిపారచూచెదవేమమ్మా?) అక్కడ తిరుమలలో శ్రీవేంకటేశ్వరుడైవున్న ఈ అహోబలనృసింహునితో ఈవేళ యెక్కుకొంటివి (సింహాసనం అధిష్టించియున్నావు). ఇంత కద్దా (దిట్టతనమా) తల్లీ!

సంపుటి:17  కీర్తన : తమక మేలే యింకను నీతలఁపు లాతఁ డెఱుఁగు
సంఖ్య : 126  పుట : 75  రాగం: భైరవి

## భైరవి

5. తమక మేలే యింకను నీతలఁపు లాతఁ డెఱుఁగు
సముకమందు నేఁడు నీ చలములెల్లాఁ దీరీని ॥ పల్లవి॥

సేయరాని బాస లతఁడే సేసెఁ గదవే నీకు
మాయదారియలుక యిటు మఱవఁ గదవే నీవు
ఆయ నాయ రావే అతఁ డదివో వున్నవాఁడు
కాయ మంటినపుడే నీ కపటమెల్లాఁ బాసీని ॥తమక॥

కన్నెనాఁడే యితఁడూ నీకుఁ గన్నువేసినాఁడూ
యెన్నరాని బిగువు యింక యేల సేయ నీవు
తన్నుఁదానే యిటకుఁ దగులఁ దీసినపుడే
నిన్నమొన్నఁ గలవి తన నింద లెల్లఁ బాసీని ॥తమక॥

చిందనూరిలోన నీకు చేయి చాఁచె నితఁడూ
మందెమేళ మేలే వాని మానలేవు నీవు
కందు వలర నగుతా యిట్టె కనకరాయఁ డిపుడూ
విందువలెనే యెనసె శ్రీవేంకటేశుఁ డితఁడు ॥తమక॥ 126

**అవతారిక:**

చిందనూరిలో వెలసిన కనకరాయడి మీద సరస శృంగార కీర్తన చెబుతున్నారు పెదతిరుమలాచార్యులవారు. ఆ స్వామి దేవేరినుద్దేశించి పాడుతున్నారు. ఇతడు నీకై చేయి చాచెను. ఇక నీకు ఉపేక్ష దేనికి? నీవు ఎలాగూ అతనిని విడువలేవు ఎందుకంటే ఆయనే శ్రీవేంకటేశ్వరుడు. కాబట్టి ఆయనను నవ్వుతూ ఆహ్వానించు. నీ తలపులన్నీ ఆయనపై వున్నాయి. ఆయన సమక్షంలో నీ మత్సరం ఏమాత్రం పనిచేయదు.





ఆయన్ని చూడగానే పరవశించిపోయే నీవు ఆయనకు లొంగక తప్పదు... అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవీ! తమకమేలే (ఇంత పరవశమేలనమ్మా?) ఇక అతడు (ఆ కనక రాయుడు) నీతలపులు (ఆలోచనలన్నింటినీ యెరిగియున్నాడు). నేడు సముకమందు (ఆతని యెదుట) నీ చలములెల్లా దీరీని (నీ మచ్చరమంతా తీరిపోయినది).

నిజమే... ఆయన చేయరాని వాగ్దానాలు నీకు చేసినాడు. అయినా ఈ మాయదారి అలుకలు (కోపతాపాలు) నీకు యెందుకమ్మా? ఆయ నాయ రాలే (అయిందేదో అయింది ఇటు రావమ్మా!) అదిగో ఆయన నీ శరీరాన్ని తాకి నంతలోనే నీకపటము (ఉత్తుత్తి అలుకలు) అన్నీ బాసీని (వదిలిపెట్టిపోతాయి). అందుకే ఈయన ముందు నీఅలుకలు చెల్లవు.

అతడు (ఆ కనకరాయుడు) కన్నెనాటి నుండి (నీవు యౌవనవతి వైనప్పటినుండీ) నీపై కన్నువేసినాడు (వ్యామోహపడినాడు). ఇంకా నీకు పనికిరాని బిగువులు (బింకములు) ఎందుకమ్మా! తనంతట తానే ఇక్కడకు రావటానికి తగులదీసినపుడే (యత్నించినప్పుడే) నిన్న మొన్న ఆయనకు నీపైనున్న నిందలెల్లా (పితూరీలన్నీ) మటుమాయమైపోయినాయి. ఇది యెప్పుడూ జరిగేదే కదా!

తల్లీ! ఈ కనకరాయుడు, చిందనూరిలో నెలకొన్న దేవదేవుడు. ఈయన నీకోసం చేయిచాచి నిన్ను ఆహ్వానిస్తున్నాడు. నీకు మందెమేళమేలే? (ఉపేక్ష ఇంకా దేనికమ్మా?) నీవు ఎలాగూ వానిమానలేవు (ఆయనను విడచి యుండలేవు). అతడు నగుతా (నవ్వుతూనే) ఇట్టే విందువలె నిన్ను పొందినాడు. ఎందుకో తెలుసా? ఈయనే అల్లదిగో ఆ శ్రీవేంకటేశ్వరుడు.

సంపుటి: 17 కీర్తన : తీరె నీయలుక లెల్లా తిరుమాళారు
సంఖ్య : 405 పుట : 234 రాగం: దేసాళం

## దేసాళం

6. తీరె నీయలుక లెల్లా తిరుమాళారు
తీరని మోహముతోడి తిరుమాళారు ॥ పల్లవి॥

వీనుల పండువగా వేఁడుకొనీ నీవిభుఁడు
తేనెమోవి మాటాడవో తిరుమాళారు
పూనిపట్టి యప్పటిని పొద్దు గడపఁగ నేల
దీన నేమి వచ్చె నీకు తిరుమాళారు ॥తీరె॥

చక్కని నీచన్నులపైఁ జూఁచీ నాతఁడు చేయి
తక్కని నగవు లేలో తిరుమాళారు
మొక్కేవానివలెనే ముందర నిలుచున్నాఁడు, ఆ
దిక్కు చూడఁగదవమ్మ తిరుమాళారు ॥తీరె॥

కులికి శ్రీవేంకటాద్రి గోవిందరాజు నేఁప్రొద్దు
తిలకించి కూడె నట్టె తిరుమాళారు
పలుకుఁ బంతము చెల్లెఁ బైపై మీ కిద్దరికి
తెలిసితిమి మీగుట్టు తిరుమాళారు ॥తీరె॥ 405

**అవతారిక:**

తిరుపతిలో నెలకొన్న గోవిందరాజస్వామి వారి దేవేరిపై సరస శృంగార కీర్తన చెబుతున్నారు. పెదతిరుమలాచార్యులవారు. ఆ తల్లిని "తిరుమళారు" అని సంబోధిస్తున్నారు. తీరని మోహముతో నున్న ఓ తిరుమాళారూ! నీ అలుకలన్నీ తీరినవమ్మా! అంటున్నారు. "తిరుమలదేవి" అనే తెలుగు పదానికి సమానమైన తమిళ పదము అని నా భావన. ఆనాటికాలంలో ఇటువంటి తమిళ పదములు కోకొల్లలు. శృంగార రసం





ఒలికించడంలో తండ్రికి సమవుజ్జీ ఈ తిరుమలయ్య. తెలిసితిమి మీ గుట్టు తిరుమాళారు అని చమత్కరిస్తున్నారు. అందుకే కవి సర్వస్వతంత్రుడన్నారు పెద్దలు.

**భావ వివరణ:**

ఓ తిరుమాళారూ (తిరుమలదేవీ!) నీ అలుకలు (కోపతాపములు) అన్నీ తీరినవి (సర్దుకున్నాయి). తీరని మోహముతోనున్న నీవు వుపశమించినావమ్మా!

నీ విభుడు (పతిదేవుడైన) ఈ గోవిందరాజస్వామి నీ చెవులకు పండుగవలె నిన్ను వేడుకొనుచున్నాడు. తేనెలూరు అధరములున్న నీవు తీయగా ఆయనతో మాట్లాడవమ్మా! పూనిపట్టి (కావాలని) ఆయనతో అప్పటిని (విరసముతో) పొద్దు గడపుట ఏమి పని తల్లీ! దీనివల్ల నీకేమి వస్తుంది? మొగుడూ పెళ్ళాలు కొట్టుకుంటే ఇరుగు పొరుగు వారికి వినోదం కదమ్మా! ఓ తిరుమాళారూ! నీ అలుకలు మానవమ్మా!

రమ్యమైన నీ వక్షోజములపై చేయిజాచ యత్నించు ఈ స్వామిని చూడు. ఏమాత్రమూ తగ్గని చిలిపినవ్వులెట్లు చిందించుచున్నాడో చూడవమ్మా! ఆ వినయం చూశావా? నీకు మొక్కేవానివలె ఎంత విధేయత చూపుచున్నాడో!! ఆ దిక్కు చూడగదమ్మా! (కాస్త ఆయనవైపు చూడవమ్మా!) తిరుమాళారూ!

కులుకులొలుకు నీవు ఈ వేంకటాద్రి విభుడైన గోవిందరాజును పారవశ్యముతో తిలకించి ఏవేళనైనా ఆయనను కూడేవు. మీకిద్దరికీ ఈ విధముగా పలుకు బంతములు చెల్లెను (మాట పట్టింపులు తీరిపోయినవి). ఎందుకంటే అవి పైపైపంతములే కదా! (ఉత్తుత్తి పంతములు). ఓ తిరుమాళారూ! నేడు మీగుట్టు తెలిసితిమి. (మాకు మీ రహస్యం తెలిసిపోయింది). ఆయన పరమాత్మ, నీవు ఆత్మవు. మీ కలయిక అనివార్యము.

సంపుటి: 17 కీర్తన : అవతారమందె నిదె అద్దమరేతిరికాడ
సంఖ్య : 144 పుట : 85 రాగం: సాళంగనాట

**సాళంగనాట**

7. అవతారమందె నిదె అద్దమరేతిరికాడ
భవహరుఁడు శ్రావణబహుళాష్టమిని ॥ పల్లవి॥

వసుదేవుఁడు సేసిన వరతపముఫలము
పసల దేవకిపాలి భాగ్యరేఖ
దెసల సజ్జనులకు తిరమైన పుణ్యము
కొసరికె కంసుని గుండెదిగులు ॥అవతార॥

నందగోపుని యెదుటి నమ్మిన యైశ్వర్యము
కందువ యశోదకు కనకనిధి
ముందరి గొల్లెతలకు మోహపుఁ బాలజలధి
సందడి శిశుపాలునిసంహారము ॥అవతార॥

దేవతలమునులకు దివ్యమైన పరంజ్యోతి
భావించుదాసుల వజ్రపంజరము
శ్రీవేంకటాద్రిమీఁదఁ జెలఁగే కృష్ణుఁడిదివో
దావతి నరకాసురు తలగుండుగండఁడు ॥అవతార॥ 144

**అవతారిక:**

ఎవరన్నా నిష్ణాతులు ఇది పెదతిరుమలాచార్యులవారి కీర్తన అంటే ఓహో అట్లాగా అనుకోగలరే కాని ఇది అన్నమయ్య కీర్తన అంటే కాదనే మొనగాడు మచ్చుకి ఒక్కడు కూడా వుండడంటే నన్ను నమ్మండి. అంత గొప్పగా అచ్చు అన్నమయ్యవలె చెప్పిన కీర్తన ఇది. బహుశా ఒకానొక కృష్ణాష్టమినాడు చెప్పివుంటారీ కీర్తన. అద్దమరేతిరి అంటే అర్ధరాత్రి అని అర్థం. అన్నమయ్య కాలంలో చెరసాలలో వున్న నేరస్థులకు తలగుండు





అనే శిక్ష వేసేవారు. వాడు తన నెత్తిన ఒక పెద్ద ఇనుపగుండు పెట్టుకొని తిరగాలి. మరి ఈ కృష్ణయ్య, నరకాసురునికి తలగుండువంటి మొనగాడట. ఈ పెదతిరుమల వంటి వారినే "ఆత్మజులు" అంటారు.

**భావ వివరణ:**

ఇదిగో ఈ శ్రీకృష్ణభగవానుడు, అద్దమరేతిరికాడ (అర్ధరాత్రి సమయమున) శ్రావణ బహుళాష్టమినాడు, అవతారమందె (అవతరించినాడు). ఈ దేవదేవుడు భవహరుడు (భవరోగములను నివారించు మహానుభావుడు).

ఈయన వసుదేవుడొనరించిన అనేక దివ్య తపముల ఫలము. దేవకీదేవికి పసల భాగ్యరేఖ (సమృద్ధికరమైన భాగ్యములు గల్పించు భాగ్యరేఖ). దెసల (దిశదిశలయందును) సద్వర్తనుల పాలిటి స్థిరమైన పుణ్యము ఈయనే సుమా! ఈయన కంసునికి "కొసరికె గుండెదిగుట" (ఒకనాటితో తీరని గుండెమంట).

ఈ శ్రీకృష్ణుడు నందవ్రజమున తండ్రి నందగోపునికి తన వైభవమే ఈతడని నమ్మిన ఐశ్వర్యము. పెంపుడు తల్లి యశోదాదేవికి, ఈయన కనకనిధి (బంగారు పాతర). ముందరి గొల్లెతలకు (వయసులో తనకంటే పెద్దవారైన గోపికలకు) మోహవికారమును కలిగించిన పాలజలధి. ఏవిధంగా పాలజలధి దేవతల మనోభీష్టములను తీర్చినదో ఈయన గోపికల వింతవింత కోర్కెలను తీర్చాడు.

ఈ పరాత్పరుడు దేవతల, మునీశ్వరులపాలిటి ఆత్మజ్యోతి. వజ్రముతో చేసిన పంజరము దానిలో వున్న పిట్లనెలారక్షిస్తుందో, అలాతన దాసులను రక్షించే వజ్రపంజరము ఈ మహానుభావుడు. అల్లదే ఆ వేంకటాద్రిపైన వెలసిన వేంకటకృష్ణయ్య ఈయనే కదా! మనం సంతోషంగా దీపావళి చేసికొనుటకు కూడా ఈయనే కారణం. పదియారువేల రాచకన్నెలను చెరబట్టిన దావతి (కామాంధుడు) నరకాసురునికి ఈయన తలగుండు గండడు (తలగుండువంటి మొనగాడు).

సంపుటి: 17 కీర్తన : అందుకేమి దోసము అంతవాడ వౌదువయ్య
సంఖ్య : 135 పుట : 80 రాగం: సాళంగనాట

**సాళంగనాట**

8. అందు కేమి దోసము అంతవాఁడ వౌదువయ్య
గందము పూసినయట్టి కపురా (?) యిది ॥ పల్లవి॥

అప్పుడే నాతో మాటలాడి యాపెతో నాడేవు
కప్పురముదిన్ననోరి కపురా యిది
యిప్పటి నీ మేనిరేక లిటు నటు చాఁచేవు
తప్పనిరచ్చల దొరతనమా యిది ॥అప్పు॥

చాయల సన్నల రెంటా సరిఁదూఁగఁ దిరిగేవు
పాయపు మదముతోడి పంతమా యిది
చేయి చాఁచి వొండొరుల చేతులకు మొక్కించేవు
నీయంకెకు వంచుకొనే నేరుపా యిది ॥అప్పు॥

గక్కున నిద్దరి నిట్టె కౌఁగిలించుకొంటి విదె
పక్కునఁ బాలుదాగిన బలిమా యిది
మక్కువ శ్రీవేంకటేశ మమ్ము మెచ్చే వప్పటిని
మొక్కలపు రతులలో మోహమా యిది ॥అప్పు॥

**అవతారిక:**

అందుకేమి దోసము అంటే నేటి పరిభాషలో "అందులో అనుమానమేమున్నది?" అని అర్థం. పెదతిరుమలాచార్యులవారి నాయిక, స్వామితో దెప్పుతున్నది. "నీవు అంతటి వాడివే. అదిగో ఆ కనబడుతున్నది గంధముపూసినకపురా?" అని అడుగుతున్నది. కపురు అంటే సంకేతము అని అర్థం. బహుశా ఈమాట "ఖబర్" అనే పారశీక పదం నుంచి వచ్చియుండవచ్చును. ఎంత గొప్పగా "సంజాయిషీ" అడుగుతున్నదో





చూడండి. ఔరా!! మా ఇద్దరినీ (శ్రీదేవి, భూదేవి) ఒకేసారి చటుక్కున వాటేసుకున్నావు. ఇది గబుక్కున పాలుతాగిన బలముకాదు కదా! అంటున్నది. ఏమి రసహృదయమో! కదా! సాధ్యమైనంత గోప్యంగా వివరణ వుంటే... అది అంతే.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! అందుకేమి దోసము? (అందులో అనుమానించాల్సిందేముంది?) నీవు అంతవాడవే నయ్యా! ఇది, గంధము పూసినయట్టి (గంధము నీ ఒంటికి పూసిన) కపురా (గుర్తుకాదా)? ఇంకా నన్నెందుకు వంచిస్తావు?

అప్పుడే (అంతకుమునుపే) ఆమెతో మాట్లాడి ఇప్పుడు నాతో మాట్లాడుతున్నావు. ఆమె తినిన కర్పూరతాంబూలపు కపురా (వాసన యొక్క గుర్తు కాదా ఇది? నీమేనిపై వున్న ఈ రేకలు చాచేవు (దీర్ఘముగా కనబడుతూనే వున్నాయి.) తప్పని రచ్చల దొరతనమా ఇది? (పాపం! నీవు చేసే పెత్తందారీ తనము ఇదే కాబోలు.) ఎవరు చూడవచ్చారు?

సన్నల (సంధ్యా సమయం అయిందంటే) ఛాయల (చీకటిపడేదాకా) రెంటా (రెండిట్లోనూ) చెడతిరుగుతావు. పాయవు (ఈ అలవాటు మానుకోవు). యౌవనగర్వంతో కలిగిన పట్టుదల కాకపోతే ఇంకేమిటి ఇది? ఒండొరుల (ఇద్దరు భామలను) నీ చేతులు చాచి నీకు మొక్కించుకుంటున్నావు. నీ అంకెకు వంచుకునే నేరుపా ఇది? (నీవైపు తిప్పుకొనే నీ చాకచక్యమా ఇదంతా?)

ఔరా!! ఇదే ఇద్దరినీ (భూదేవిని శ్రీదేవిని) గక్కున ఇట్టే కౌగలించేవు (గబుక్కున ఆలింగనం చేసికొనెదవు). పక్కున (చటుక్కున) పాలుత్రాగిన బలము కాదుకదా! ఇది? ఓ శ్రీవేంకటేశ్వరా! మమ్ము (మా ఇద్దరినీ) మక్కువతో (ప్రేమతో) అప్పటిని (మరలమరల) మెచ్చేవు. ఇది మొక్కలపురతుల మోహమా? (అప్రతిహతమైన రతులదేలినయట్టి మోహావేశము కాదుకదా?)

సంపుటి: 17 కీర్తన : వేడుకకాడు గదమ్మ విట్టలుడు
సంఖ్య : 289 పుట : 168 రాగం: లలిత

**లలిత**

9\. వేడుకకాఁడు గమ్మ విట్టలుఁడు
ఆడా నీడా నేగి వచ్చీ నదె విట్టలుఁడు ॥ పల్లవి॥

తుంగభద్రనీటిలోన తొయ్యలులుఁ దాను నీఁదీ
వెంగలిరతులఁ దోఁగీ విట్టలుఁడు
నింగి మోచినతోపులనీడల వినోదించి
అంగనలతో నవ్వుచు నదే విట్టలుఁడు ॥వేడుక॥

తేరువీది నల్ల వాఁడే దిమ్మరై సతులఁ బిల్చి
వే రమ్మనీ చీఁకటింట్లో విట్టలుఁడు
కూరిమి నిలుపలేక కొండలపడవలలో
నారగించీ నూరవిందు లదే విట్టలుఁడు ॥వేడుక॥

అదివో విజనగరమందు వాడల వాడల
వెదచల్లీ వరములు విట్టలుఁడు
ఉదుటు శ్రీవేంకటాద్రినుండి వచ్చి గుడిలోన
నదన రుక్మిణి దాను నదే విట్టలుఁడు ॥వేడుక॥ 289

**అవతారిక:**

విజయనగరము (హంపీ)లో వెలసిన విఠ్ఠలునిపై సరస శృంగార కీర్తన చెబుతున్నారు పెదతిరుమలయ్య. ఆ స్వామి వేడుకకాడట (విలాసపురుషుడు). అక్కడా ఇక్కడా వూరేగి వచ్చాడట ఆయన. శ్రీవేంకటాద్రినుంచి వచ్చి గుడిలో తాను రుక్మిణీదేవి అదనగా వున్నారట. ఇక్కడ అదనగా అంటే తగినట్లు అని అర్థం చెప్పుకోవాల. తాళ్ళపాక కవులు సహజ పండితులైనందున వారి భావనకు 'అదనైన' అర్థం





చెప్పుకోవాలన్నమాట. పెదతిరుమలయ్య వాడిన కొన్ని మాటలకు నిఘంటువులో అర్థాలు దొరకవు. 'తేరువీధి' అంటే రథములు వెళ్ళేరహదారి. చదివి ఆలోచించినకొద్దీ ఆనందాన్ని ఇచ్చే కీర్తన ఇది.

**భావ వివరణ:**

ఓ అమ్మలారా! ఈ విట్టలుడు (విఠ్ఠలేశ్వరుడు), వేడుకగాడు కదమ్మా! (విలాస పురుషుడు) కదటమ్మా! ఈయన గొప్ప శృంగారరాయుడు. అదె (అదిగో) ఆడానీడా (అక్కడ ఇక్కడ) యేగివచ్చె (తెగ తిరిగివచ్చాడు).

ఈ తుంగభద్రానది నీటిలో తొయ్యలులు (గొల్లభామలు), తానున్ ఈది, వెంగలిరతుల (మొరటు రతిక్రీడల) దోగీ (తేలియాడి) వచ్చినాడు కాబోలు. నింగిమోచినతోపుల నీడలలో (అల్లదే ఆకాశాన్ని తాకే ఎత్తయిన చెట్ల నీడలలో), అంగనలతో (స్త్రీలతో) వినోదించి (వినోదంగా గడిపి) ఈ విఠ్ఠలుడు నవ్వుచూ ఎంత కులాసాగా వున్నాడో చూడండి.

ఈ విఠ్ఠలుడు యెంత పోకిరీవాడో చూశారా? అల్ల తేరువీధిన్ దిమ్మరై వాడే సతుల బిలిచి చీకటింట్లో వేరమ్మనీ (అక్కడ రహదారిలో చెడ తిరిగివచ్చి వాడే గోపికలను పిలిచి చీకటిగావున్న పడక గదులలోకి వేగిరమే రమ్మని పట్టుబడతాడు.) కొండల పడవలలో (కొండగుహలలో) వారిపై తనకూరిమి (వలపు) నిలుపలేక (ఆపుకోలేక) ఊర విందులు (బంతిభోజనాలు) ఆరగించీని (భుజిస్తున్నాడు). వారి జన్మలు ధన్యమైనవి.

అదిగో నేడు ఈ విఠ్ఠలుడు విజయనగరం (హంపీ) వాడలవాడల (వీధివీధీ) వూరేగుతున్నాడు. వరములను వెదజల్లుతున్నాడు. ఈయన ఉదుటువేంకటాద్రి (ఉద్ధతిగల వేంకటాచలము) నుండి వచ్చాడు. తన ముద్దులభార్య రుక్మిణీదేవితో అదె విఠ్ఠలుడు అదన (తగినట్లు) తానువున్నాడు. వారికి మొక్కి మీ జన్మ తరింపజేసికొనండి.

సంపుటి: 17 కీర్తన : చెవులారా వినేఁగాని చెప్పుమా నాకీ సుద్ది
సంఖ్య : 154 పుట : 91 రాగం: పారాయణి

### లలిత

10. చెవులారా వినేఁగాని చెప్పుమా నా కీ సుద్ది
జవళి వలపు లిట్టే చల్లుదురా ॥ పల్లవి॥

యిరవై నన్నె తలఁతు నెప్పుదు నంటా నాడేవు
తరుణులఁ బొందేవేళ తలఁతువా
యెరవు లేక నాకే యెదురు చూతు ననేవు
కరఁగి చొక్కేవేళ కను విచ్చి చూతువా ॥చెవు॥

వనజాక్ష నారూపువాసి చూతు ననేవు
వనితలచన్నులపై వ్రాతువా
చనవున నాపెకే జపియింతు ననేవు
అనుగుఁగాంతఁబిలచేయప్పుడూ జపింతువా ॥చెవు॥

యెమ్మెలతో నా నేరుపు లెంతు నంటా నాడేవు
కొమ్మలతోడుత నిట్టే కొనియాడుదువా
మమ్ము శ్రీవేంకటేశుఁడ మండెమురాఁడవై
సమ్మతి గూడే విట్టే చన విత్తువా ॥చెవు॥ 154

**అవతారిక:**

మండెము అనుగ్రామమున వెలసిన వేంగళరాయనిపై సరస శృంగారకీర్తన చెబుతున్నారు పెదతిరుమలాచార్యులవారు. 'జవళి' అంటే 'అమ్మదగిన కొత్త వస్తువు' అని అర్థం. 'జవళివలపు' అంటే నమ్మకం కలిగించే కొంగ్రొత్త ప్రేమలు అని భావించాలి. "ఓ మండెమురాయా! మా చెవులారా వింటాముగానీ, నాకీ కతలు చెప్పవయ్యా! పరాయి కాంతలమీద నమ్మకం కలిగించే కొత్త కొత్త వలపులు ఈ విధంగా చల్లుతారా!





అంటున్నది ఈ చెలికత్తె (పెదతిరుమల). పోనీ ఆయన ఆ వలపుకత్తెల ఇష్టానికి వ్యతిరేకంగా వారిని బలవంతం చేస్తాడా అంటే... అదేమీ లేదు. వారి సమ్మతితోనే ఇట్టే కూడుతాడట. మరీ అంత చనువిస్తాడట.

**భావ వివరణ:**

ఓ మండెమురాయా! నా చెవులారా వింటానుగానీ కాస్త నీ సుద్దులు (కట్టు కథలు) చెప్పుమా (చెప్పవయ్యా). ఇట్టే (సునాయాసంగా) జవళివలపులు (నమ్మకం కలిగించే కొంగ్రొత్త ప్రేమలు) చల్లుదురా (కురిపించెదవులే).

ఇరవై (సుస్థిరంగా హృదయంలో నిలుపుకొని) నన్నే ఎప్పుడూ తలచుకొంటుంటావని ఆడేవు (అంటుంటావు). నిజం చెప్పు. ఈ స్త్రీలతో రమించువేళ, నన్ను తలచుకొంటావా? ఎరవులేక (ఇంకొకదాని నిచ్చగించక) నాకోసమే ఎదురుతెన్నులు చూస్తుంటానని అంటుంటావు. నిజం చెప్పు. ఆ కామినులతో కరగి పరవశించేవేళ నాకేసి కన్నుతిప్పిఅయినా చూస్తావా?

ఓ వనజాక్షీ! (పద్మనయనా!) వాసి చూతుననేవు (కళ్ళు తెరచినా మూసినా, నా రూపమే నీకనులకు కనిపిస్తుందంటావు). మరి ఆ వనితల కుచగిరులపై నీవు వ్రాసేవ్రాతలు నా చిత్రపటములాయేమి చెప్పవయ్యా! ఆమెనెందుకు గుర్తుచేసికొంటున్నావంటే యేదో చనువు కొద్దీ అట్లా చేస్తానంటావు. మరి నీ ఇతర ప్రియురాళ్ళను నీదగ్గరకు పిలిచేటప్పుడు కూడా ఇట్లాగే ఇతరుల పేర్లు జపిస్తుంటావా? ఏమిచోద్యం!!

నా నేర్పు సామర్థ్యములపై నీకెంత గౌరవం అంటూ ఏవేవో కల్లబొల్లి కబుర్లు చెబుతావు. నాదగ్గర ఇతర కొమ్మల (యువతుల) తోడుత (కూటమిని) కొనియాడుతూనేవుంటావు. ఓ శ్రీవేంకటేశ్వరా! మండెము రాయుడవైన నిన్నే నమ్మితినయ్యా! మమ్ము ఇట్టే కూడి నీ చనువు (అనురాగము) నొసగి నాజన్మ తరింపజేయుము ప్రభూ!

సంపుటి: 17 కీర్తన : ఎమ్మెకాడవై తిరుగ నింతదొరకేటికి
సంఖ్య : 80 పుట : 49 రాగం: శుద్ధవసంతం

## శుద్ధవసంతం

11. ఎమ్మెకాడవై తిరుగ నింతదొరకేటికి
దిమ్మరిమాటల నాచేఁ దిట్టించుకోవలెనా ॥ పల్లవి॥

వూరకున్న నన్నుఁ దెచ్చి వోరి నీవు వలచిన
వూరసతులఁ జూపి న న్నుడికించేవు
మేరతో నీ కితవైతే మెడఁ గట్టుకొందు గాక
వారి నన్ను సరిచేసి వాదువెట్టవలెనా ॥ఎమ్మె॥

దవ్వులఁ గూచున్న నన్నుఁ దలఁపించి వారిచేత
యెవ్వతెంటా నడిగించి యీసు రేఁచేవు
యెవ్వతె మన్నించినా నీ వేమైనా నిత్తువుగాక
రవ్వగాని యాఁడువారి రాఁపుసేయవలెనా ॥ఎమ్మె॥

తతి నిన్ను నేఁ గూడి తనిసితే నీ తోటి
సతులచే మొక్కించి జంట సేసేవు
సతమై శ్రీవేంకటేశ సవతులయినవారిఁ
బతివెట్టవలెఁ గాక పచ్చిసేయవలెనా ॥ఎమ్మె॥ 80

**అవతారిక:**

"నీవు లోకాలనేలే దొరవు. ఇలా ఎమ్మెకాడవై (పోకిరీవై) తిరుగుట తగునా? దిమ్మరి మాటలు (అంటే త్రాగుబోతుమాటలు) మాట్లాడటం యెందుకు? నాచేత తిట్టించుకోవటం యెందుకు"? అని దెప్పిపొడుస్తున్నది నాయిక, శ్రీవారిని. పెదతిరుమల యెంత చక్కటి శృంగారకీర్తన చెప్పారో అవధరించండి. శ్రీవేంకటేశుడు సదా సవతులైన మమ్ము రక్షిస్తూ మాకు న్యాయం చేయాలి కానీ పచ్చిసేయవలెనా? అంటున్నారు. 15వ శతాబ్దం





నాటి తెలుగు అయినందువలన చాలామాటలు అర్ధం కావు. కాని అర్ధమైనట్లు అనిపిస్తాయి. సవతుల గోల యెంత బాగా చెప్పారో చూడండి.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! ఎమ్మెకాడవై (విలాసవంతుడైన జులాయివలె) తిరుగుట, ఇంత దొరకు (జగన్నాథుడవైన నీబోటివానికి) యేటికి? (యెందుకు ప్రభూ!) దిమ్మరిమాటల (వదరుబోతు మాటలు మాట్లాడి) నాతో తిట్టించుకొంటావు. ఇది నీకు తగునా?

ఓరీ! నా మానాన నేను వూరకనేవుంటే, పనివేళా తీసికొనివచ్చి వూళ్ళోవున్న నీవలపుకత్తెలను (ప్రియురాళ్ళను) చూపించి నన్ను వుడుక్కునేలా చేస్తావు. నీకు ఇతవైతే (ఇష్టమైతే) వాళ్ళని నీ మెడకు కట్టుకొని తిరుగు. కాదన్నదెవరు? కాని, వారిని నన్ను సరిజేసి (సమానంచేసి) వాదువెట్టవలెనా? (పోట్లాట పెట్టుట తగిన పనియేనా?)

ఎక్కడో దూరంగా కూర్చున్న నన్ను వారిచేత తలపించి (గుర్తుకు తెచ్చుకొనేట్లు చేసి) అదెవ్వతె అని నాగురించి అడిగిస్తావు. వాళ్ళు ఈసుతో (ఈర్ష్యతో) రగిలిపోయేటట్లు చేస్తావు. అదెవ్వతో మన్నిస్తే నీవేమైనా దానికిచ్చుకో. మధ్యలో నాకేమిటి? కానీ, రవ్వగాని (ఏనాడూ అవమానింపబడని) నాబోటి స్త్రీని రావు సేయదగునా? (నవ్వులపాలు చేస్తావా?) ఇది నీకు తగునా?

నీతో గూడి తృప్తిగావున్న నన్ను చూచి, కావాలని తోటి సవతులకు నాచే మొక్కించి, జంటసేసేవు (సమానం చేసేస్తావు). ఓ శ్రీవేంకటేశ్వరా! సవతులైనవారిని, సదా పతివెట్టవలెను (రక్షణ కల్పిస్తుండవలెను). అంతేగాని ఇట్లా పచ్చిసేయవలెనా? (అల్లరిపాలు చేయటం అవసరమా ప్రభూ!)

సంపుటి: 17 కీర్తన : గుట్టు గొంత రట్టు గొంత గులికీ గదే
సంఖ్య : 299 పుట : 172 రాగం: శంకరాభరణం

## శంకరాభరణం

12. గుట్టు గొంత రట్టు గొంతఁ గులికీఁ గదే
చుట్టమువలెనే యీ చొక్కనాథుఁడు ॥ పల్లవి॥

జగడాలమాటలు చల్లఁజూపుతేటలూ
నగుతానే యీరెండు నడపెఁ గదే
మొగమోట సిగ్గులు ముచ్చటల యెగ్గులు
సొగటులు మానఁ డిదె చొక్కనాథుఁడు ॥గుట్టు॥

పనిలేని పంతము పైకొంటే సంతమూ
నినుపుల యివి రెండు నెరపెఁ గదే
తనివోని యాసలు తబ్బిబ్బు బాసలు
చొనిపీ నూరకె నాతో చొక్కనాథుఁడు ॥గుట్టు॥

పానుపుపై జోడులు పలురతివాడులు
నానాఁట యివి రెండు నడపీ గదే
పూనిన శ్రీవేంకటాద్రినుండి వచ్చి ననుఁ గూడె
సూనాస్త్రగురుఁడైన చొక్కనాథుఁడు ॥గుట్టు॥ 297

**అవతారిక:**

"సునాస్త్రగురుడు" అంటే పుష్పబాణములు గలవాని తండ్రి అని అర్థం. అంటే శ్రీహరి. మన్మథుని అంత అందగాడికి తండ్రి, ఇంకెంత అందంగా వుండాలి? అందుకే ఆయన చొక్కనాథుడైనాడు. అంటే దోషములేనంత అందగాడన్నమాట. చొక్కనాథునిగా వెలసిన శ్రీమన్నారాయణుని కీర్తిస్తున్నారు పెదతిరుమలయ్య. ఈ చొక్కనాథుడు కొంత గుట్టుగా, కొంత





బాహాటంగా ఏదో దగ్గర చుట్టములాగ స్త్రీలతో కులుకుతుంటాడట. అంతా ఇక్కడే చెప్పేస్తే ఎట్లా? భావవివరణ చదివి పరవశించండి మరికొంచెం. ఈయన తీరే ఇంత... గుట్టుగా చెయ్యాల్సినవి రట్టుచేస్తాడు, రట్టు చేయాల్సింది గుట్టుగా చేస్తాడు. శ్రీమన్నారాయణుడు కదా!

**భావ వివరణ:**

ఓ చెలియా! ఈ చొక్కనాథుడు, మనకు దగ్గరి చుట్టమువలె కులుకుచున్నాడు. ఈయన తాను చేసేపనిని కొంత గుట్టుగా (రహస్యంగా) చేస్తాడు. కొంత రట్టుగా (నలుగురికీ తెలిసేటట్లు) చేస్తాడు.

ఈయన మాటలు చూడబోతే జగడాలమారివాని మాటలు. చల్లని చూపులు మాత్రం నిర్మలంగా వుంటాయి. ఒకపక్క నవ్వుతూనే ఈ రెంటినీ ఒకేసారి నడుపుతాడు కదటమ్మా! ఈయన సిగ్గులు మొగమాటం కలవానివలె వుంటాయి. చెప్పే ముచ్చట్లు యెగ్గులతో (అనాదర పూర్వకంగా వుంటాయి. ఈ చొక్కనాథుడు సొగటులు (నన్ను చిన్నబుచ్చుటలు) మానడు.

ఈయన పనికిమాలిన పంతాలకుపోతాడు. పైకొంటే (చొరవతీసికొంటే) స్వంతమవుతాడు. ఉపాయంతో ఈరెంటినీ ఒకేసారి నడుపుతాడు ఈయన. తనని తీరని ఆశలు చూపిస్తాడు. ఉబ్బితబ్బిబ్బు అయ్యేట్లు బాసలు చేస్తాడు. నాతో వూరకనే చొరవతీసికొంటాడు. ఈ చొక్కనాథుడు అంతటి గడుసువాడు.

పానుపుపై జోడులు (జంటలు). అనేక రతులతో వాడులు (వాడిపోవుటలు). నానాట (ప్రతిరోజూ) ఇవిరెండూ నడుపుతూనే వుంటాడు, ఈయన శ్రీవేంకటాద్రినుండి పూనికతో (పట్టుదలతో) విచ్చేసిన శ్రీవేంకటేశ్వరుడు నన్ను గూడినాడు. తీరాచూస్తే ఆయనే, సునాస్త్రగురుడైన (పుష్పబాణుడైన మన్మథుని తండ్రియని పిలువబడే ఈ చొక్కనాథుడు.

సంపుటి: 17 కీర్తన : కాంతగలనాడు యేకాంతములమాట
సంఖ్య : 296 పుట : 172 రాగం: రామక్రియ

**రామక్రియ**

13\. కాంతగలనాడుఁ యేకాంతములమాట, శ్రీ
కాంతుఁడవు నీవు యిందుకొఱకు నా కాఁక లేల కడపరాయ ॥పల్లవి॥

మానవతి నీవు చనుమానమనఁ
బెంచితి నేఁడు
పూని నే మెంత పిలిచిన రా
వనుమాన మేల కడపరాయ ॥కాంత॥
మారుఁ దంతలోనే నీ
కుమారుఁ దయ్యుండి
మారుకొనె జూడు సారె సారె
నెడమాట లేల కడపరాయ ॥కాంత॥

ఆడఁ జెలిఁ జూచి
మారాడలేక నీవు
కూడితివి శ్రీవేంకటగిరిపైఁ
గోరికమీఱఁ గడపరాయ ॥కాంత॥ 296

**అవతారిక:**

ఆఁక పెట్టడం అంటే ఆంక్షపెట్టడం అన్నమాట. ఇదిచేయవద్దు, అదిచేయవద్దు అని ఆంక్షలు పెడుతూ వుంటారు ప్రియురాళ్ళు. ఈ కీర్తనలో పెదతిరుమలయ్య శ్రీకాంతుని ప్రియురాలై ఇలా కీర్తన రూపంలో దెప్పిపొడుస్తున్నారు. "నీవు శ్రీకాంతుడవు ఇందుకని నీకు ఆంక్షలెందుకు పెడతాను. ఓ కడపరాయా! కాంతవున్నప్పుడు నీకు ఏకాంతమేమి పని" అని అంటున్నారు. నేటి కడపలో వెలసిన కడపరాయుడైన





శ్రీవేంకటేశ్వరునిపై చెప్పిన కీర్తన ఇది. శబ్దాలంకార ప్రయోగంలో పెదతిరుమల తండ్రికి తగ్గకొడుకే సుమండీ!

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీవు శ్రీకాంతుడవు (శ్రీపతివి) నీవు కోరితే ఏకాంత కాదంటుంది? ఇక కాంత గలిగిననాడు ఏకాంతము గురించి ఆలోచనలెందుకు, కనుక ఓ కడపరాయా! నీకు ఇందుకొరకు 'ఆఁక' లేల (ఆంక్షలెందుకు?)

ఆ మానవతి (అభిమానంగల స్త్రీ)తో, నీవు చను (పొందు) మానుమని నేనెంత చెప్పాను? నీవు విన్నావా? పెంచితివి. నేడు పూని (ప్రయత్నంతో) నేము (మేము) ఎంతపిలిచినా రావు. ఓ కడపరాయా! నీకు మామీద అనుమానం యెందుకయ్యా! ఇదెక్కడి అన్యాయం?

మేము మాత్రం యేమి చేయగలము? మారుడు (మన్మథుడు) నీకుమారుడై యుండి కూడా మమ్ము మారుకొనెన్ (మాఱుకొనుట... అంటే యెదిరించుట). ఆ ఎదురుదాడిని మేము తట్టుకోగలమా? ఇక చూడు నీవు ఇది అవకాశంగా తీసికొని సారెసారెకు (మాటి మాటికీ) ఎడమాటలు (పెడసరం మాటలు... లేక... పుల్లవిరుపు మాటలు) మాట్లాడుతున్నావు.

ఓ కడపరాయా! ఇది నీకు తగునా ప్రభూ! మేమంతా ఇక్కడ వున్నట్లే వున్నాం. అక్కడ శ్రీవేంకటాద్రిపై నీవు ఆడన్ జూచి (వనితారత్నాన్ని చూచి) ఆమె నీ అలమేల్మంగ కావున మారాడలేక (ఎదురుచెప్పలేక) కోరికమీఱ కూడితివి (కోరికతో పొందితివి). అవునా? (నిజానికి అదే నీ కోరిక). ఓ కడపరాయా! నిన్ను కాదనటానికి మేమెంతవారము తండ్రీ!

సంపుటి: 17    కీర్తన : మానెబోరా మాటలకికనేలా, నీకు
సంఖ్య : 298    పుట : 173    రాగం: పాడి

**పాడి**

14. మానెఁ బోరా మాటల కిఁక నేలా, నీకు
దీన నెగ్గవుత తెలియుము గాకా ॥ పల్లవి॥

సారె సారె సాదించ నేటికి రా, నీవు
గోర గీరినఁ గోపించఁ దగదా
నేర మేమైన నే నీకుఁ జేసితినా, నీవు
బీరమాడినఁ బెనఁగితిఁ గాకా ॥మానెఁ॥

చాలుఁ జాలు జంకించ నేఁటికిరా, నీవు
నాలినేసిన నవ్వఁగఁ దగదా
నీలవర్ణుఁడ నే నీకుఁ బగదాననా, నీ
పోలికెలు చూచి పొమ్మంటిఁ గాకా ॥మానెఁ॥

నీకు నీకే నిజబాస లేఁటికిరా, నీ
కాఁకమే నంటి కరుణించఁ దగదా
చేకొనరా రతి శ్రీవేంకటేశ్వరుఁడా, నీవు
జోక గూడఁగఁ జొక్కితిఁ గాకా ॥మానెఁ॥ 298

**అవతారిక:**

పెదతిరుమలయ్య చెప్పి ఈ శృంగార కీర్తనలో చాలా మెలికలున్నాయి. ఆనాటి కడప సీమలో ప్రచార్యంలో వున్న తెలుగుకి నేటి మన తెలుగుకి వున్న అంతరం గమనించండి. "పోరా! మాటలింకాయెందుకు? మానె (ఫరవాలేదులే) నీకు దీనను ఎగ్గు చేయుటయే తెలుసును. అదిగాక ఇంకేమిటి?" అని నాయిక మాటల అర్థం. పల్లవే ఇంత తికమక అయితే





చరణాలు ఎలావుంటాయో ఆలోచించండి. "జోక గూడగ జొక్కితిగాక' – అంటే ఏమిటి? ఈ రచన నాచేత చేయిస్తున్న ఆ తిరుమలేశుని ఏమని పొగడగలను? ఏనాటి పుణ్యమో ఇది?

**భావ వివరణ:**

మానెపోరా! (ఫర్వాలేదు పోరా!... పో) ఇంకా నీతో మాటలెందుకు? నీకు దీనన్ (దీనురాలిని) యెగ్గవుత తెలియుము గాక (అవమానించుటయే తెలిసివుండవచ్చును).

నన్ను సారెసారెకు (మాటిమాటికీ) సాధించుట దేనికయ్యా! నీ గోళ్ళతో అంత రక్కిపెట్టినా నేను కిమ్మనకనుండవలెనా? కోపించ దగదా (కూడదా?) నేను నీపట్ల ఏ నేరం చేశానయ్యా! నీవు బీరమాడిన (గొప్పలు చెప్పుకొంటుంటే) పెనగితిగాకా! (వద్దు అని తిరస్కరించి ఎదిరించాను కాబోలు). ఈ మాత్రానికే ఇంత మండిపడవలెనా?

చాలు చాల్లేవయ్యా! మరీ ఇంత జంకించనేటికి? (బెదరించుట దేనికి?) నీవు నాలినేసిన (వంచన చేస్తే) అది తెలసిపోయి నేను నవ్వేశాను. అది కూడా తగని పనియేనా? ఓ నీలమేఘశ్యామా! నేను నీకు పగదాననా (శత్రువునా ప్రభూ) నీ పోలికలు చూచి (నీవు నన్ను ఇతర స్త్రీలతో పోల్చి మాట్లాడుతుంటే) కోపంవచ్చి పో పొమ్మన్నాను గానీ, నీవంటే నాకు ప్రేమలేదా?

నీకు నీవే అన్ని నిజబాసలు (శపథాలు) చేయనవసరం లేదయ్యా. విరహాగ్ని తపించే నన్ను కరుణించదగదా? ఓశ్రీవేంకటేశ్వరా! నన్ను నీ సురతమున నను(గహించుము ప్రభూ! జోకగూడగ జొక్కితి గాకా! (నీవు జతయై నన్ను గూడిన పరవశమొందితిని కదా?)

సంపుటి: 17 కీర్తన : మంచమదె యిల్లదె మాట లేటికే
సంఖ్య : 81 పుట : 49 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

15. మంచ మదె యిల్లదె మాట లేటికే
నించినవేడుకతోడ నిద్దిరించు లోనను ॥ పల్లవి॥

యింటికిఁ జెప్పి యంపితి నిందాఁకా నేల రావైతి
వంటఁగాక తొలఁగితి నట్టె వుండరా
వెంట వచ్చినచెలిచే వింటిమి నీ సుద్దు లెల్లా
వొంటినైనాఁ బవ్వళించు వొక్కఁడవే లోనను ॥మంచ॥

చూచియైనాఁ బొమ్మంటిఁగా సుద్దులు చెప్పి యంపితి-
వీ చాయకు రాకు మంచ మెక్కి వున్నదాన
నీచేఁత లన్నియును నీ వెంటనే వచ్చె
కూచుండరా యిఁకనైనా కుదురయి లోనను ॥మంచ॥

యెదురు చూచితిఁగా నీ వేడ నుంటివో కాని
పదరకురా యిది పంతము గాదు
పొదిగి శ్రీవేంకటేశ పోనీక నన్నుఁ గూడితి
వుదుటై యెందునుఁ బోక వుండరా యీ లోనను ॥మంచ॥ 81

**అవతారిక:**

కాంత పురుషునికి వేసే కఠినశిక్ష ఏకాంత శయ్యాశయనమే. అమ్మవారికీ అదే ఆయుధం కాబోలు. అలిగిన దేవి అంటున్నది "అదిగో మంచం... అదిగో పడకటిల్లు... ఇంకానీతో మాటలెందుకు? బాగా సంతోషంగా లోపల ముడుచుకొనిపడుకో... పోవయ్యా! పో". తండ్రిని మరపించే కవితా చమత్కృతివున్న వాగ్గేయకారుడు పెదతిరుమలయ్య. ఆ భావమాధుర్యాన్ని ప్రతిఫలించలేకపోవటం నా అసమర్థతయే సుమండీ.





కవివ్రాసిన ఒక్క అక్షరం సరిగా ముద్రింపబడకపోయినా అర్థం అపార్థం అయ్యే ప్రమాదం వున్న కీర్తన ఇది. ప్రయత్నమే నాది, ప్రసాదం స్వామిది. అంతే మరి.

**భావ వివరణ:**

అదిగో మంచం... అదే యిల్లు (పడకటిల్లు అదిగో) మాటలేటికి (నీతో అనవసరమైన మాటలు దేనికి) నించిన వేడుకతో (బాగా సంతోషంగా) లోనను (లోపలికెళ్ళి) నిద్దురించు (పడుకోపో).

ఇంటికి (నీ ఇంకోపెళ్ళాం ఇంటికి) చెప్పి కబురు పంపించాను. ఇందాకా యేల రావైతివి? (ఎందుకు రాలేకపోయావు?) ఇదిగో ఇప్పుడు వచ్చావు. ఇంకా నా వంట కాలేదు. పక్కకు తప్పుకొని కాస్త అక్కడే వుండరాదా? అదిగాక నీవెంట వచ్చిందే ఆ చెలికత్తె... అది నీసుద్దులు (నీ సంగతంతా) చెప్పిందిలే. నాకు ఇంకా కోపం తెప్పించకు అదిగో నీ పడకటింట్లో నీ వొక్కడివే పడుకో పోవయ్యా! నన్ను విసిగించకు. పో!

ఇంకోరోజు, నన్ను చూచికూడా బొమ్మంటిగా (వెళ్ళిపొమ్మన్నావు). సుద్దులు చెప్పి పంపితివి. (ఆరోజు కూడా కట్టుకథలు చెప్పి నన్ను పంపించేశావు). ఈ చాయకు రాకు (అసలు ఈవైపుకే రాబోకు). నాకు నిద్రవస్తోంది. మంచంమీద వున్న నన్ను చూచి నీచేతలన్నియు కృత్రిమమే. అవన్నీ ఇప్పటికిప్పుడు నీవెంట వచ్చాయి. పోనీ, ఇకనైనా కుదురుగా కూర్చోవయ్యా! లోపల కుదురుగా వుంటావా?

నీవు యేడనున్నావో కాని, ఇంతసేపూ నీకోసం ఎదురు తెన్నులు చూచాను. ఎంత తపించానో తెలుసా. పదరకురా (కోపించకురా!) ఇది నాపట్టుదలకానేకాదు. నేను నీదాననే ప్రభూ! ఓ శ్రీవేంకటేశ్వరా! నన్ను పోనీక (వదలక) పొదిగి కూడితివి. ఉదుటై (ఉద్ధతితో) లోననే వుండవయ్యా! (నామనస్సులోనే నిలిచిపో) ఎందునుబోకుము (నన్ను విడచి యెక్కడికీ పోకు).

సంపుటి: 17 కీర్తన : వెగ టాయనో కాక విరసమో తమలోన
సంఖ్య : 539 పుట : 311 రాగం: హిజ్జజి

**హిజ్జజి**

16. వెగ టాయనో కాక విరసమో తమలోన
చిగురుఁ గైదువవాఁడు చేసినట్టి మాయలో ॥ పల్లవి॥

వెన్నెలలు గోలుఁ గాక వేడుకఁ జకోరాలు
వెన్నెల లుమియఁజొచ్చే విధ మేఁటిదే
సన్నపుఁదుమ్మెద లెల్లా జలజమే చేరుఁ గాక
సన్నల నొకటొకటి జారిన దేఁటిదే ॥వెగటా॥

జలమును లత లెల్లా సరి దాఁజేకొనుఁ గాక
జలము తాఁ గుమ్మరించే జాడలేఁటికే
మెలుపుసంపెంగ వుమీఁదగాలి మించుఁ గాక
పొలసి సంపెంగలోనఁబొడమునాగాలి ॥వెగటా॥

జక్కపలుజంటగూడిసమ్మతించుఁగాక నేఁడు
జక్కవ లొండొకటితో జరసీ నేమే
యెక్కువ శ్రీవేంకటేశుఁ డింతితోఁ గూడఁగ నేఁడు
వక్కణించుఁ దొల్లింటివలె నాయఁ గాలమూ ॥వెగటా॥ 539

**అవతారిక:**

విరహవేదనతో రగిలిపోయే నాయిక, స్వామికి తనంటే మొహంమొత్తిందా!! లేక సరసం కాస్తా విరసం అయిందా యేమిటి? లేక తమ మనస్సుల్లో చిగురుగైదువ వాడు చేసిన మాయలా? ఎందుకిలా జరుగుతోంది అని వాపోతున్నది. చిగురు కైదువ - అంటే లేత చెఱకుగడ ఆయుధముగా (విల్లుగా) కలిగిన మన్మథుడు అని అర్థం. ఆ తిరుమలయ్య ఇంతిపై దయతో కూడినంతనే తొల్లింటివలెనే కాలము వక్కళించినదట





అంటే మారిపోయిందట. నేటి కాలంలో అంత తేలికగా అర్థంకాని తెలుగు ఇది. అంటే నమ్ముతారా?

**భావ వివరణ:**

హతవిధీ! యేమిటీదారుణం? ఈ స్వామికి వెగటాయెనో (నేనంటే మొహంమొత్తిందా)? లేక విరసమో (ద్వేషమా)? లేక ఆ చిగురుకైదువ వాడు (లేత చెఱకు వింటి మన్మథుడు) తమలోన (మామనస్సుల్లో) చేసిన మాయలో? ఎందుకు ఈ పరిస్థితి దాపురించింది?

ఓ చెలీ! వేడుకన్ (సంతోషంతో) చకోరాలు (చకోరపక్షులు వెన్నెలలు గోలుగాక (వెన్నెలను త్రాగుతాయి). కానీ నేడు ఆ చకోరాలే వెన్నెలను ఉమియ జొచ్చె (ఉమ్మేస్తున్నాయి). ఇదేమి పద్ధతే? సన్నపుతుమ్మెదలు (చిన్నచిన్న భ్రమరములు) పద్మములలో దూరి మకరందం త్రాగక సన్నలనొకటొకటిజారెనే (చీకటి పడేటప్పటికి ముకుళించిన ఆ పద్మాలను చూచి మొహంమొత్తి ఒక్కొక్కటే జారిపోతున్నాయి.

ఓ సఖీ! సరి (న్యాయంగా) లతలు నీటిని చేకొనుగాక (పీల్చుకోవాల కదా?) ఇదేమిటే లతలు నీటిని కుమ్మరించే (విడిచిపెట్టే) విధానం కనిపిస్తున్నది? సువాసనలు నిండినగాలి ఈ సంపెంగపూలలోంచి బయటకు రావాలిగాని, ఇదేమిటే ఈ సంపంగిపూలు సువాసనను మ్రింగేస్తున్నాయి?

ఓ సఖీ! జక్కువజంటలు (జక్కువపిట్టలజంట) ఒకదానితో ఇంకొకటి ఎంతో అన్యోన్యంగావుంటాయి. కానీ ఇదేమిటే నేడు జక్కువ పక్షులు ఒకదానితో ఇంకొకటి జరసీనేమే (పోట్లాడుకుంటున్నాయి యెందుకే?) ఆహా! ఇప్పుడు అర్థమైనది. స్వామిరాలేదని మన దేవి చింతిస్తుంటే... ఇవి ఇట్లావుండక యెట్లావుంటాయి? నేడు సర్వశ్రేష్ఠుడైన శ్రీవేంకటపతి ఈ యువతిని గూడి నంతనే, కాలము తొల్లింటివలెనే (ఇదివరకులాగే) వక్కణించు (మారిపోయినది). అమ్మయ్యా!!!

సంపుటి: 17 కీర్తన : మగవాడు భ్రమసిన మరి తెలుపగరాదు
సంఖ్య : 251 పుట : 146 రాగం: వరాళి

## వరాళి

17. మగవాఁడు భ్రమసిన మరి తెలుపఁగరాదు
నగుఁబాటు చూడరమ్మ నాటకీఁడు కృష్ణుఁడు ॥ పల్లవి॥

కోవిల గుయ్యఁగాను గోపిక పిలిచె నంటా
ఆవల దగ్గరఁ బోయి అందుఁ గానక
ఆవేళ నొక్కనెమలి యాడ నేఁగఁగాఁ జూచి
భావించి చెలి యనుచుఁ బట్టఁబోయఁగృష్ణుఁడు ॥మగ॥

తీగె యల్లాడఁగాఁ జూచి తెఅవచేసన్న లివి
నాగతి ననుచుఁ జేరి యటు గానక
సోగల నందుఁ గొలనిసొంపుఁ దామెరను జూచి
భాగులఁ జెలిమో మని పట్టఁ బోయఁ గృష్ణుఁడు ॥మగ॥

చెట్టుపైఁ బూవులు రాల చెలి సేసవెట్టె నంటా
అట్టేఁ శ్రీవేంకటేశుఁ డాలకించఁగా
కట్టఁగడ నింతి యది గని నిజముగ వచ్చి
యెట్ట యెదుటనే వుండె నేచి కూడెఁ గృష్ణుడు ॥మగ॥ 251

**అవతారిక:**

యౌవన తరుణంలో వున్నప్పుడు భ్రమ, హర్షోద్రేకాలు స్త్రీలకు సహజలక్షణాలు. కానీ మగవారు అట్లాచేస్తే నవ్వులపాలవుతారు అంటున్నారు పెదతిరుమలయ్య. గోపికలు ఇదేమాట చెప్పుకొని చూడండమ్మా! ఈ నాటకాలరాయుడు కృష్ణయ్య ఎన్ని వేషాలేస్తున్నాడో! అంటున్నారు. అర్థమంతా ఇక్కడే చెప్పేస్తే అందం యేముంది? అయినా ఇది వినండి... చెట్లపైనుండి పూలు రాలిపడితే, అరే నాచెలి





పూలుచల్లుతోందే నాకోసం అని ఈవేంకటేశుడు ఆమె వినేటట్లు అంటూనే ఆమెను కరిగించివేశాడట. మరి ఆనాటి కృష్ణుని చిలిపి చేష్టలు ఈయన ఇంకా మానలేదు. (అక్కడక్కడా ముద్రణ పొరపాట్లున్నట్లు తోస్తున్నది, నాకు)

**భావ వివరణ:**

ప్రపంచంలో మగవాడు భ్రమ చెందరాదు. ఒకవేళ భ్రమకలిగినా పైకి చెప్పకూడదు. చెబితే నగుబాటు (నవ్వులపాలు) అవుతాడు. ఇదిగో ఈ కృష్ణుడు ఎటువంటి నాటకాలరాయుడో చూడండమ్మా! తను భ్రమియించినట్లు యెన్ని వేషాలు వేస్తున్నాడో!!

చెట్టుపై కోయిల కూస్తుంటే అదిగో నా గోపిక నన్ను పిలుస్తున్నదని దగ్గరకుబోయి అక్కడ యెవ్వరూ లేక నిరాశచెందాడట. ఆవేళ (ఆరోజు) ఏంజరిగిందో తెలుసా? ఒక నెమలి పురివిప్పి ఆడుతుంటే చూచి తన చెలి నాట్యం చేస్తున్నదేమో అని భ్రమపడి, భావించి ఈ కృష్ణుడు దాన్ని కౌగలించబోయినాడట. హవ్వ!! యెంత నాటకాలరాయుడు!!

ఒకచోట లతలు గాలికి కదలి వూగుతుంటే, అదిగో నా చెలి రమ్మని చేత్తో నాకు సైగ చేస్తోంది అని అక్కడికి పోయి అక్కడెవ్వరూ లేక నిరాశచెందాడట. కాని అక్కడ సొగసైన కొలనులో ఒక ఎఱ్ఱటి తామరపూవుని చూచి అదిగో భాగ్యవతి అయిన నాచెలి అరుణాధరం... అని దానిని తాకబోయినాడట. ఆహా! యెంత నాటకీడు (నాటకాలరాయుడు) !

చెట్టుపైనుండి గాలికి పూలు రాలిపడితే, ఆహా! నాచెలి సేసవెట్టె (నా చెలి భక్తితో నన్ను పూజిస్తున్నది) అని ఈ శ్రీవేంకటేశ్వరుడు అన్నాడట. అదివిని, కట్టగడ (చిట్టచివరికి) ఈ ఇంతి నిజముగా తన కళ్ళెదుట ఆనాటి కృష్ణుని రూపం చూచి పరవశించిందట. అప్పుడాయన ప్రేమగా ఆమెను గూడి ధన్యురాలిని చేశాడట. జగన్నాటక సూత్రధారికి తెలియని కిటుకు వుంటుందా?

సంపుటి: 17 కీర్తన: కానీవయ్యా దాని కేమి కలది గలట్టయాని
సంఖ్య : 141 పుట : 83 రాగం: పాడి

## పాడి

18. కానీవయ్యా దాని కేమి కలది గల ట్టయాని
అనుకొని యింకా నెంత ఆసోదమో ॥ పల్లవి॥

పొలఁతి నంపు మంటేను పూఁటలు న న్నడిగేవు
తెలిపి నిరతి యప్పు దిద్దఁ గలనా
యెలమి నాపె వలపు యెరవు నాపైఁ బెట్టేవు
చెలుల కింకా నెంత సిగ్గు వాట్లో ॥కానీ॥

వాడికెయింతికి కుదువగా నన్నుండు మనేవు
కూడి వావి విడిపించుకొనీవశమా
మాడలవలె సతుల మారుపెళ్లాడేవు
తోడనిట్టె యెందరిని దొడ్డిఁబెట్టేవో ॥కానీ॥

కొమ్మను కౌఁగిటఁ గూడి కొసరు నన్నడిగేవు
కమ్మరఁ దగులు నేను కావలెనా
దొమ్మి శ్రీవేంకటేశుఁడ తోడఁ బెండ్లాడేవు
మమ్మిందరిని ఇక్కడ మండెమురాయఁడవై ॥కానీ॥ 141

**అవతారిక:**

మండెము అను గ్రామములో వెలసిన వేంగళరాయనిపై శృంగార సంకీర్తన చెబుతున్నారు పెద తిరుమలయ్య. 'కానీలేవయ్యా! దానికేమివుంది? వున్నదేవుంటుంది అనుకొని ఇంకాయెంత అసాధ్యపు పనులు చేస్తావో తెలియకుండావుంది" - అంటున్నది నాయిక (పెదతిరుమలయ్య) ఈ పద ప్రయోగాలు నేటి తెలుగులో లేనందువల్ల చాలా మాటలకు భావము ఊహాజనితమే. మనం నేటికాలంలో ఇట్లాంటి





తెలుగునుడికారం ఉపయోగించము. మనం "మమ్ముయిందరినీ" అంటే పెదతిరుమల "మమ్మిందరినీ" అని సంధి చేశారు. ఇది అన్నమయ్య వాఙ్మయపు ప్రత్యేకత.

**భావ వివరణ:**

ఓ ప్రభూ! కానీలేవయ్యా! దానికేముంది? కదిగలట్టాయాని (జరగాల్సిందేదో జరుగుతుంది). నీవు అనుకొని (అనుకొంటే) ఇంకా యెంత ఆసోదమో (అసాధ్యపు పనులు చేస్తావో యేమిటో)!

ప్రతిపూటా, పొలతి (యువతి)ని పంపించమని నన్ను అడుగుతూనేవుంటావు. ఆలోచించు... ఆమెకు నీ నిరతి (ఆసక్తిని) తెలిపి అప్పుదిద్దగలనా (చక్కబెట్టగలనా)? ఆమె వలపును ఎరవు తెచ్చే బాధ్యతనాపై పెట్టేస్తున్నావు. ఇదేమన్నా నా ఇంట్లో పడివున్న సొమ్మటయ్యా! నీకు కాసేపు వాడుకోవటానికి ఇచ్చేందుకు? ఇది చెలులకు (స్త్రీలకు) యెంత సిగ్గు కలిగించే వ్యవహారం!! నలుగురూ నా గురించి ఏమి అనుకొంటారు?

వాడికెయింతి (నేటికాలంలో... వెలయాలు) కుదువగా (తాకట్టుగా) నన్నుండమంటున్నావు). మళ్ళీ నీవు తిరిగి విడిపించుకుంటావా!! అది సాధ్యపడుతుందా? మాడలు (నేటికాలంలో కరెన్సీనోట్లు) వలె, సతుల (ఆడవాళ్ళను) మారుపెళ్ళాడేవు (ఎక్స్ఛేంజ్ చేస్తావా!) ఎంతమందిని ఇట్లా దొడ్డిబెట్టేవు! (నీ కంట్రోల్‌లో) పెట్టుకొంటావు?

ఆ కొమ్మను (యువతిని) కౌగిట గూడి కొసరు అడిగినట్లు నన్నూ రమ్మని పిలుస్తున్నావు. ఇంతజరిగాక నీ రోజూ వ్యవహారానికి నేను వుండిపోవాలా? ఓ దేవదేవా! శ్రీవేంకటేశ్వరా! దొమ్మితోడ బెండ్లాడేవు (అందరూ చూస్తుండంగా జంటపెళ్ళిళ్ళు చేసికొనుచున్నావు). ఇక్కడ ఈ మండెము గ్రామంలో మమ్ము అందరినీ నీ స్వంతం చేసికొనినావు. మేము ధన్యులం. తరించితిమి తండ్రీ!

సంపుటి: 17 కీర్తన : ఇందరికి నీవే గుఱి యిదివో దిష్టాంతము
సంఖ్య : 142 పుట : 84 రాగం: కాంబోది

### కాంబోది

19. ఇందరికి నీవే గుఱి యిదివో దిష్టాంతము
కందువతోఁ జేయువయ్య కాఁపురములూ ॥ పల్లవి॥

చేతికి లోనైనయట్టి చెలువుఁడు గలిగితే
యేతులకు రమణు లేమేమి సేయరు
గాతల నీ శిర సెక్కెఁ గామిని యొకతె దొల్లి
యీతలఁ దమవారు యేమి సేతురో ॥ఇందరి॥

మగవాఁడు వలచితే మగువలయినవారు
యెగసక్కేలకును యేమేమి సేయరు
వెగటున నొక లేమ వీఁపున మోఁపించె నిన్ను
యెగువదిగువసతు లేమి సేతురో ॥ఇందరి॥

శ్రీవేంకటేశ నీవు చిత్తగించి కూడితేను
యేవనితలైనా నేమేమి సేయరు
శ్రీవనిత వురముపైఁ జేకొని నిలిచె నీకు
యీవల మాబోంటెల్లా నేమి సేతురో ॥ఇందరి॥ 142

**అవతారిక:**

'గుఱి' అంటే లక్ష్యం. దిష్టాంతము అంటే ఉదాహరణము. "నేను చెప్పబోయే ఇంతమందికీ నీవే చక్కటి ఉదాహరణ. ఓ ప్రభూ! సామర్థ్యంతో కాపురము చేయవయ్యా" అంటున్నారు పెద తిరుమలాచార్యులవారు. "పెళ్ళాన్ని ప్రేమగా చూడాలి, విలువైన సలహాలు తీసికోవాలి, కరుణ చూపించాలి... కాని పెత్తనం ఇయ్యకూడదు పెద్దలు చెబుతే నీవేం చేశావు? ఒకావిడను నెత్తినపెట్టుకొన్నావు, ఒకావిడను





వీపుమీద మోశావు, ఒకావిడను వురముపై మోస్తున్నావు. నిన్నేమనగలమయ్యా! నిన్ను కాదనేవాడెవడు?" అంటున్నారు

**భావ వివరణ:**

ఓ దేవదేవా! ఇంతమందికీ నీవే చక్కటి దిష్టాంతము (ఉదాహరణము). కందువతో (సామర్థ్యముతో) చక్కగా కాపురము చేయవయ్యా! నిన్ను చూసి మేము నీలాగ చేస్తే ఇక మాపని అంతే... చేతికి లోనైనయట్టి (లొంగివున్నట్టి) చెలువుడు (మగడు) దొరికితే, యేతులకు (గొప్ప చూపించుకోవటానికి) స్త్రీలు ఏమి చేయరో చెప్పు?

కామిని ఒకతె (ఒకావిడ) నీ శిరసునెక్కి కూచుంది. (వరాహావతారంలో భూదేవిని తలపై ధరించి విష్ణువు హిరణ్యాక్షునితో పోరాడి సంహరించాడు కదా!) మరి ఇక్కడ మేము మాత్రం యేం చేస్తాం? నీలాగే ఆడాళ్ళను నెత్తినపెట్టుకొంటున్నాము.

మగవాడు వలచితే (ప్రేమిస్తే)... మగువలు పరాచికాలాడటానికి, యేమేమి చేయరంటావో చెప్పవయ్యా! చూచేవారికి వెగటు పుట్టించే విధంగా ఒక లేమ (స్త్రీ) నీచేత వీపుమీద మోయించుకొన్నది. శ్రీకృష్ణావతారంలో నన్ను యమునానది దాకా వీపు మీద తీసికొనిపో అంటే ఒక గోపికను అలాగే మోసినాడట కృష్ణయ్య). మరి ఎగువ దిగువ సతులు (స్వర్గంలోని దేవకాంతలు, అవనిలో అతివలు) ఏమిసేతురో (ఏంచేస్తారో వేరేచెప్పవలెనా?)

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు చిత్తగించి (ఇష్టపడి) కూడితే యే వనితలు యేమి చేయరంటావో చెప్పవయ్యా! నీకు శ్రీలక్ష్మి వురము నెక్కి కూర్చున్నది కదా! ఇక్కడ మా భూలోకంలో మాబోటివాళ్ళేం చేయగలమయ్యా! మేమూ ఈ ఆడవాళ్ళని నీలాగే భరిస్తున్నాం. ఎంతయినా... భర్తలము కదా!

(ఇప్పుడు చెప్పండి ఈ పెదతిరుమలయ్య తన తండ్రి అన్నమయ్య కంటే రసికుడే కదా!)

సంపుటి: 17 కీర్తన : ఏసతిఁ బొందవలసో యిదొక నెపము వేసి
సంఖ్య : 140 పుట : 83 రాగం: శంకరాభరణం

## శంకరాభరణం

20. ఏసతిఁ బొందవలసో యిదొక నెపము వె(వే)సి
రాసి కెక్క వట్టే యాచారాలు సేసేవూ ॥ పల్లవి॥

చివ్వనఁ దమ్మరసము చీరపై నీవే వుమిసి
అవ్వలఁ జెఱఁగు మాసె నని యాడేవు
జవ్వనమదము నీకు జాతీఁ జెంపవెంటా
నవ్వు లెల్లా నేఁడే నీవు నవ్వఁగ వొద్దా ॥ఏసతి॥

స్వామివి నిమ్మపంటిరసము పానుపుపైఁ బిండి
ఆముకొని కళరేఁ గెనని యాడేవు
కామాంధకారము నీకుఁ గన్నులఁ గప్పి వున్నది
చేముంచి నీ వుద్దండానఁ జెనక వద్దా ॥ఏసతి॥

సరుస శ్రీవేంకటేశ జారించి నా పోఁకముడి
తెరవేయు మని సిగ్గు దేర నాడేవు
దొరతనపుగర్వము తొట్టీని నిలువెల్లా
నిరతి బలిమితోడ నిన్నుఁ గూడ వద్దా ॥ఏసతి॥ 140

**అవతారిక:**

నా అనుభవంలో ఇంత ఘాటైన శృంగారకీర్తననెరుగను. వయసు రాని, వయసు రాబోని వారి సౌకర్యార్థం సాధ్యమైనంత గుట్టు వుంచుతాను. రసికులు భావించి, పెదతిరుమలయ్య శృంగారరసస్ఫూర్తిని 'సెబాసో' అనవలసిందే". ప్రభూ ! నీ మనస్సులో ఏసతిని పొందవలెననుకొంటున్నావో గానీ ఇదొక నెపము వేసి రకరకాల పోకడలు పోతున్నావు. ఆవిధంగానే నీవు ప్రసిద్ధి చెందావు" అంటున్నది నాయిక. నా





భావనా దోషాలకు పండిత క్షమార్హుడను. ఒకటి మాత్రం నిజం. "శ్రీవేంకటేశా! జారించి నా పోకముడి తెరవేయమని సిగ్గుదేరనాడేవు" అంటే ఏమిటో ఆ తిరుమల శృంగారరాయని కృపలేకపోతే భావింప జాలరు. జాగ్రత్తగా చదవండి మరి.

**భావ వివరణ:**

ఓ ప్రభూ! ఏసతిన్ పొందవలసో (నీ మనస్సులో వేరె ఏదో కాంతను పొందవలెనని వున్నది). కానీ ఇదొక నెపము వే(లే)సి, రాసికెక్కేవు (రకరకాలుగా పోకడలు పోతున్నావు). ఈ విధంగా నీవు ప్రసిద్ధి చెందుచున్నావు.

నీ చీరెపై (దోవతిపై) నీవే తాంబూలం తమ్మ యొక్క రసమును చివ్వన వుమిసి (ఉమ్మి) చిందింప చేసికొని నాకే చెరగుమాసెనని ఆడేవు (ఏదో మరక అంటుకొని కొంగుపాడయ్యిందే ఏమిటబ్బా! అని చెబుతున్నావు). యౌవన మదము నీ చెంపలపైననే జాలువారుతున్నది. నవ్వులన్నీ నేడే ఒలకబోస్తే ఎలా? రేపటికి కాసిని దాచుకో.

నీవు స్వామివి (జగన్నాథుడవై) యుండీ ఇవేం వేషాలయ్యా? నిమ్మపంటి రసము (నిమ్మపండు యొక్క రసమును) నీవే పానుపుపై పిండుకొని ఆముకొని (పైకొని) చూపించి ఏదో కలవచ్చినట్లుంది అని చెబుతావు. నేను అనుమానంతో రగిలిపోవాలని నీ కోరిక. నీకు కామం కళ్ళకు పొరలు కమ్మి ఇలాంటి పనులు చేస్తున్నావు. నీ ఆగడాలకు అంతువుండవద్దా?

సరసుడవైన ఓ శ్రీవేంకటేశ్వరా! నా చీరె పోకముడి (నడుముకి బిగించు ముడి) నీవే వూడదీసి, సఖీ కొంచెం తెరమూసేయరాదా? అని పరాచికాలు ఆడి నా సిగ్గు బుగ్గి అయ్యేట్లు పలికెదవు. నీకు దొరతనపు గర్వము నిలువెల్లా తొణికిసలాడుతోంది. నిరతి బలిమితో నినుగూడవద్దా (మిక్కిలి బలముతో నిన్ను గవయవద్దా?)

సంపుటి: 17 కీర్తన : మహిమెల్లా దొప్ప దోగె మజ్జనవేళ
సంఖ్య : 531 పుట : 309 రాగం: లలిత

**లలిత**

21. మహి మెల్లాఁ దొప్పఁ దోఁగె మజ్జనవేళ
సహజ శృంగారాలు జడిసె శ్రీపతికి ॥ పల్లవి॥

ముత్తేలవాన లెల్ల ముంచి కురిసినయట్టు
హత్తి పన్నీట జలకమాయ హరికి
తత్తరానఁ దెల్ల మొయిలు తనుఁ బొదిగినయట్టు
కొత్తగాఁ గప్పురకాపు గుప్పిరి దేవునికి ॥మహి॥

నీలపుఁబేరు లెల్లా నిండాఁ గట్టినయట్టు
తేలఁ దట్టుపుణుఁగు మెత్తిరి పతికి
ఆలరి మెఱుఁగుఁ దీగె లలముకొనినయట్టు
కోలుముంద్రై సొమ్ములెల్లా గుప్పిరి విష్ణునికి ॥మహి॥

పెక్కు నవరత్నములు పెద్దరాసి వోసినట్టు
యెక్కువ దండలు గట్టిరి మూరితికి
వొక్కట నలమేలుమంగ నురమునఁ గట్టి రిదె
చిక్కని నవ్వులు మించె శ్రీవేంకటేశునకు ॥మహి॥ 531

**అవతారిక:**

"తొప్పదోగులు" అంటే పూర్తిగా తడిసిపోవటం "జడిసె" అంటే అతిశయించుట అని అర్థం. "పూర్తిగా తడిసిపోయే నిమజ్జన వేళలో మహిమలు వెల్లవిసే ఈ శ్రీపతికి సహజమైన శృంగార శోభలు అతిశయించినవి" అని ఈ పల్లవికి అర్థం. ఎవరన్నా చెబుతే కాని ఇది అన్నమాచార్యులవారి కీర్తన కాదు పెద తిరుమలయ్య కీర్తన అని





తెలియదు. తొలినాళ్ళలో నేను కూడా ఆవిధంగా పొరబడిన సందర్భములనేకం వున్నాయి. "చిక్కని నవ్వులు మించె శ్రీవేంకటేశుడు" - వంటి ప్రయోగాలు కుమారుని ప్రత్యేకత అని చాలా దూరం వచ్చాకగాని తెలియలేదు. అదట్టావుంచి అద్భుతమైన కీర్తనను ఆస్వాదించండి.

**భావ వివరణ:**

దేవదేవుడైన ఈ శ్రీపతికి తొప్పదోగే మజ్జనం జరుగు (పూర్తిగా తడిసిపోయేట్లు స్నానం చేయిస్తున్నారు) మహిమలు వెల్లివిరిసే ఈ స్వామికి సహజమైన శృంగారాలు (శోభలు) జడిసె (అతిశయించినవి) చూచి తరించండి.

శ్రీహరికి పన్నీటితో జలకమాయె (స్నానం జరిగింది). ఆ పన్నీటిజల్లు ఆయన శరీరంపై ముత్యాలవాన అధికంగా కురిసినట్లు వుంటుంది. తత్తరానన్ (సంభ్రమముతో) నల్లనీ ఆకాశంలో తెల్లమొయిలు (తెల్లని మేఘం) కమ్ముకొన్నట్లు, ఈ దేవునికి అప్పటికప్పుడు కప్పురకాపు (కర్పూరపుపూత) కుప్పింరించిరి (వేసినారు).

నిండా (పూర్తిగా) ఒంటిమీద, నీలపు బేరులు (నల్లని హారాలు) నింపినట్లు ఈ శ్రీనాతునికి తట్టు పునుగు అనే సుగంధ ద్రవ్యమును మెత్తినారు. ఆలరి మెఱుగు తీగెలు (ఆకాశంలో ఇష్టంవచ్చినట్లు తళుక్కున మెరిసే మెరుపుల) అలుముకొనినట్లు, కోలుముంద్రై (మిక్కిలిగా) సొమ్ములెల్లా గుప్పిరి (ఆభరణాలతో ఈ స్వామిని కప్పివేశారు.

మూరితికి (ఈ విగ్రహ మూర్తికి) అనేక నవరత్నాలుపెద్ద రాశిగా పోసినట్లు ఎన్నెన్నో హారాలు, సరములు కట్టి అలంకరించారు. ఒకటిగా అలమేల్మంగను ఆయన వక్షస్థలంపై కట్టినారు. అప్పుడు ఈ శ్రీవేంకటేశ్వరుడు చిక్కని నవ్వుల మించెన్ (అధికమైన నవ్వులతో అతిశయించినాడు.)

సంపుటి: 17 కీర్తన : ఓపము నీతో పొందు వోబులేశా

సంఖ్య : 395 పుట : 228 రాగం: శంకరాభరణం

## శంకరాభరణం

22. ఓపము నీతోఁ బెనఁగ వోబళేఁశుఁడ
ఆపనినేనెఱుఁగనా అయ్య వోబుళేశుఁడా ॥ పల్లవి॥

చేయి నీవు ముట్టఁగాను సెలవినవ్వులు ముంచె
వోయయ్య తలవయ్యా వోబుళేశుఁడా
నీ యిచ్చలోన మెలఁగ నే మంత నేరుతుమా
ఆయము అంట వచ్చేవు అట్టే వోబుళేశుఁడా ॥ఓపము॥

కోరి పువ్వుల వేయఁగ కొప్పు కడు వెడ జారె
వూరకుండుచాలు నోయి వోబుళేశుడా
సారె నిన్ను మచ్చరాన జరయఁగఁ జాలము
వోరచూపులఁ జూడకు వోబుళేశుఁడా ॥ఓపము॥

గద్దించి నీవు కూడగ కాయమెల్లాఁ బులకించె
వొద్దఁ బాయకుండవయ్య వోబులేశుఁడా
అద్దో శ్రీవేంకటాద్రి నహోబలమునందు
తిద్దితివి నన్ననే రతికి వోబులేశుఁడా ॥ఓపము॥ 395

**అవతారిక:**

అహోబలంలో నెలకొన్న నరసింహునిపై చక్కని శృంగార సంకీర్తన చెబుతున్నారు పెదతిరుమలాచార్యులవారు. ఈ కీర్తనలో కవి తానూ ఒక చెలికత్తెయై స్వామితో చెబుతున్నారు. 'ఓబులేశుడు' అంటే 'అహోబలేశ్వరుడు' అనే మాటకి వికృతి. నీతో పోట్లాడే శక్తి మాకు





లేదయ్యా! అయ్యో! నాకు ఆపని (పోట్లాడటం) రాదు స్వామీ అంటున్నారు. తన తండ్రి అన్నమయ్య వలెనే అహోబలేశ్వరుని శృంగారనాయకునిగా ఉత్ప్రేక్షించారు పెదతిరుమల. "ఓబులేశా! రతికి తిద్దితివి నన్ననే" అంటున్నారు. దీనిభావమేమి తిరుమలేశా! అని కాసేపు నేను తలపట్టుకొన్నాను.

**భావ వివరణ:**

ఓ అహోబల నరసింహా! (ఓబులేశా!) నీతో బెనగనోపము (పోట్లాడేశక్తి మాకు లేదయ్యా!); అయ్యో! ఆపని నాకు చేతకాదయ్యా!

నీవెంత ఉగ్రనరసింహుడవైన ఈ శ్రీదేవి నీ చేయిముట్టుకోగానే సెలవినవ్వులు (చిరునవ్వులు) చిందిస్తావు. ఓ అయ్యా! కాస్త ఆపవయ్యా! నీ ఇచ్చలోన మెలగ (మనస్సు) తెలుసుకొని నడచుకోవటం) నేము అంత నేరుతుమా (మాకు అంత తెలుస్తుందా?) నీవైతే ఆమె మర్మములంట నెరుంగుదువు. ఓబులేశా! నీకు నీవే సాటి ప్రభూ!

ఓబులేశా! నీవు కోరికతో నాపై పుష్పములను జల్లగానే, నా కొప్పు సడలినదయ్యా! చాలునోయీ నీ చిలిపి చేష్టలను మాని వూరకుండరాదా? పోనీ సారె (ప్రతి తడవా) నిన్ను జరయగలమా (గదమాయించగలమా) అంటే అదీ సాధ్యం కాదు. ఓబులేశా! మమ్ము వోరచూపులు చూడకు స్వామీ!

నీవు ఏపనిచేసినా గద్దించి (భయపెట్టి) నట్లే వుంటుంది. ఓబులేశా! నీవు గద్దించి కూడిన కాయము (తనువు) పులకించని వారుందురా? మా వొద్ద (తోడు) బాయకుండవయ్యా! (విడనాడక వుండవయ్యా!) అద్దో (అదిగో) ఆ వేంకటాద్రి మీదా, ఈ అహోబలంకొండమీదా, నన్ను నే (నన్ను కూడా) రతికి తిద్దితివి (శృంగారమునకు సిద్ధముజేసినావు) ఓబులేశుడా! ఇంతకంటే సార్ధకత ఇంకేముంటుంది స్వామీ!

సంపుటి: 17 కీర్తన : ఇన్నిటా దొరవు నీవు ఇందరు నున్నారీడ
సంఖ్య : 67 పుట : 41 రాగం: రామక్రియ

## రామక్రియ

23. ఇన్నిటా దొరవు నీవు యిందరు నున్నారీడ
పన్నినీకతలు బట్ట బాయిట వేయింతునా ॥ పల్లవి॥

నీవేమి సేసినాను నిన్ను మెచ్చఁగలఁ గాక
కాని కన్నులను నిన్నుఁ గసరఁగఁ గలనా
యీవేళ నీవు బొంకితే యిది నిజమందుఁ గాక
భావించి నిన్నుఁ గల్ల పరచఁగఁ గలనా ॥ఇన్నిటా॥

వొద్ద నీవు గూచుండితే వోరుచుకోఁగల గాక
అద్దలించి నిన్ను వెంగెమాడఁ గలనా
పొద్దువోయి వచ్చినాను పొదిగి చేకొందుఁ గాక
వద్దువద్దనుచు నీతో వాదించఁ గలనా ॥ఇన్నిటా॥

కొంగువట్టి తీసినాను కూరిమిఁ జేకొందుఁ గాక
చెంగిచెంగి పానుపుపై సిగ్గువడఁ గలనా
రంగుగా శ్రీవేంకటేశ రతులఁ గడపలో
అంగవించితివి ముద మణఁచుకోఁ గలవా ॥ఇన్నిటా॥ 67

**అవతారిక:**

నాయిక అంటున్నది "స్వామీ! నీవే సమస్త సృష్టికీ అధిపతివి. ఇక్కడ ఇంతమంది వున్నారు. కావాలని నీ నాటకాలన్నీ బయటపెట్టగలనా? అది సభ్యత కాదు కదా!". ఇది పెదతిరుమలయ్య అద్భుత కీర్తన. కడపలో వెలసిన శ్రీవేంకటేశ్వరునిపై ఈయన తన తండ్రి వలెనే చాలా మంచి కీర్తనలు చెప్పారు. కొంగువట్టి తీయడమంటే బలవంతం చేయటం. చెంగి చెంగి అంటే హఠాత్తుగా అని అర్థం. అంగవించితివి అంటే ఉత్సుకించితివి





అని అర్థం. ఇప్పుడు ఈ కీర్తన ఆఖరి చరణాలు అర్థమవుతాయేమో ఆలోచించి చూడండి. అర్థంకాదు. కానీ ఇలా విడతీసి చూడండి "చెంగిచెంగి కొంగువట్టి తీసినా కూరిమి చేకొందుగాక! పానుపుపై సిగ్గుపడగలనా? ఓ శ్రీవేంకటేశా! రంగుగా కడపలో అంగవించితివి, ఇక ముదమణచుకోగలనా?". ఇప్పుడు కొంచెం నయం.

**భావ వివరణ:**

స్వామీ! నీవు ఇన్నిటా (ఈ సృష్టి అంతటికీ) దొరవు (అధినాథుడవు). ఇక్కడ ఇంతమందివున్నారు. అంతా మనలనే చూస్తున్నారు. పన్ని (కావాలని) నేను నీ కతలు (ప్రణయగాథలను) బట్టబాయట (బట్టబయలు) వేయింతునా (వేయగలనా?)

నాదేముంది, నీవేం చేసినా నిన్ను మెచ్చుకోవటమే నావంతు. కావి కన్నుల (కన్నెఱ్ఱగాచేసి) నిను కసురుకోగలనా? ఇవ్వేళ నీవు అబద్ధాలు చెబుతే ఇదే నిజం అనవలెనుగాని భావించి (జరిగినదేమిటో ఊహించి) నిన్నున్ కల్లపరచగలనా (అబద్ధమని నిరూపించగలనా?) నీకోపం నేనెరిగినదే కదా!

చేసినవన్నీచేసి, ఏమీయెరుగని వానిలా నీవు నావొద్ద (దగ్గర) కూచుంటే నాకోపం ఎలాగో ఓర్చుకోవలసినదే కాని, అద్దలించి (అదలించి) నీతో వెంగెమాడగలనా (వ్యంగంగా మాట్లాడగలనా)? నీవు యెంత పొద్దుపోయి ఇల్లు చేరినా పొదిగి (వొద్దికతో) చేకొందుగాని (స్వీకరించెదనుగాని) వద్దు నా ఇంటికిరావద్దు అని నీతో నేను వాదించగలనా? వాదించి నెగ్గగలనా?

చెంగిచెంగి (హఠాత్తుగా) కొంగువట్టి తీసినాను (నన్ను బలాత్కరించినా) ఇష్టంగా స్వీకరిస్తానుగాని ఏకశయ్యయై సిగ్గుతో నిన్ను నిరాకరించగలనా? ఓ శ్రీవేంకటేశా! రంగుగా రతుల (శోభలీనుసరతములతో) నన్ను కడపలో తేల్చగా అంగవించితివి (ఉత్సాహముతో వున్నావు). నా సంతోషమును అపుకోగలనా ప్రభూ!

సంపుటి: 17 కీర్తన : నీరమణు డిదె వచ్చీ నెరి నీ విరహ మేలే

సంఖ్య : 252 పుట : 147 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

24. నీ రమణు డిదె వచ్చీ నెరి నీ విరహ మేలే
కూరిమిగలుగుచోటఁ గొసరేలే ॥ పల్లవి॥

పులకమోసులు గాని పువ్వుబాణములు గావు
పలుమారు చెలి యేల భ్రమసేవే
కలయ నిట్టూర్పు గానిఁకడు జల్లగాలి గాదు
అలికి అలికి యేల అలసేవే ॥నీరమణు॥

మక్కుఁ జెమటలు గాని మదనరసాలు గావు
వెక్కసమై యింతి యేల వెఱచేవే
చెక్కులకాఁకలు గాని చిత్తజుమంటలు గావు
వొక్కమాటే యింత యేల వులికేవే ॥నీరమణు॥

కూడినరతులు గాని గుంపెనవాదులు గావు
యేడ కేడ వో చెలి యెంచి చూచేవే
యీడనే శ్రీవేంకటేశుఁ డింతలోనే నిన్నుఁ గూడె
వేడుకల నింతలోనే విఱ్ఱవీగేవే ॥నీరమణు॥252

**అవతారిక:**

"ఓ చెలీ! నీ భర్త ఇప్పుడే వచ్చీనే. ఇంకా నీ విరహము యెందుకే? వలపు చూపించవలసిన చోట ఈ సంకోచమెందుకమ్మా!" అని హితబోధ చేస్తున్నది పెదతిరుమలయ్య భావనా చెలికత్తె. "గుంపెన వాదులు" అనేమాటకు యెక్కడా అర్థము దొరకలేదు. బహుశా అది గుంపు అయిన





వాదులు (గుంపైన వాదులు) అయివుండవచ్చును. ఆమాటకర్థం మిక్కుటమైన పోట్లాటలు, అని. "వో చెలీ! యేమిటేమిటో లెక్కలేసుకొంటావు ఇప్పుడు కావలసినది రతి కూటములు కానీ అంతులేని కీచులాటలు కావు" అని ఆ చెలికత్తె, నాయికతో అంటున్నది. ఈనాటి భాషకు ఆనాటిభాషకు తేడా చూడండి.

**భావ వివరణ:**

ఓ చెలీ! నీ రమణుడు (భర్త) ఇప్పుడే వచ్చాడు. ఇంకా నెరి విరహము (పనికిరాని విరహవేదన) దేనికమ్మా! కూరిమి (ప్రేమ) చూపించవలసిన ఈ తరుణంలో కొసరుయేలే? (సంకోచమెందుకమ్మా!)

నీ శరీరంపై వుండవలసినవి ఆనందాతిరేకంలో కలిగే పులకలమొలకలు కానీ మదనుని పూబాణములనాట్లు కావు. ఓ చెలీ! ఆయన వస్తున్నాడని పెక్కు మారులు యెందుకు భ్రమ చెందుతావమ్మా! నీ నిట్టూర్పు వడగాడ్పువలెనున్నది కాని చల్లనిగాలి వలె లేదు. ఇన్నిసార్లు నిట్టూర్చి యెందుకమ్మా! అనవసరంగా అలిసిపోతావు?

వలపువానలు కురియవలసిన తరుణంలో మాలిన్య భూయిష్టమైన స్వేదము చిందిస్తున్నావు. ఓ ఇంతీ! వెక్కసమై (మిక్కుటముగా) వెఱచేవు (భయపడుతున్నావు) దేనికమ్మా? ఇప్పుడు ఆయన వస్తున్నాడు. సిగ్గులెక్కుడై నీ కపోలములు వేడెక్కవలసిన సమయంలో మాయదారి మన్మథుని మంటలేమిటమ్మా! ఒక్కమాటే ఇంత ఉలుకైతే యెలాగమ్మా?

ఓ చెలీ! ఇప్పుడు నీకు, స్వామికి మధ్య కావలసినది రతికూటములు. గుంపైన (మిక్కుటమైన) వాదులు (కీచులాటలు) కావు. ఎక్కడెక్కడి తప్పులో యెంచి చూచి ఆయననెందుకు నిరుత్సాహపరచెదవమ్మా! ఇంతలోనే ఈ శ్రీవేంకటేశుడు వచ్చి ఈడనే (ఇక్కడే) నిన్నుకూడినాడు కదా! ఇంతలోనే ఆనందంతో విఱ్ఱవీగిపోతున్నావు. ఎంత అల్పసంతోషివమ్మా!! నీవు.

సంపుటి: 17 కీర్తన : దివ్వె యెత్తినఫలము దేవర దింతే కదవే
సంఖ్య : 250 పుట : 146 రాగం: ఆహిరి

**ఆహిరి**

25. దివ్వె యెత్తిన ఫలము దేవర దింతే కదవే
యెవ్వతైనా నాయకుఁడు యేలేటివాఁడుఁ గదవే ॥ పల్లవి॥

మతిలో సవతి వని మచ్చరము రేఁగినాను
అతనిఁ జూడవలెఁగా అవునే కదే
కతకారి నిన్నుఁ జూచి కడుఁ జలము లెక్కినాను
పతిబత్తి సేయఁగాను పదరరాదు గదవే ॥దివ్వె॥

వాలిననీసేఁత చూచి వాసి యెంత వుట్టినాను
లాలించి యతనిమాట చెల్లవలెఁ గదే
పాలుపడి నీ జాడకు పంతము నాకు నెక్కినాను
తాలిమితో నా గుణము దలఁచవలెఁ గదవే ॥దివ్వె॥

జోడై నీ వున్నందుకు సూడెంత గలిగినాను
వేడుక నాతనిబుద్ధి వినేదే కదే
యీడనే శ్రీవేంకటేశుఁడే నలమేల్మంగను
కూడె నిన్నుఁ జెల్లెలిఁగాఁ గూర్చుకోవలెఁ గదవే ॥దివ్వె॥ 250

**అవతారిక:**

"దివ్వె యెత్తుట" అంటే కాపురము నిలబెట్టుట అని అర్థం. ఓ దేవీ! నీ కాపురం నిలబెట్టిన ఫలితము ఇదిగో నీస్వామిదే. ఇంతే కదమ్మా! మీరెంతమంది సవతులున్నా, మిమ్మల్నియేలుకొనేవాడు తిరుమల నాయకుడైన ఈ దేవదేవుడే కదా! ఎంత కాదన్నా ఆయన అలమేలుమంగ పతే... నీవు ఆయనకు జోడై వున్నందుకు నీకు ఆయనపై యెంత కోపం వచ్చినా, ఆయన బుద్ధి తెలిసిందే కదా! నీవు ఏదో ఆవిడ చెల్లెలు మాదిరి





సర్దుకుపోవాలి. తప్పదు. ఏనాటికైనా సవతుల బ్రతుకింతే. పెదతిరుమలాచార్యుని అద్భుత శృంగార కీర్తన ఇది. ఆస్వాదించండి.

**భావ వివరణ:**

ఓ దేవీ! దివ్వె యెత్తిన ఫలము (నీ కాపురము నిలబెట్టిన దానిఫలితమే) నీ దేవరది (నీస్వామిది). ఇంతే కదమ్మా! ఆ తిరుమలనాయకుడు ఎవ్వతెకైన ఏలేటి శృంగారరాయడే కదమ్మా? మరి నీకు సవతుల మీద మచ్చరము యెందుకమ్మా?

ఓ దేవీ! నీ మదిలో నేను నీ సవతినని మచ్చరము రేగిన, అది సహజమే. కానీ నీవు ఆయనను చూచి నడుచుకోవాలి కదమ్మా! అవునా? కాదా? కతకారి (మాయమాటలు చెప్పే) నీ మగడు నిన్ను చూచి కొంచెం చలము (మచ్చరము) చూపించినా, పతిబత్తి (పతిభక్తి) చూపించాలిగాని, పదరరాదు గదవే (తొందరపడి పోట్లాడకూడదు కదమ్మా? (నీకు నాబోటివాళ్ళు చెప్పవలెనా)?

ఓ దేవీ! వాలిన (అతిశయించిన) నీ చేష్టలను చూచి ఆయన యెంత వాసిపుట్టినా (విభేదించినా) నీవు స్త్రీవి కాబట్టి ఆయనను లాలించి, ఆయనమాట చెల్లేటట్లు ప్రవర్తించాలి కదటమ్మా! నీ ప్రవర్తనకు నాకు కూడా పంతము యెక్కినా నీవు తాలిమితో (క్షమాగుణం ప్రదర్శించి) నాగుణము దలచవలె గదవే (నేనెటువంటిదాననో ఆలోచించాలి కదమ్మా!)

ఓ దేవీ! మనం సవతులం. ఎంతకాదనుకున్నా ఆయన ఆ అలమేలుమంగమ్మ స్వంతం. ఇప్పుడు ఆయన నీకు జంటయైవున్నందుకు, నాకు సూడెంత కలిగినా (కోపం వచ్చినా) ఆయన బుద్ధి తెలిసిందే కదమ్మా! (కుబ్జను కూడా వదలలేదు). మరి నేడు ఇక్కడే శ్రీవేంకటేశ్వరుడై అలమేల్మంగను కూడినాడు. ఇక నీవు ఆమె చెల్లెలువలెనే అమరివుండాలి కదమ్మా!

సంపుటి:17 కీర్తన:ఈ రీతి రాముఁడు కృష్ణుడు యశోదయెదుట నుండి
సంఖ్య : 372 పుట : 215 రాగం: రామక్రియ

## రామక్రియ

26. ఈ రీతి రాముఁడు కృష్ణుడు యశోద యెదుట నుండి
కోరి ముద్దు గునియంగ కొమ్మలు నవ్వేరు ॥ పల్లవి॥

పానిపట్టి వుమిసెనే పాలలోన గృష్ణుడు
నేనా రాము డుమిసెఁ దానే కాక
కానఁగానే యింత చేసి కల్లలాడేఁ జూడవే
ఆనవెట్టు మనవే తా నది నిజమనుచు ॥ఈరీతి॥

సారెఁ బిల్లఁదీపు లాడి జారిపడెఁ గృష్ణుడు
వూరకే గడించ నేల వో యమ్మ తాను
వూరివారి నడుగవే వుద్దాండాలు వీనివి
యీరీతి నాపై గడించి యిన్నియుఁ దాఁ జేసెను ॥ఈరీతి॥

వెంటనే విని సుద్దులు వెళ్లవేతు నటవే
వొంటి నన్ను వెఱపించె వుదుటై తాను
దంటనై శ్రీవేంకటాద్రి తాను నే నాడితి మమ్ము
నింటఁ బొత్తు గలపేవు యిద్దరము నొకటే ॥ఈరీతి॥ 372

గడించుట = కల్పించి అబద్ధాలు చెప్పుట

**అవతారిక:**

బలరామకృష్ణులను యశోద మందలిస్తున్నది. వాళ్ళు యశోద యెదుట ముద్దుగునిశారట. కావలసి వచ్చి అలా వాళ్ళు ముద్దులు కుడుస్తుంటే గోపికలు నవ్వారట. శ్రీవేంకటాద్రి మీద వాళ్ళిద్దరూ అడుకొన్నారట. నిజానికి వాళ్ళిద్దరూ ఒకటేనట. ఇది శృంగారకీర్తన కోవలోకి రాకపోయినా ఇందులోని వైవిధ్యం చూచి యెన్నిక జరిగింది. పెదతిరుమలయ్య అద్భుత





సృష్టి ఈ కీర్తన. "గడించుట" అంటే కల్పించి అబద్ధాలు చెప్పటం. "బిల్లఁదీపు" అనేది చిన్నపిల్లల ఆట. ఎలా ఆడతారో మనకు ఈ కాలంలో అంతుచిక్కదు కాని ఇది ఆడేపిల్లలు జారి పడుతుంటారు, మన చిన్నారి కృష్ణయ్యలాగా.

**భావ వివరణ:**

ఈవిధముగా బలరాముడు శ్రీకృష్ణుడు, యశోదాదేవి యెదుట జేరి కోరి (కావాలని) ముద్దు గునియంగ (గారాలు పోతుంటే)... అది చూచి కొమ్మలు (గోపస్త్రీలు) నవ్వేరు (పకపక నవ్విరి).

ఓ దేవీ! కృష్ణుడు తన పాలకుండలో పానిపట్టి (కావాలని) వుమిసెనని (ఉమ్మినాడని) రాముడు తాను కూడా వుమ్మినాడు. కానగానే (మేముదాన్ని చూడగానే) ఇంతచేసినవాళ్ళు, కల్లలాడెజూడవే (అబద్ధాలాడుతున్నారు చూడవమ్మా!) వాళ్ళని ఆన వెట్టమనవే (వాళ్ళని వొట్టుపెట్టుకోమని చెప్పవమ్మా!) తానది నిజమని (తాము చెప్పేది నిజమని మాయెదుట అనమను.

ఒకసారి యేంజరిగిందో తెలుసా? వాళ్ళు "బిల్లదీపులు" అనే ఆట ఆడుతున్నారు. మీ కృష్ణుడు ఆ ఆటలో జారిపడిపోయాడు. ఓ యశోదమ్మా! వూరకే గడించనేల (అనవసరంగా అబద్ధాలు చెబితే మాకేం వస్తుందమ్మా!) వీని ఉద్దండాలు (ఘనకార్యాలు) వూళ్ళోవాళ్ళని పిలిచి అడగవమ్మా! వాళ్ళే చెబుతారు. ఇన్నీ తానుజేసి, ఆపైన తానే ఈ రీతి గడించె (అబద్ధాలు చెబుతున్నాడు).

ఓ దేవీ! మేమిట్లా చెప్పటంవిని నాసుద్దులు (సంగతులు) వెళ్ళవేతువా అని (బయటపెడతావా అని) నన్ను ఒంటరిగా పట్టుకొని తాను వుదుటై వెఱపించె (గట్టిగా భయపెట్టాడు). ఇప్పుడు ఈ వేంకటాద్రిమీద తాను నేను, దంటనై (జంటలుగా) ఆడుకొన్నాము. మమ్మల్ని నీవు పొత్తుకలిపేదేమిటి? నిజానికి మేమిద్దరమూ ఒక్కటే అన్నారు వాళ్ళు.

సంపుటి: 17 కీర్తన : ఎటువంటి మోహమో యింతి నీపై నతనికి
సంఖ్య : 1 పుట : 1 రాగం: సాళంగనాట

**సాళంగనాట**

27. ఎటువంటి మోహమో యింతి నీపై నతనికి
తటుకన నురమున ధరియించె నిన్నును ॥ పల్లవి॥

కామిని నీ నడపులు గజగమనము లని
కామించి నీ పతి కరిఁ గాచెను
కోమలపు నీ పిరుఁదు చక్రభావ మని
నేమమై చక్రము చేత నిలిపినాఁ డతఁడు ॥ఎటు॥

నెలఁత నీ నిలయము నీరజ మనుచుఁ బ్రియ
మలరి జలజనాభుఁ డాయ నతఁడు
కలికి నీ గళము శంఖముఁ బోలునని తాఁ
దలఁచి పాంచజన్యధరుఁ డాయ నతఁడు ॥ఎటు॥

నిరతి నలమేల్మంగ నీ కురులు నలుపని
అరుదార నీలవర్ణుఁ డాయ నతఁడు
గిరికుచవని నిన్నుఁ గెరలి కౌఁగిటఁ గూడె
పరగ శ్రీ వేంకటపతి యాయ నతఁడు ॥ఎటు॥ 1

**అవతారిక:**

ఈ కీర్తన నాలకించిన వారు సెబాస్ ఈ పెదతిరుమలాచార్యులు తండ్రికి ఏమాత్రం తీసిపోని కొడుకు అంటారంటే నన్ను నమ్మండి. "ఓ దేవీ! నీపై నతనికి యెటువంటి మోహమువుందమ్మా? నిన్ను చటుక్కున వురముపై ధరించినాడు గదటమ్మా!" అంటున్నారు. ఆయన గజేంద్రవరదుడవటానికీ, చక్రహస్తుడవటానికీ, పద్మనాభువడవటానికీ,





పాంచజన్య శంఖధారి అవటానికీ నల్లని వేంకటరమణుడవటానికీ అసలు కారణాలు వేరే వున్నాయట. అంతెందుకు ఇవ్వాళ ఈ ఉన్నత శిఖరాలమీద తిష్టవేసి నెలకొన్న దానికి కూడా వేరే కారణం వున్నదట. ఔరా! పెదతిరుమలాచార్యా!

**భావ వివరణ:**

ఇంతీ! (ఓ అలమేల్మంగమ్మా!) నీపై అతనికి (ఆ శ్రీనివాసునికి) యెటువంటి (యెంతటి) మోహమో (గాఢానురాగమో కదా!) నిన్ను ఆయన తటుకున (చటుక్కున) తన ఉరముపై ధరించినాడు (నిలుపుకొనినాడు).

ఓ కామినీ! నీనడపులు గజగమనములు (మద కరీంద్రపు నడకలు నీవి) అని నీ భర్త ప్రేమతో అలనాడు మొసలిచే పీడింపబడుచున్న గజేంద్రుని గాచెను (రక్షించినాడు). కోమలమైన నీ నితంబములు చక్రములవలె గుండ్రనివని ఆయన చక్రధారియై నిలిచాడు.

ఓ నెలతా! నీ నిలయము (నివాసము) నీరజము (పద్మము) అని ఆయన ప్రేమాతిశయమున జలజమును తన నాభిలో ధరించి పద్మనాభుడైనాడు. ఓ కలికీ! నీ గళము (మెడ) శంఖమువలెనున్నదని భావించి ఆయన నిరంతరము పాంచజన్యము అను శంఖమును ధరించినవాడై ప్రసిద్ధి బొందినాడు.

ఓ అలమేల్మంగా! నిరతి (మిక్కిలి ఆసక్తితో) ఆయన నీ కురులు (కేశపాశము) నల్లగావున్నదని తానుకూడా అరుదైన మెరయుచున్న నీలవర్ణుడాయెను (నల్లనయ్య అయ్యాడు). నీవు గిరికుచవని (స్తనగిరులున్న దానవు) నీ కౌగిట కరిగిన ఆ దేవదేవుడు వేంకటపతి అను కొండలరాయుడైనాడు. అది తల్లీ! ప్రేమంటే. ఆయనే పతియంటే.

సంపుటి: 17 కీర్తన : విరహిణి మొదలనేవీరి వొట్లిక నేల
సంఖ్య : 427 పుట : 246 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

28. విరహిణి మొదలనే వీరి వొట్లిఁక నేల
తరుణికి శృంగారాలు తగినవేసేయరే ॥ పల్లవి॥

అలినీలవేణికి నది యేలే సంపెంగలు
అలరుదామెరవిరు లగుఁ గాక
పొలసి పికవాణికి పుయ్యకురే జవ్వాది
చిలుకు చిగురు బంతి చేతి కియ్యరే ॥విరహి॥

దంతియానకు సింహాలఁ దగ వ్రాసిన చీరేలే
చెంతలనే లతల మంజిష్టి గాక
రంతుఁ గలువకంటికి రవిపదక మిదేలే
పంతముతోడ చంద్రాభరణము లిడరే ॥విరహి॥

వడి నీపె గిరికుచవజ్రాల సేస లేలే
అడరుఁ బావులసేసే అమరుఁ గాక
బడి శ్రీవేంకటేశుఁడు పడఁతినిఁ గూడె నింక
కడుఁ గుంకుమపూతేలే గందవొడి చల్లరే ॥విరహి॥ 427

**అవతారిక:**

ఒట్లు అంటే 'రగుల్చు' అని కూడా అర్థమున్నది. ఆ అర్థంలో ప్రయోగించారు పెదతిరుమలయ్య ఆ పదాన్ని. "అసలే ఆమె విరహంతో రగిలిపోతోంది. ఆ తరుణికి తగిన సింగారాలు చేయండర్రా! ఆ చెలికత్తెల రగుల్పులు కూడా యెందుకు" అంటున్నారు. ఒకటికి రెండుసార్లు చదివితేకాని ఈ కీర్తనలోని భావసౌందర్యం అంతుచిక్కదు. ఉదాహరణకు "గజగామినియైన ఈ భామినికి సింహపు బొమ్మలు అద్దిన





చీరెకడతారేమర్రా" అని పెదతిరుమలయ్య భావనా. చెలికత్తె తనతోటివారితో అంటున్నది. అద్భుతంగా లేదూ?

**భావ వివరణ:**

ఓ చెలులారా! మొదలనే (అసలే) ఈమె (ఈ అలమేల్మంగ) విరహిణి (విరహతప్త). వీరి నొట్లికనేల (ఇంకా వీళ్ళ వేధింపులు దేనికమ్మా!) మీ గోల మాని ఈ తరుణికి ఈ సమయంలో తగిన శృంగారాలు (సింగారములను) సేయరే (చేయండమ్మా!).

ఈమె అలినీలవేణి (తుమ్మెదలవంటి నల్లని ముంగురులు కల చిన్నది). ఈ సంపెంగలు తలలో పెడతారా? (మీకు బుద్ధివున్నదా?...) సువాసన గల తామరలపూలు పెట్టండమ్మా! ఈమె పికవాణి (కోయిలగొంతు కలది). కోయిల ఎంత నల్లగా వుంటుంది!! ఇంకా నల్లని జవ్వాది ఈమెకు అద్దుతారా!! వద్దు అది పూయకండి. ఈ చిగురు బంతి (లేత చెండు) వంటి చిన్నదానికి చిలుకు (క) ను ఇవ్వండి. ఆ చిలుక పలుకులు ఈమెకు తగినట్లుంటాయి.

ఈమె దంతియాన (గజగామిని... మెల్లగా గజము వలె నడిచే భామ). ఈమెకు సింహం బొమ్మలు అద్దిన చీరె కడతారా? మీకు జ్ఞానం వున్నదా? చెంతల (మీపక్కనేవున్న) మంజిష్టిలతల (ఎఱ్ఱని పూతీగెలు అద్దిన) చీరకట్టండి. ఈమె కలువకంటి (కలువలవంటి కన్నులున్న యువతి) ఈమెకు మీరేమి నగలుపెట్టారో చూడండి. రవిపదకము (సూర్యపతము). ఇది తీసివేసి చంద్రాభరణాలు పెట్టండే. అవే ఆ కలువకంటికి నప్పుతాయి.

ఈమె గిరికుచ (గిరిశృంగములవలె కఠోరమైన కుచయుగళిగల భామిని). ఈమెపై మీరు చల్లే సేసలు (అక్షతలు) వజ్రములా!! మీకు తోచదేమి? ఈమెకు పూల అక్షతలు చల్లండి. ఇదిగో ఈ శ్రీవేంకటేశ్వరుడు ఈమెను బడిగూడె (శీఘ్రముగా కూడినాడు). ఇంకా ఈమెకు కుంకుమ పూతలెందుకమ్మా? చక్కగా మంచి గంధంపొడి పూయండి.

సంపుటి: 17 కీర్తన : మానరాని మాయలు
సంఖ్య : 5 పుట : 4 రాగం: హిజ్జిజి

**హిజ్జిజి**

29. మానరాని మాయలు
కానీ యందు కేమి కలసీఁ గాని ॥ పల్లవి॥

చాలురా నీ సన్నలు నా
కాలు దాఁకీఁ గదియకు
కాలమందె యిన్నిఁ గంటిమి నా
చేల విడువరా చెప్పీఁ గాని ॥మాన॥

వద్దురా చల్లువలపూ యింత
ముద్దు లేల పల్లు మోఁచీని
అద్దొ కాలు దొక్కె వప్పటి వొక
కొద్ది నుండరా కూడీఁగాని ॥మాన॥

చెల్లురా నీచేఁతలు నా
వొళ్లి చెమ టంటీ నొరయకు
తొల్లి కడపలో దొరసితి నా
వుల్లపు శ్రీ వేంకటోత్తముఁడా ॥మాన॥ 5

**అవతారిక:**

నాడు, దేవునిగడప అని పిలువబడిన నేటి 'కడప'లో నెలకొన్న వేంకటేశ్వరునిపై పెదతిరుమలయ్య చెప్పిన శృంగార కీర్తన ఇది. ఆనాటి తెలుగు పద ప్రయోగం ఈనాడు చలామణిలో లేనందువల్ల కొంత అర్థంకాని పరిస్థితి. తన దేవేరితో ఆయన చెప్పే మాయమాటలకు, మాయవేషాలకు ఆవిడ విసిగిపోయిందిట. "ఇకచెల్లురా, నాచేల విడువరా"





అన్నది. "నీవి మానరాని మాయలు కానీ, అందుకేమి కలసీగాని!" అని అంటున్నది. నేటికాలంలో "అయితే అయ్యాయిలే" అనే వాడుకవున్నది. భావ వివరణ జాగ్రత్తగా చదివితే సమన్వయం దొరుకుతుంది.

**భావ వివరణ:**

ఓ ప్రభూ! ఒప్పుకొంటాను, నీవి మానరాని మాయలు. ఆడువారిని మాయ చేయటం నీ అలవాటు. నీ అలవాటు నీవెన్నటికీ మానవు. అందుకేమి కానీ... కలసీగాని (అయితే అయ్యిందిలే).

చాలురా! నీతో ఇకచాలు. నీ సన్నలు (సైగలు) కట్టిపెట్టు. రహస్యంగా నాకాలును దొక్కి కదియకు (దగ్గరకు) రాకు. కాలమందే అన్నీ కంటిమి (మా కాలంలో ఇట్లాంటివి చాలా చూశాంలేవయ్యా!) చేలవిడువరా చెప్పీగాని (నేను చెబుతున్నాను కదా! ముందు నా చీరెకొంగు విడిచిపెట్టు). నీ తుంటరి చేష్టలు మానివేయి.

ఇంత వలపూ చల్లు వద్దురా! నీదంతక్షతములతో చుంబనములు చురుకుమనుచున్నవి. అద్దో (అదిగో) అప్పటి కాలుదొక్కేవు (మళ్ళీ కాలు తొక్కుతున్నావు). ఒక కొద్దినుండరా కూడీగాని (నన్ను కూడెదవు లేవయ్యా! ఒక్క రవ్వ తగ్గివుండవయ్యా! నలుగురూ చూస్తున్నారు కదా!)

నీ చేతలు చెల్లురా (చెల్లిపోయాయి). అంతగా నన్ను రాసుకొని కూర్చోకు. పాపం! నా ఒంటి చెమట నీకు అంటుకొంటుంది. నీవేం మామూలు వాడివా? తొల్లి (అనాదిగా) కడపలో దొరతనము చేయుచున్న మా అందరి మనోహరుడవైన శ్రీవేంకటోత్తముడవు (శ్రీవేంకటేశ్వరుడవు).

సంపుటి: 17 కీర్తన : బాపురే యెంతటి జాణ బాలకృష్ణుఁడు చూడఁ
సంఖ్య : 206 పుట : 121 రాగం: రామక్రియ

## రామక్రియ

30. బాపురే యెంతటి జాణ బాలకృష్ణుఁడు చూడఁ
బాపనివలె నున్నాఁడు బలరామకృష్ణుఁడు ॥ పల్లవి॥

వొంటి గోపికలచన్ను లుట్లపై కుండ లంటా
అంటుచుఁ చేతులు చాఁచీ నదే కృష్ణుఁడు
వెంటనే అధరములు వెస మోవిపండ్లంటా
గొంటరియై అడిగీని గోవిందకృష్ణుఁడు ॥బాపురే॥

సతుల పెద్దకొప్పులు చక్కిలాలగంప లంటా
బతిమాలి వేఁడీ నప్పటిఁ గృష్ణుఁడు
చతురతఁ బిరుఁదులు చక్కెరదీబ లంటా
తతిగొని యంటీని దామోదరకృష్ణుఁడు ॥బాపురే॥

అంగనలవొడికట్లు అరఁటిపండ్లంటా
సంగతిఁ గౌఁగలించీ వేసాలకృష్ణుఁడు
అంగడి నింతులెల్లాను అలమేలుమంగ యంటా
చెంగలించి కూడీని శ్రీవేంకటకృష్ణుఁడు ॥బాపురే॥ 206

**అవతారిక:**

బాలకృష్ణునిపై పసందైన కీర్తన చెబుతున్నారు పెదతిరుమలాచార్యుల వారు. "అమ్మయ్యో! ఈబాలకృష్ణుడు యెంతటి జాణ!! ఈ బలరామకృష్ణుడు గొల్లవానివలె లేడు బాపని వలె (బ్రాహ్మణుని) మాదిరిగా) వున్నాడు", అంటున్నారు. అన్నమయ్యవలె ఈయన (పెదతిరుమల) ఎన్నుకొనే ఇతివృత్తము చాలా నూతనంగా వుంటుంది. గోపికలతో శృంగార ప్రియునికీ బ్రాహ్మణునికి సాపత్యమేమిటి? కొసమెఱుపేమిటంటే "అంగడి నింతులెల్లాను అలమేలుమంగయంటా





చెంగలించి కూడీని శ్రీవేంకట కృష్ణుడు" అంటున్నారు. అర్థం అయ్యా అవనట్లుందా? భావవివరణ చదవండి సందేహ నివృత్తి చేసికొనండి. బలరామకృష్ణులకు అభేదం సూచిస్తున్నారు.

**భావ వివరణ:**

బాపురే (అమ్మ బాబోయ్), చూడ (చూడబోతే) ఈ బాలకృష్ణుడు యెంతటి జాణ (నేర్పరి)!! ఈ బలరామకృష్ణుడు బాపనివలె (బ్రాహ్మణ పండితుని మాదిరిగా) వున్నాడు. ఆ పోలికలు చూడండి.

ఒంటరిగానున్న గోపికల స్తనయుగ్మములను "అదిగో ఉట్లపైనున్న కుండలు కాబోలు" అని చేతులు చాచి ఈ కృష్ణుడు పట్టుకొనుచున్నాడు. ఆ వెంటనే ఏమి చేస్తాడో వినండి. మా అధరములను చూచి "ఇవి మోవిపండ్లు కాబోలు కొరకనిస్తారా" అని గొంటరియై (కొంటెగా) అడుగుతాడు. ఈ గోవిందకృష్ణుడు, మోవి అంటే పెదవి అనే శ్లేష వాడి తన జాణతనం చూపినాడు.

ఈ కృష్ణుడు గోపికల పెద్ద పెద్ద కొప్పులను జూచి "ఓహో! చక్కిలాల గంపలా!! అబ్బా బాగా ఆకలిగా వుందర్రా! కాసిని చక్కిలాలు పెట్టండి, అని మమ్మల్ని బ్రతిమాలి, అప్పటి వేడీని (మరల మరల వేడుకొంటూ) మా కొప్పులు ముట్టుకొంటాడు. దామోదరుడైన ఈ కృష్ణుడు చతురతన్ (సమయస్ఫూర్తి) చూపించుచూ "అరె! చక్కెర దిబ్బలు ఇక్కడికెలా వచ్చాయబ్బా" అని ఆశ్చర్యం నటిస్తూ మా పిరుదల నంటుతాడు. తతిగొని (ఆసక్తిని పొంది) ఇట్లు నటించు వీనినేమి చేయగలము?

ఈ వేసాల కృష్ణుడు (దొంగవేషాల కృష్ణయ్య) అంగనల (గోపికల) ఒడికట్టును అరటిపండ్లంటూ చేరవయై కౌగలించుకొంటాడు. ఇన్ని చేసినా ఆయన మనస్సులో దేవి అలమేల్మంగకు మాత్రమే స్థానం వున్నదని నిరూపించుటకా!! అన్నట్లు, ఇంతులెల్లా (తనుకూడిన జవ్వనులందరూ) ఆ దేవియేనని ఆ శ్రీవేంకట కృష్ణుడు ఆమెను చెంగలించి (అతిశయించి) కూడినాడు.

సంపుటి: 15 కీర్తన : మొక్కెటి గోపాంగనల మోహనాకారము
సంఖ్య : 221 పుట : 147 రాగం: బౌళి

**బౌళి**

31. మొక్కేటి గోపాంగనల మోహనాకారము
చిక్కని నవ్వులు నవ్వీ శ్రీవేంకటేశ్వరుఁడు ॥ పల్లవి॥

సత్యభామవురముపై చల్లని కస్తూరిపూఁత
తత్తరించే రుక్మిణి చేతామరపూవు
హత్తిన భూకాంతకు యంగపుపయ్యదకొంగు
చిత్తగించరమ్మ వీఁడే శ్రీవేంకటేశుఁడు ॥మొక్కేటి॥

పంతపుపదారువేల బంగారువుంగరము
బంతికే కుబ్జగట్టిన పసిఁడితాళి
వింతగా రాధాదేవివేసిన కలువదండ
చెంతలను వీఁడేయమ్మ శ్రీవేంకటేశుఁడు ॥మొక్కేటి॥

ఆసల తులసీదేవి యఱచేతిలో యుద్దము
భాసురపు యిళాదేవి పట్టుగొమ్ము
శ్రీసతియెక్కినట్టి సింహాసనపు గద్దె
సేస వెట్టించుకున్నాఁడు శ్రీవేంకటేశుఁడు ॥మొక్కేటి॥

**అవతారిక:**

శ్రీవేంకటేశ్వరుడే ప్రహ్లాదవరదుడైన నరసింహుడని, ఆయనే రావణాంతకుడైన శ్రీరామచంద్రుడని, ఆయనే గోపికా చిత్తచోరుడైన శ్రీకృష్ణుడని, క్షీరసాగరశయనుడైన శ్రీమహావిష్ణువని, దశావతారమూర్తి అని భావించి 32000 పైగా కీర్తనలు చెప్పారు తాళ్ళపాక అన్నమాచార్యులు. వేంకట మకుటంతో కీర్తనలు చెప్పిన తన తండ్రి బాటలోనే ఆయన తదనంతరం నడిచి సెబాస్ అనిపించుకొన్నాడు ఆయన కొడుకు తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు. ఆ సంకీర్తనాచార్యుడు అనేక అధ్యాత్మకీర్తనలే కాక తండ్రికి సరితూగే శృంగార కీర్తనలు కూడా చెప్పారు. అదే దీక్ష కొనసాగించే దిట్టతనంగల కొడుకును కన్నాడు. ఆ సుపుత్రుడు చినతిరుమలయ్య. నేను ఎన్నుకొన్న 32 పెద తిరుమల శృంగార





కీర్తనలలో ఇది 31వది. శ్రీకృష్ణ భగవానుని ఎవ్వరు ఏవిధంగా భావించారో, సేవించారో వివరిస్తున్నారు. ఆయనే మన శ్రీవేంకటేశ్వరుడూనట.

**భావ వివరణ:**

ఈ శ్రీవేంకటేశ్వరుని చూడండి. చక్కని (స్వచ్ఛమైన) నవ్వులను విరజిమ్ముతూ నవ్వుతున్నాడు. ఈయన యెవ్వరో కాదు... ఆనాడు బృందావనంలో తనకు మొక్కుతున్న గోపీ స్త్రీల పాలిట మోహనకృష్ణుడు ఈయనే.

ఈయనే సత్యభామకు వురముపై అలదుకొనిన చల్లని కస్తూరి పూత. తత్తరించు (సంభ్రమముచెందు) రుక్మిణీదేవికి తనచేత ధరించిన తామరపూవు. హత్తిన (తనను కూడిన) భూదేవికి ఈయన అంగపుపయ్యెద (కుచగిరులను కప్పువల్లెవాటు). చిత్తగించుడమ్మా! (మనస్సులలో ప్రతిష్ఠించుకొనండి) ఈయనే మన శ్రీవేంకటేశ్వరుడు.

పంతము పట్టిన పదియారువేల రాచకన్నెలకు నరకాసురుని వధించిన తరువాత బంగారు వుంగరములు తొడిగి, తన భార్యలుగా స్వీకరించాడు కదా! అందుకే ఈయన వారికి బంగారపు వుంగరమువంటివాడు. కుబ్జను సుందరిగా మార్చి ఆమె కోరిక మేరకు పుత్రునిప్రసాదించిన కృష్ణయ్య బంతిని (పెళ్ళిళ్ళ వరుసను) మొదలుపెట్టిన దామెతోనే. అందుకే ఆయన ఆమె పాలిటి పసిడి మంగళసూత్రము. రాధాదేవి ఆయనకు వరుసమేనత్త. కాని రాధామాధవ చరితం పావనమైనది. కలువపూలదండవలె నవ్యమైనది. మన చెంతనున్న ఈ శ్రీకృష్ణ కుమార్తే తిరుమల శ్రీవేంకటేశ్వరుడు.

జలంధరుని సంహార నిమిత్తం ఆతని భార్యను కూడినా, ఆమెను పరమపునీతను జేసి తులసీదేవిగా సుప్రసిద్ధనుజేసి నిత్యము తులసిమాలలు ధరించు శ్రీవేంకటేశుడైనాడు. ఆయనే ఆమె అరచేతిలో అద్దమువలె మనకు తోపినాడు. భాసురపు (ప్రకాశించెడి) ఇళాదేవికి (గోదాదేవికి) ఈయన పట్టుగొమ్మ (ఆధారము). ఈయన వురమే శ్రీలక్ష్మి నివాసము. అందుకనే ఈ శ్రీవేంకటేశ్వరుడు అందరిచేతా సేసవెట్టించుకొనినాడు (మంగళగీతికలు పాడించుకొనినాడు). అనండి మరొక్కసారి...

**శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే ।**
**చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం ॥**

సంపుటి: 4 కీర్తన : హరియవతారమె ఆతడితడు
సంఖ్య : 192 పుట : 0129 రాగం: సౌరాష్ట్రం

## సౌరాష్ట్రం

32. హరియవతారమె ఆతఁడితఁడు
పరమ సంకీర్తనఫలములో నిలిపె ॥ పల్లవి॥

వున్నాఁడు వై కుంఠమున నున్నాఁడు యాచార్యునొద్ద
వున్నతోన్నతమహిమ నన్నమయ్య
వున్నవి సంకీర్తనాలు వొట్టుక లోకములందు
పన్నిన నారదాదులు పైపైఁ బాడఁగను ॥హరి॥

చరియించు నొకవేళ సనకాదిమునులలో
హరిఁ బాడుఁ దాళ్ళపాక అన్నమయ్య
తిరమై యాళువారల తేజము దానైయుండు
గరుడానంతముఖ్య ఘనులసంగడిని ॥హరి॥

శ్రీవేంకటాద్రిమీఁద శ్రీపతికొలువునందు
ఆవహించెఁ దాళ్ళపాక అన్నమయ్య
దేవతలు మునులును దేవుఁడని జయవెట్టఁ
గోవిదుఁడై తిరిగాడీఁ గోనేటిదండను ॥హరి॥ 192

**అవతారిక:**

తన తండ్రి అన్నమయ్యపై అద్భుతమైన కీర్తన వినిపిస్తున్నారు పెదతిరుమలాచార్యులవారు. అన్నమయ్య శ్రీహరి అవతారమేనని కీర్తిస్తున్నారు. "ఆతడు హరి అవతారమె. ఇతడు పరమ సంకీర్తన ఫలములో నిలచె"నంటున్నారు. తన తండ్రి పరమపదించి శ్రీవేంకటాద్రిమీద శ్రీపతి కొలువులో చేరాడట. దేవతలు ఋషులు జయజయ ధ్వానాలు చేస్తుంటే కోనేటి పుష్కరిణి ఒడ్డునే పండిత గోష్ఠిలో





దివ్యాత్మ రూపంలో తిరుగాడినాడట. ఈ కీర్తనతో తాళ్ళపాక పెదతిరుమలయ్య చెప్పిన 32 సంకీర్తనలకు అవతారిక సహితముగా భావ వివరణ అందించటం జరిగింది. దీనితో శ్రీవేంకటేశ్వరుని కొలువులో శృంగారసంకీర్తనలకు మంగళము పాడుట అయినది.

**భావ వివరణ:**

ఆతడు (తాళ్ళపాక అన్నమయ్య) హరియవతారమె. ఇతడు పరమ సంకీర్తన (దివ్యమైన సంకీర్తనల) ఫలములో నిలిచినాడు.

ఇతడు శ్రీమహావిష్ణువు యొక్క నివాసమైన వైకుంతము తన స్థానముగానున్నాడు. అందులోనూ ఆచార్యునివొద్ద (శ్రీరామాను -జాచార్యులవారు) వున్న చోటునే తానూ వున్నాడు. ఎందుకంటే ఈయనకూడా ఉన్నతోన్నతమైన మహిమలు కలవాడైనాడు కదా! ఆయన భూలోకంలో పాడిన సంకీర్తనలను పట్టుకొని నారదమహర్షివంటివారు పైపై పాడుతుంటే (తాము వంతపాడుతుంటే) అన్నమయ్య వాటిని వింటూ ఆనందిస్తున్నాడు.

ఆ తాళ్ళపాక అన్నమాచార్యులవారు ఒక్కొక్కసారి సనకసనందనాది ఋషులతో కలిసి తిరుగుతుంటారు. ఒక్కొక్కసారి హరి సంకీర్తనలు పాడుతుంటారు. తిరమై (స్థిరమైన) ఆళ్వారుల (వైష్ణవ భక్తశ్రేష్ఠుల) తేజస్సే తానైనట్లుగా, గరుత్మంతుడు, అనంతుడు (ఆదిశేషుడు) మొదలైన శ్రేష్ఠుల సాంగత్యముతో వారు గడుపుతున్నారు.

వైకుంతంనుండి భూలోకంలో ఏమిజరుగుతున్నదో చూడటానికి విచ్చేసినప్పుడు, అన్నమయ్య శ్రీవేంకటాద్రిమీద శ్రీపతి కొలువులో ఆవహించి (కలిగి) వుంటారు. శ్రీవేంకటేశ్వరుని కొలువు కేతెంచిన దేవతలు, మునులు ఈ తాళ్ళపాక అన్నమాచార్యులవారు దేవుడని కీర్తిస్తూ జయజయధ్వానములు చేస్తుంటే ఆ స్వామిపుష్కరిణి ఒడ్డున కోవిదుడై (విద్వాంసునివలె) తిరుగాడుతారు.

(మనం మానవమాత్రులంకాబట్టి అవేమీ చూడలేము. అది మన దుదృష్టం... అంతే.)

సంపుటి: 4 కీర్తన : కొలిచితే రక్షించే గోవిందుఁడితఁడు
సంఖ్య : 180 పుట : 121 రాగం: ఆహిరి

**ఆహిరి**

33. కొలిచితే రక్షించే గోవిందుఁ డితఁడు
యిలకు లక్ష్మికి మగఁడీ గోవిందుఁ డితఁడు ॥ పల్లవి॥

గోవర్ధన మెత్తినట్టి గోవిందుఁ డితఁడు
వేవేలు గొల్లెతల గోవిందుఁ డితఁడు
కోవిదుఁడై ఆలఁగాచే గోవిందుఁ డితఁడు
ఆవలఁ గంసుఁ జంపిన ఆ గోవిందుఁ డితఁడు ॥కొలి॥

క్రూరకాళింగమర్దన గోవిందుఁ డితఁడు
వీరచక్రాయుధపు గోవిందుఁ డితఁడు
కోరి సముద్రాలుదాఁటే గోవిందుఁ డితఁడు
ఆ రీతి బాలురఁ దెచ్చే యా గోవిందుఁ డితఁడు ॥కొలి॥

కుందనపుకాశతోడి గోవిందుఁ డితఁడు
విందుల రేపల్లె గోవిందుఁ డితఁడు
పొంది శ్రీవేంకటాద్రిపై పొసఁగఁ దిరుపతిలో
అందమై పవ్వళించిన ఆ గోవిందుఁ డితఁడు ॥కొలి॥ 180

**అవతారిక:**

తిరుపతిలో వెలసిన శ్రీగోవిందరాజస్వామిపై చక్కటి భజన ఆలపిస్తున్నారు అన్నమాచార్యులవారు. భజన భక్తి పరాకాష్ట చెందే ప్రక్రియ. సజ్జన సాంగత్యంలో భక్తి పూర్వకంగా భగవన్నామ సంకీర్తన చేస్తే పుణ్యం సంగతి అటుంచి చక్కని మానసిక ప్రశాంతత సిద్ధిస్తుంది. ఇది సన్నుతి కాబట్టి భావవివరణ ప్రాముఖ్యత ఎక్కువ వుండదు. ఒకటి రెండుచోట్లు తప్పించి కీర్తన కిష్టంకాదు. "కోరి సముద్రాలు దాటే గోవిందుడు" అనే చరణమూ "కుందనపుకాశతోడి గోవిందుడు" అనే





చరణమూ మాత్రమే వివరణ అవసరమైనవి. అవునా? ఇంతకీ ఈయన ఏ బాలురకోసం ఎప్పుడు సముద్రాలు దాటాడు? ఏమో! ఆలోచించండి.

**భావ వివరణ:**

ఇతడు (ఈ గోవిందరాజస్వామి) కొలిచితే (శరణని సేవిస్తే) రక్షించే గోవిదుడు. ఈయన ఇలకు (భూదేవికి), లక్ష్మికి (శ్రీదేవికి) మగడు (భర్త). ఈ గోవిందుని సేవించండి.

ఈయన నందవ్రజమున గోవులను, గోపాలురను ఇంద్రుని రాళ్ళవర్షంనుండి రక్షించుటకు తన చిటికెన వ్రేలిపై గోవర్ధన పర్వతము నెత్తి దాని క్రింద వారిని చేర్చి రక్షించాడు. వేవేల (అనేకమంది) గొల్లెతలు కోరుకొన్న గోవిందుడితడే. కోవిదుడై (పెద్దవాడై) గోవులను కాచి గోవిందుడని ప్రసిద్ధి జెందినాడు. ఆ గోవిందుడే ఆవల (అటు తరువాత) మధురానగరమునకు బోయి దుష్ట కంసుని జంపి తనతల్లిదండ్రులైన దేవకీ వసుదేవులను చెఱనుండి విముక్తులను చేశాడు.

ఈ గోవిందుడు క్రూరుడైన కాళిందుడు అనే సర్పము యమునానదిని విషపూర్తించేసి ప్రాణహాని చేస్తుంటే, దానిని మర్దించి వెడలగొట్టి అందరినీ రక్షించాడు. వీరత్వమునకు ప్రతీకయైన తన సుదర్శన చక్రముతో శిశుపాలుని వంటి యెందరిని తుదముట్టించాడో లెక్కయే లేదు. తన గురువు సాందీపుని కోరిక మేరకు, తన తల్లి దేవకీదేవి కోరిక మేరకు సముద్రములను దాటిపోయి యెన్నడో చనిపోయినవారి పుత్రులను తిరిగి సజీవులుగ దెచ్చి వారి కోరికలను తీర్చిన గోవిందుడితడే.

ఈ గోవిందుడు కుందనపు కాశతోడివాడు (ఈయన బంగారు వర్ణము గల వస్త్రమును ధరించి పీతాంబరుడని విశ్వవిఖ్యాతుడైనాడు. రేపల్లెలో పాలు, వెన్న, నేయి అన్నీ దొంగిలించి తన తోటి గోపాలురకు విందులు చేసినాడు. ఆ ద్వాపరయుగం అంతరించి నేటి కలియుగం వచ్చేసింది. ఇప్పుడు జనులను ఈతి బాధలనుండి రక్షించుటకు శ్రీవేంకటాద్రిపై శ్రీవేంకటేశ్వరునిగాను, ఈ తిరుపతి నగరంలో గోవిందరాజస్వామిగాను ఆ కృష్ణయ్యే వెలసి అందముగా పవ్వళించి కనుపించుచున్నాడు.

సంపుటి: 4 కీర్తన : ఇదియే సాధనమిహపరములకును
సంఖ్య : 384 పుట : 258 రాగం: మలహరి

## మలహరి

34. ఇదియే సాధన మిహపరములనకును
పదిలము మాపాలి పరమపునామం ॥ పల్లవి॥

కలిదోషహరము కైవల్యకరము
అలరిన మా శ్రీహరినామం
సులభము సౌఖ్యము శోభనతిలకము
పలుమారును శ్రీపతినామం ॥ఇది॥

పాపనాశనము బంధవిమోక్షము
పై పైనిది భూపతినామం
స్థాపితధన మిది సర్వరక్షకము
దాఁపిర మిది మాధవనామం ॥ఇది॥

నేమము దీమము నిత్యకర్మమిది
దోమటి గోవిందనామం
హేమము శరణము యిన్నిట మాకును
యేమేర శ్రీవేంకటేశ్వరునామం ॥ఇది॥384

**అవతారిక:**

శ్రీహరినామ సంకీర్తన యొక్క మహిమను వివరిస్తున్న అన్నమయ్య అద్భుత కీర్తన నాలకించండి. ద్రాక్షాపాకం అని సంబరపడిపోతే ప్రమాదం. ఒకటి రెండు చోట్ల నేను నిఘంటువును తెరవక తప్పనేలేదు సుమండీ! ఈ మాధవుని నామము 'దాఁపిరము' అంటున్నారు. అంటే దాచిపెట్టిన సొమ్ము అని అర్థం. నేమము, దోమము, నిత్యకర్మమిది అంటే ఏమిటి? ఇట్లా అన్నీ ఇక్కడే చెబుతే ఎలా? ఇది బహుళజనాదరణ పొందిన





కీర్తన. అన్నట్లు... దీమము అంటే 'ఇల్లు' అనే అర్థం వున్నప్పటికీ... 'దీమసము' అంటే ధైర్యము కాబట్టి ధైర్యమునిచ్చునది అనే భావన అన్నమయ్యది కావచ్చును.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! ఇహపరములకు (ఈ భూలోకంలో ఆనందానికి, చనిపోయిన తరువాత పరలోకంలో వున్నతంగా వుండడానికీ) ఇదియే (ఈ శ్రీహరి నామసంకీర్తనమే) సాధనము (వుపయోగకరము), పదిలము (సురక్షితమైనది). మాపాలి (మాయందు) ఈ నామము మోక్షకరమైనది.

మా శ్రీహరి నామసంకీర్తనము కలియుగములో నిత్యమైన దోషములను నివారించునది. మనము చనిపోయాక కైవల్యము (మోక్షము) సిద్ధింపజేస్తుంది. చాలా సులభమైనది. సౌఖ్యప్రదమైనది. శోభన తిలకము (శుభములు నొసంగుటలో నెన్నుదుటి బొట్టు వంటిది). ఈ శ్రీహరి నామము పలుమారును (మాటిమాటికీ చేయండి). మంచిదే సుమండీ!

ఈ శ్రీహరినామము పాపమును నశింపజేయునది. భవబంధములను సడలించునది. భూపతినామము (భూదేవి భర్తయైన ఈ స్వామి నామము) పైపైనిది (అలవోకగా తేలికయైనది). ఇది స్థాపించబడిన ధనము (ఫిక్స్‌డ్ డిపాజిట్) వంటిది. అందుచేత సర్వత్రా రక్షించునది. ఈ మాధవుని నామము దోపిరము (దాచిపెట్టుకొన్న సొమ్మువంటిది). ఏనాటికైనా సొమ్ములు వుపయోగపడేవే కదా!

ఈ శ్రీహరినామము నిత్యకర్మములవలె (సంధ్యావందనము మొదలైన కర్మలవలె) చేయదగినది. ఇది నేమము (నియమము ప్రకారము చేయదగినది). ఇది దీమము (ధైర్యమునిచ్చునది). ఈ గోవిందుని నామము దోమటి (జీవించుటకు తినే అన్నము వంటిది). మాకు ఇన్నిటా (ఇన్నిటిలోనూ) శరణునొసగు బంగారము వంటిది. ఈ శ్రీవేంకటేశ్వరుని నామమునకు ఏమేర (హద్దుయేది?) దీనికి మితి లేనేలేదు.

సంపుటి: 4 కీర్తన : శ్రావహనబహుళాష్టమి జయంతి నేఁడు
సంఖ్య : 139 పుట : 93 రాగం: సాళంగనాట

## సాళంగనాట

35. శ్రావణబహుళాష్టమి జయంతి నేఁడు
సేవించరో నరులాల శ్రీకృష్ణుఁ డితఁడు ॥ పల్లవి॥

భావింప వసుదేవునిపాలిటి భాగ్యదేవత
దేవకి గనినయట్టి దివ్యరత్నము
చేవమీర సురల రక్షించే కల్పతరువు
యీ వేళ జన్మించినాఁడు యిదె కృష్ణుడు ॥శ్రావ॥

హరవిరించాదులకు నాదిమూలకారణము
పరమమునుల తప:ఫలసారము
గరుడోరగేంద్రులకుఁ గలిగిన నిధానము
యిరవుగా నుదయించె నిదె కృష్ణుఁడు ॥శ్రావ॥

బలుయోగీశ్వరుల బ్రహ్మానందము
చెలఁగు భాగవతుల చింతామణి
అలమేల్మంగకుఁ బతి యట్టె శ్రీవేంకటాద్రి
నిలపై జన్మించినాఁడు యిదె కృష్ణుఁడు ॥శ్రావ॥139

**అవతారిక:**

ఒకానొక కృష్ణజయంతి సందర్భంగా అన్నమాచార్యులవారు వినిపించిన మధుర కీర్తన ఇది. శ్రావణ బహుళ అష్టమినాడు శ్రీమన్నారాయణుడే అర్ధరాత్రి కంసుని చెరసాలలో దేవకీదేవి గర్భమున అష్టమునిగా జన్మించాడు. అసంఖ్యాకంగా దానవులను, దానవాంశముతో జన్మించిన దుష్టరాజలోకమును యమపురికంపాడు. ప్రజలు యెంత ఆనందించారంటే నేటికి అది జరిగి 5241 సంవత్సరాలైనా, దేశమంతటా





మహోత్సవంగా శ్రీకృష్ణజయంతిని జరుపుకొంటున్నారు. నేటికీ ప్రపంచం నలుమూలలా ఇటువంటి కీర్తనలు పాడుతూనే వున్నారు.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! ఈరోజు శ్రావణ బహుళ అష్టమి. నేడే శ్రీకృష్ణ జయంతి. ఇదిగో ఈయనే శ్రీకృష్ణుడు. ఈదేవదేవుని సేవించరో! (సేవించి తరించండి). ఈతడు అందరికీ అన్నీ అయినా, కొందరికి వారు కోరినట్లే కోర్కెలను తీర్చాడు.

వసుదేవుడు ఆయన కన్నతండ్రి. వసుదేవుని భావనకు తగినట్లే ఆయన పాలిటి భాగ్యదేవతయై అంత్యమున మోక్షం ప్రసాదించాడు. తల్లి దేవకీదేవి కడుపున జన్మించిన దివ్యరత్నము. సామర్థ్యంతో దేవతలనందరినీ అడుగడుగునా రక్షించిన కల్పవృక్షము ఈ శ్రీకృష్ణుడు. ఇదిగో ఈవేళ ఆయన జన్మించినాడు. పండుగ జరుపుకోండి.

ఈ శ్రీకృష్ణపరమాత్మ త్రిమూర్తులకు మూలకారణము. హరునికి లయము, విరించికి (బ్రహ్మదేవునికి) సృష్టి, విష్ణువునకు స్థితి (లోకపాలన) బాధ్యతలను వొప్పగించినది ఈయనే. పరమ మునీశ్వరుల తప:ఫలము యొక్క సారము ఈ భగవంతుడే. గరుత్మంతునికి, ఉరగేంద్రునకు (ఆదిశేషునికీ) ఈయన కలిగిన నిధానము (పెన్నిధివంటి వాడు). ఇదిగో నేడు ఇరవుగా (సుస్థిరముగా) ఈ శ్రీకృష్ణుడు వుదయించినాడు.

ఈయన బలుయోగీశ్వరులకు (గొప్పతపోబలం కలిగిన యోగీశ్వరులకు) బ్రహ్మానంద స్వరూపుడు. వారు ఆయనను ఆనందస్వరూపునిగానే భావిస్తారు. భాగవతులకు (భగవంతునే నమ్మినవారికి) చింతామణివలె కోరిన కోర్కెలన్నీ తీరుస్తాడు. దేవి అలమేల్మంగకు ఈయన ప్రాణవల్లభుడు. ఇలపై శ్రీవేంకటాద్రిని ఇదే కృష్ణుడు శ్రీవేంకటేశ్వరుడై అవతరించాడు. సేవించి తరించండయ్యా!

సంపుటి: 2 కీర్తన : శరణు శరణు వేదశాస్త్రనిపుణ నీకు
సంఖ్య : 347 పుట : 233 రాగం: సాళంగనాట

## సాళంగనాట

36. శరణు శరణు వేదశాస్త్రనిపుణ నీకు
అరుదైన రామకార్యధురంధరా ॥ పల్లవి॥

హనుమంతరాయ అంజనాతనయా
ఘనవాయుసుత దివ్యకామరూప
అనుపమలంకాదహన వార్ధిలంఘన
జనసురనుత కలశాపురనివాస ॥శర॥

రవితనయసచివ రావణవనాపహార
పవనవేగబలాఢ్య భక్త సులభ
భువనపూర్ణదేహా బుద్ధివిశారద
జవసత్వ వేగ కలశాపురనివాస ॥శర॥

సీతాశోకనాశన సంజీవశైలాకర్షణ
ఆతతప్రతాపశౌర్య అసురాంతక
కౌతుక శ్రీవేంకటేశుకరుణాసమేత
శాతకుంభవర్ణ కలశాపురనివాస ॥శర॥347

**అవతారిక:**

కలశాపురంలో వెలసిన హనుమంతుని కీర్తిస్తున్న అన్నమా-చార్యులవారు ఆవేద శాస్త్ర నిపుణుని శరణువేడుతున్నారు అన్నమయ్య వుపయోగించే విశేషణాలు మరెక్కడా విని వుండరు. ఇది చూడండి... అరుదైన రామకార్యధురంధరుడట ఆ స్వామి గతంలో నేనుకూడా ఈమాటను దురంధరుడుగా భావించి ఆ మాట అర్థం తెలియక చేతులెత్తేశాను. ఇది ముద్రారాక్షస ప్రభావం. నేడు అది 'ధురంధరుడు'





అని గ్రహించాను. ధురంధరుడు అంటే భారము వహించినవాడని అర్థం. శాతకుంభము అంటే బంగారపు కుండ. ఆ రంగులో వున్న ఆ స్వామి శ్రీవేంకటేశ్వరుని కరుణాసమేతుడట. ధన్యోస్మి.

**భావ వివరణ:**

ఓ హనుమంతరాయా! వేదశాస్త్రమునందు అద్వితీయుడా! బహు అరుదైన రామకార్య ధురంధరా! (శ్రీరామకార్య భారమును వహించిన వాడా!) నీకు శరణు తండ్రీ! శరణు.

ఓ హనుమంతరాయా! అంజనీదేవి పుత్రుడవైన నీవు వాయుదేవుని సుతుడవు. దివ్య కామరూపివి (ఏ రూపము కావలెనంటే ఆ రూపం పొందగలిగిన అద్భుతమహిమ గలవాడవు.) అనుపమ లంకా దహనుడవు (పోలిక చెప్పలేని లంకానగరమును కాల్చిబూడిద చేసినవాడవు). వార్ధి లంఘనుడవు (సముద్రమును దుమికి దాటిన దిట్టవు). ఓ కలశాపురి నివాసా! నీవు జనసురనుతుడవు ప్రజలచేతను దేవతల చేతను కీర్తింపబడు మహానుభావుడవు.

ఓ దేవా! నీవు రవితనయ సచివుడవు (సూర్యుని కుమారుడైన సుగ్రీవునికి మంత్రివి). రావణునికి అత్యంత ప్రీతిపాత్రమైన అశోకవనము యొక్క అపహారా! (వైభవమును తగ్గించిన వాడా!) ఝంఝూమారుత వేగముకల బలశాలీ! నీవు భక్తసులభుడవు (నీ భక్తులను తేలికగా అనుగ్రహించు దేవుడవు). విశ్వమంతా నిండిపోగలిగిన దేహము పొందిన, బుద్ధి విశారదుడవు (మిక్కిలి బుద్ధిశాలివి). ఓ కలశాపురి నివాసా! నీవు జవసత్వ వేగము కలవాడవు (గొప్ప వేగము కల గుఱ్ఱమునకున్న వేగము కలవాడవు).

ఓ ప్రభూ! నీవు సీతాదేవి శోకమును తుదముట్టించినవాడవు. సంజీవనీ పర్వతమును పెకలించితెచ్చినవాడవు. ఆతతప్రతాపశౌర్యుడవు (విరివియైన ప్రతాపము, శూరత్వము కలవాడవు). రాక్షసాంతక కౌతుక (రాక్షసులను అంతమొందించుటకు కుతూహలము కలవాడవు. శ్రీవేంకటేశ్వరుని కరుణ కలవాడవు. ఓ కలశాపురి నివాసా! నీవు శాతకుంభవర్ణుడవు (బంగారపు కుండ రంగుకల) దివ్యతేజోమూర్తివి.

సంపుటి: 2 కీర్తన : నాటికి నాదు గొత్తనేటికి నేడు గొత్త
సంఖ్య : 85 పుట : 57 రాగం: శంకరాభరణం

## శంకరాభరణం

37. నాటికి నాఁడుగొత్త నేటికి నేఁడుగొత్త
నాటకపుదైవమవు నమో నమో ॥ పల్లవి॥

సిరుల రుక్మాంగదుచేతికత్తిధారఁ దొల్లి
వరుస ధర్మాంగదుపై వనమాలాయె
హరి నీ కృపకలిమి నట్లనే అరులచే
కరిఖడ్గధార నాకుఁ గలువదండాయె ॥నాఁటి॥

మునుపు హరిశ్చంద్రు మొనకత్తిధారఁ దొల్లి
పొనిగి చంద్రమతికిఁ బూవు దండాయె
వనజాక్ష నీ కృపను వరశత్రు లెత్తినట్టి
ఘనఖడ్గధార నాకుఁ గస్తూరివాటాయ ॥నాఁటి॥

చలపట్టి కరిరాజు శరణంటే విచ్చేసి
కలుషముఁ బెడఁబాపి కాచినట్టు
అలర శ్రీవేంకటేశ ఆపద లిన్నియుఁ బాపి
యిల నన్నుఁ గాచినది యెన్నఁ గతలాయ ॥నాఁటి॥85

**అవతారిక:**

చక్కటి పురాణగాథలను ప్రస్తావించే ప్రశస్తమైన కీర్తన నాస్వాదించండి. అన్నమాచార్యుల పురాణ పాండిత్యం అబ్బురపరుస్తుంది. పల్లవి కూడా అంత తేలికగా అర్థంకాని అర్భకత్వం నాబోంట్లది. ఎంతో పరిశ్రమతో ఒక కొలిక్కితేగలిగాను. స్వామీ! నీవు నాటకపు దైవమవు. జగన్నాటక సూత్రధారివి. నీ లీలలన్నీ వింతలే. అవి నాటికి నాడే కొత్త అంటే, నిన్నటికి నిన్నయే కొత్తగా వుంటాయి. నేటికి నేడు గొత్త అంటే ఈరోజుకి ఈరోజే కొత్తగావుంటాయి. మొత్తానికి ఎప్పటికప్పుడే నూతనంగా వుంటాయి. అటువంటి నీకు నమోనమో అంటున్నారు. ఆవైనం వుదాహరించటానికి రుక్మాంగద, ధర్మాంగదుల కథ; హరిశ్చంద్ర, చంద్రమతుల గాథ,





గజేంద్రమోక్షము కథ ప్రస్తావిస్తున్నారు. అందుకే శ్రీవేంకటేశా! ఆపదలగాచే నీ కథలు కర్ణపేయమైనవి.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీవు నాటకపు దేవుడవు (జగన్నాటక సూత్రధారివి). నీలీలలు యెరుంగరానివి. అవి, నాటికి నాడే గొత్త (ఆరోజుకారోజే నూతనంగా వుంటాయి). నేటికి నేడే గొత్త (ఇవ్వాళకివ్వాళ నూతనంగా వుంటాయి). అట్టి నీకు నమోనమో (అనేక వందనములు).

నీ భక్తుడైన రుక్మాంగద మహారాజు కర్తవ్య పాలనలో తనబిడ్డడైన ధర్మాంగదుని శిరచ్ఛేదనకు సిద్ధపడ్డాడు. నీ భక్తుల ధర్మ నిరతి నిన్నెంత ఆనందింపజేస్తుందంటే, 'ఆ ఖడ్గధార' (కత్తిపదునైన అంచు) నీ మహిమవల్ల చక్కటి వనమాల (తులసిదండ) అయింది. అట్లనే (ఆవిధంగానే) నీకృప అనే కలిమిని పొందిన నాకు కరఖడ్గధార కూడా కలువదండ వలె మారిపోయి నన్ను రక్షిస్తుంది. సందేహం లేదు.

(అన్నమయ్య శివకేశవులకు భేదము లేదని నమ్మినవాడు అనుటకు ఈ కీర్తన వుదాహరణ. హరిశ్చంద్రుని కథలో శివుని లీలనే ఇక్కడ విష్ణుమాయగా అభివర్ణించుచున్నారు. నిజానికి అదే నిజము. అవునా?)

మునుపు (తొల్లి) హరిశ్చంద్రుని సత్యసంధతను జగతికి నిరూపించుటకు విశ్వామిత్రుడు అనేక ఇక్కట్లపాలు చేశాడు. సుతుడు మరణించినా, భార్య తల రాజాజ్ఞచే ఖండించవలసివచ్చినా హరిశ్చంద్రుడు వెనకాడలేదు. భగవత్ కృపవల్ల హరిశ్చంద్రుని మొనకత్తిధార (పదునైన కత్తి) పూవులదండవలె మారిపోయింది. ఓ పద్మనయనా! నీ కరుణ వుంటే నా శత్రువుల కరవాలములు కూడా నాకు కస్తూరి వాటాయె (కస్తూరిపూతలవుతాయి).

ఆనాడు వనములో గజేంద్రుడు చలపట్టి (మాత్సర్యము విడనాడి) నీవే తప్ప ఇత:పరంబెరుగను రక్షించు శరణు అని (మొరబెట్టుకొంటే) విచ్చేసి, కలుషము బెడబాపావు (వాని పీడను తొలగించావు). మకరి శిరస్సు ఖండించి కరిరాజవరదుడవైనావు. ఆవిధంగా అలరిన (వికసించిన) ఓ శ్రీవేంకటేశ్వరా! నా ఆపదలన్నింటినీ తొలగించి ఇక్కడ నన్నున్ గాచినది (రక్షించుటకూడా) ఎన్నన్ కతలాయె (ఎన్నికగన్న కథలైనవి) తండ్రీ!

సంపుటి: 4 కీర్తన : వొద్దు నీవు నా కెదురా వోరి కంసుడా
సంఖ్య : 110 పుట : 74 రాగం: నాట

**నాట**

38. వొద్దు నీవు నా కెదురా వోరి కంసుఁడా
కొద్దిగాదు పెనఁగఁగ గోవిందుతోఁ గంసుఁడా ॥ పల్లవి॥

పెరిఁగీ రేపల్లె నదె బిరుదు నీ వైరివాఁడే
వొరసి నన్నేల పట్టేవోరి కంసుఁడా
విరసాన వెరవను విష్ణునిమాయను నీ
గొరబైన వెడబుద్ధి గొలుపదు వోరా ॥వొద్దు॥

వెదకీ నీ వైరివాఁడె వీరదానవుల నదె
వుదుటు నాతోనేల వోరి కంసుఁడా
నిదుమనా నిన్నిపుడే సెలవీఁడుగా కతఁడు
పెదవులచేటింతే పేదవానికోపము ॥వొద్దు॥

వెన్నలుఁ బాలరగించి వెస వాఁడె సత్వగూడ
నున్న వాఁడు నిన్ను గెల్వ నోరి కంసుఁడా
వెన్నుఁడు శ్రీవేంకటాద్రివిభుఁడు లోకులఁ గాచె
నన్నిటాఁ గృష్ణావతార మందఁబట్టి నేఁడు ॥వొద్దు॥110

**అవతారిక:**

దేవకీదేవికి పుట్టిన శిశువును చంపబోయాడు కంసుడు. సంహరించేముందు "ఒరే గోవిందుడు వేరొకచోట పెరుగుతున్నవాడురా! కొద్దిగాదు వానితో పెనగుట. వొద్దు నీవు నాకెదురు నిలబడగలవా?" అని హెచ్చరించింది, శిశువురూపంలో వున్న యెగమాయ. ఆ హెచ్చరికనే ఒక కీర్తన రూపంలో ఆవిష్కరిస్తున్నారు అన్నమాచార్యులవారు. "నభూతో నభవిష్యతి", ఇది అన్యులవల్ల అయ్యేపని కాదయ్యా అన్నమయా!" బాగా





వెన్నా, పాలూ ఆరగించివాడు సత్వ పెంచుకొని నిన్నుగెల్వటానికి వస్తాడురా! వాడు వెన్నుడైన వేంకటేశ్వరుడురా! లోకములను గాచేందుకు కృష్ణావతారమెత్తాడు కాబట్టి జాగ్రత్త!" అని యోగమా(య) కీర్తనపాడటం వూహించను కూడా సాధ్యం కాదు. ఆనందం మీదే... జుర్రుకోండి.

**భావ వివరణ:**

ఓరీ! కంసుడా! వొద్దు నీవు నాకెదురా (నన్నెదిరించగలవుటరా?) గోవిందుతో పెనగగ (కృష్ణునితో తలబడుట) కొద్దిగాదు (సామాన్యమైనది కాదురా!)

నీవైరివాడే (నీశత్రువైన ఆకృష్ణయ్యే) అదిగో రేపల్లెలో బిరుదు పెరిగీ (శ్రేష్ఠుడై పెరుగుతున్నాడురా). ఒరే! కంసుడా! నన్నేల వొరసి పట్టేవు (నన్నెందుకు బిగించిపట్టుకుంటావురా!) నేను శ్రీమహావిష్ణువుయొక్క యోగమాయనురా! నీ విరసాలకు (బెదిరింపులకు) వెరువను (భయపడతానుటరా!) నీ గొరబైన వెడబుద్ధి (నీ వికారం కలిగించే వంకరబుద్ధి చేష్టలు) గొలుపదు (నీకు మంచి చేయదు). ఇదే హెచ్చరిక.

నీ శత్రువైన ఆ కృష్ణుడు వీరులైన దానవుల నందరినీ, వెదకి వెదకి మట్టుబెడతాడు. నీ ఉదుటు నాతోనేలరా? (నీ గొప్పలు నాముందు యెందుకురా?) అతడు (ఆ శ్రీమన్నారాయణుడు) నాకు సెలవీడుగా (అనుమతించదు కదటరా!) లేకుంటే... నిన్నిప్పుడే చిదుమనా (చిదిమి పారేసేస్తాను. ఏమనుకొన్నావో! జాగ్రత్త!) ఒరే! పేదవాని కోపం పెదవికి చేటు అనే సామెతను వినలేదా? నీకోపం ఆ దేవదేవునేమి చేస్తుందిరా? మూర్ఖా!

వాడే (ఆబాలకృష్ణుడే) రేపల్లెలో వెన్నలు, పాలు సత్వగూడ (బలం పెంచుకోవటానికి) ఆరగించనున్నవాడు. ఓరి కంసా! వాడు నిన్ను గెల్వనున్నాడురా!. ఎందుకంటే నేడు వాడు వెన్నుడైన (విష్ణుమూర్తియైన) శ్రీవేంకదాద్రివిభుడు. అన్నిటా (అన్నివిధములా) లోకములను కాచే (సంరక్షించే) కృష్ణావతారమును అందబట్టి (యెత్తాడు కాబట్టి) నీపని గోవింద... అంతే.

సంపుటి: 3 కీర్తన : చేరి యందెలమోతతో చెన్నకేశవా
సంఖ్య : 179 పుట : 120 రాగం: పాడి

**పాడి**

39. చేరి యందెలమోఁతతో చెన్నకేశవా
యీరీతి మూడువపూరిలో నిట్లాడేవా. ॥ పల్లవి॥

మున్ను యశోదవద్దను ముదు గునిశాడితివి
పన్ని రేపల్లె వీధులఁ బారాడితివి
పిన్నవై గోపాలులతోఁ బిల్లదీపులాడితివి
యెన్నిక మాఁడుపూరిలో యిట్లాడేవా ॥చేరి॥

కాళింగుపడిగెలపై కడునాట్యమాడితివి
కేలి యమునలో రాసక్రీడ లాడితి
చేలలంటి గోపికల చెట్టాపట్టాలాడితివి
యీలీల మూఁడు పూరిలో యిట్లాడేవా ॥చేరి॥

తగువిభాండకునితో దాఁగిలి ముచ్చలాడితి
అగడుగా బండివిరిచాటలాడితి
వొగి శ్రీవేంకటగిరినుండి వచ్చి మాఁడుపూర
నెగసెగసి గతుల కిటులాడేవా(?) ॥చేరి॥ 179

**అవతారిక:**

'మాడుపూరు' అనే గ్రామమున వెలసిన చెన్నకేశ్వరస్వామి మీద చక్కటి భక్తి పూర్వకమైన కీర్తన చెబుతున్నారు అన్నమాచార్యులవారు. చెన్నకేశవుడు అంటే... అందమైన కేశపాశము కలవాడని అర్థం. కాలి అందియలు ఘల్లు ఘల్లుమని మ్రోగుతుంటే... ఈవిధంగా మాడుపూరిలో ఆడుకొంటున్నావా స్వామీ! అని పాడుతున్నారు. యశోదమ్మ దగ్గర ముద్దులు కుడిచావు, గోపాలురతో ఆటలాడావు, కాళింగుని పడిగెలమీద నృత్యం చేశావు, గోపికలతో చెట్టాపట్టాలాడినావు, విభాండకునితో దాగిలి ముచ్చులాడావు, శకటాసురుని సంహరించావు. నేడు ఆ శ్రీ వేంకటగిరి





నుండి వచ్చి మాడుపూరులో నెగనెగసి గతుల కిటులనాడేవు అంటున్నారు. అంటే...?

**భావ వివరణ:**

ఓచెన్నకేశవా! యీవిధముగా మాడుపూరుగ్రామమున చేరి, అందెలు (కాలిగజ్జెలు) మ్రోగుతుంటే, ఇట్లు ఆడేవా ప్రభూ!

మున్ను (ఇదివరలో) నీతల్లి యశోదాదేవి వద్ద ముద్దు గునిశి ఆడితివి (ముద్దులు కుడిచి ఆడినావు). పన్ని (పూనుకొని) రేపల్లె వీధులలో పారాడినావు. అందరిలోకీ చిన్నపిల్లవాడివైనా తోటి గోపబాలురతో సమవుజ్జీగా పిల్లదీపులు అనే ఆటను ఆడితివి. ఈ ఆటలో ఒంగివున్న ఒకరి మెడపైనుంచి ఇంకొకరు కాలు తగులకుండా దుముకవలెను). ఓ దేవదేవా! ఏమయ్యా నీలీల! అనామకులైన నీభక్తులను మోసినావా! మాడుపూరిని ఎన్నికజేసి ఇట్లు ఆడితివా!

ఆనాడు యమునా నదిని విషపూరితం చేసి ప్రాణులనందరినీ చంపుతున్న కాళింగుడనే సర్పరాజుకు బుద్ధి చెప్పాలని, వాని పడిగెలపై నృత్యం చేసి రక్తం కక్కుకొనునట్లుచేసి, వాని భార్యల దీనశరణాగతిని మన్నించి క్షమించావు. ఆ యమునానదిలోనే ప్రియురాండ్రయిన గోపికల చేలలంటి (చీరెలు దొంగిలించి) చెట్టాపట్టాలాడినావు. (ఒకళ్ళ భుజాలపై ఇంకొకళ్ళు తమ చేతులు మెడచుట్టూవేసి దగ్గరకు తీసికోవటాన్ని, అలాగే కలిసి నడవటాన్ని చెట్టాపట్టాలేసికొనుట - అంటారు) ఈ విధంగా మాడుపూరులో ఇట్లు ఆడినావు స్వామీ!

విభాండకుడనే రాక్షసుడు, తగు గోపబాలునివలె మారిపోయి వారి గుంపులోచేరి కృష్ణుని చంపాలని అనుకొన్నాడు. వాడితో దాగిలి ముచ్చ అనే ఆట ఆడి, కావాలని ఓడిపోయి వారిని మెడపై ఎక్కించుకొని దూరంగాపారిపోయి నేలకేసి కొట్టి చంపేశావు. ఉయ్యాలపాపాయిగా వున్నప్పుడే శకటాసురుని ఒక్కతన్నుతన్ని బండివిరిచి (బండిని ముక్కలు ముక్కలుచేసి) సంహరించావు. నేడు శ్రీవేంకగిరి నుండి మాడుపూరు ఒగివచ్చి (క్రమముగా మాడుపూరు వచ్చి) ఇటుల నెగనెగసి గతుల (ఎగిరెగిరిపడే విధంగా) ఆడేవా (ఆడుచున్నావా తండ్రీ!) ధన్యులము.

సంపుటి: 3 కీర్తన : సీతారమణవో శ్రీరామచంద్ర
సంఖ్య : 157 పుట : 105 రాగం: శంకరాభరణము

### శంకరాభరణము

40. సీతారమణ వో శ్రీరామచంద్ర దా
దాత లక్ష్మణుఁడదే తగు రామచంద్ర ॥ పల్లవి॥

చెలువపుసింగారాల శ్రీరామచంద్ర నీ-
సెలవుల నవ్వు గారీ శ్రీరామచంద్ర
చెలఁగీ చెక్కులఁ గళ శ్రీరామచంద్ర
మొలచె మోహనము నీ మోమున రామచంద్ర ॥సీతా॥

చిక్కనిమురిపెముల శ్రీరామచంద్ర
చిక్కులేదు పెద్దకొప్పు శ్రీరామచంద్ర
చిక్కె నీచే మదనుఁడు శ్రీరామచంద్ర
చొక్కపునున్నని మేనిసొంపు రామచంద్ర ॥సీతా॥

చేవదేరినసిగ్గుల శ్రీరామచంద్ర
శ్రీవేంకటాద్రిమీఁది శ్రీరామచంద్ర
యీవల దాసరిపల్లెనిరవుకొని మీ-
సేవకుల మమ్మునేలే శ్రీరామచంద్ర ॥సీతా॥157

**అవతారిక:**

దాసరిపల్లె అనుగ్రామములో వెలసిన శ్రీరామచంద్రునిపై చక్కటి భజన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. దాదాత అంటే గట్టివాడు లేక అఖండుడు అని అర్థం. "ఓ సీతాపతీ! రామచంద్రా! అదే నీకు తగిన తమ్ముడు అఖండుడూ అయిన లక్ష్మణుడు", అంటున్నారు. రాముడు





చేవదీరిన సిగ్గులొలకబోస్తున్నాడట. మీసేవకులమైన మమ్ము పరిపాలించుచున్నామయ్యా! అని కీర్తిస్తున్నారు. భజన అవటంచేత క్లిష్ట పదములు తక్కువే వున్నాయి. ఇందులో చాలామాటలు మనం నిత్యజీవితంలో వుపయోగిస్తాము. కాని సరయైన అర్థం తెలిసీ తెలియనట్లుంటుంది.

**భావ వివరణ:**

సీతారమణుడవు (సీతాపతివి) యైన ఓ శ్రీరామచంద్రా! అదె (అదిగో) నీకు తగినట్టి తమ్ముడు, దాదాత (గట్టివాడు - అఖండుడూ) అయిన లక్ష్మణుడు నీకుడిప్రక్కనే వున్నాడు.

ప్రభూ! నీవు చెలువపు సింగారాల (అందముగా అలంకరింపబడిన) శ్రీరామచంద్రుడవు. సెలవులనవ్వు గారే (లేచిరునవ్వులు వెదజల్లు) శ్రీరామచంద్రమూర్తివి. నీ చెక్కులు (చెక్కిళ్ళు) కళలు చెలగీ (కళలను పెంపొందింపజేస్తున్నాయి) స్వామీ! ఓ శ్రీరామచంద్రా నీమోమున (వదనమున) మోహనము మొలచెను (సౌందర్యము మొలకలెత్తినది.)

ఓ శ్రీరామచంద్రా! నీలో చక్కని మురిపెములు (ప్రోవైన గర్వము... గంభీరమైన రాజసము) తొంగిచూచుచున్నది. ఏమాత్రమూ చిక్కులులేని పెద్దకొప్పును ధరించియున్నావు. మదనుడు (మన్మథుడు) కూడా చిక్కె (నీముందు బలహీనపడిపోతున్నాడు). ఓ శ్రీరామచంద్రా! నీమేని సొంపు (శరీర సౌందర్యం) చొక్కపునున్నది (అత్యంత శోభాయమానంగా వున్నది).

చేవదేరిన (వికసించిన) సిగ్గులు వెదజల్లే ఓ శ్రీరామచంద్రా! నీవు శ్రీవేంకటాద్రిపై వెలసిన దేవదేవుడవు. యీవల (ఇటీవల) దాసరిపల్లె అను ఈ గ్రామమున ఇరవుకొని (వెలసి) నీసేవకులమైన మమ్మున్ యేలేవు (పరిపాలించుచున్నావు). మేము ధన్యులము తండ్రీ!

సంపుటి: 3 కీర్తన : గెలిచితి భవములు గెలిచితి లోకము
సంఖ్య : 3 పుట : 3 రాగం: సాళంగనాట

## సాళంగనాట

41. గెలిచితి భవములు గెలిచితి లోకము
యెలమి నీదాసుల కెదురింక నేది ॥ పల్లవి॥

జయ జయ నరసింహా జయ పుండరీకాక్ష
జయ జయ మురహర జయ ముకుంద
భయహరణము మాకుఁ బాపనాశనము
క్రియతోడి నీసంకీర్తన గలిగె ॥గెలి॥

నమో నమో దేవ నమో నాగపర్యంక
నమో వేదమూర్తి నారాయణా
తిమిరి మమ్ముఁ గావఁగ దిక్కయి మాకు నిలువ
జమళిభుజముల శంకుఁజక్రములు గలిగె ॥గెలి॥

రక్ష రక్ష పరమాత్మ రక్ష శ్రీవేంకటపతి
రక్ష రక్ష కమలారమణ పతి
అక్షయసుఖ మియ్యఁగల న(వ?) టు దాపుదండగా
పక్షి వాహనుఁడ నీభక్తి మాకుఁ గలిగె ॥గెలి॥ 3

**అవతారిక:**

మధురాతిమధురమైన భజన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. సాధారణంగా భజనలు స్తోత్రాలు కాబట్టి భావ వివరణకు అంత ప్రాధాన్యత వుండదు. నరసింహునిపైన చెప్పిన దవుటచేత ఆ నృసింహుడే పరమాత్ముడైన శ్రీవేంకటేశ్వరుడు అంటున్నారు. గెలచితి భవములు అంటే ప్రాపంచిక యావను జయించగలిగామని అర్థం. దాపుదండగా





అక్షయసుఖములనియ్యవయ్యా! అంటున్నారు. ఇదేమాటను నేటి కాలంలో మాకు అండదండవై అంతులేని సుఖమునియ్యవయ్యా! అంటున్నాము మనందరం. అంతే తేడా.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీకృపవల్ల నేను, గెలిచితి భవములు (ప్రాపంచిక యావను జయించగలిగాను). అందుచే జన్మల చక్రబంధం తొలగింది. లోకమునే గెలిచాను. నీదాసులైనవారికి ఈ లోకంలో యెదురేది? నరసింహదేవరా! నీకు జయము జయము. ఓ పుండరీకాక్షా (పద్మనయనా!) నీకు జయము. ముర అను దైత్యుని నిర్జించిన మురాంతకా! నీకు జయమగుగాక! ముకుందమును (కమలమును) చేబూనిన ముకుందా! నీకు జయమగుగాక! మా భయమును హరింపజేసి మాకు పాపమును తుదముట్టించుము స్వామీ! క్రియతో (గొప్ప నిశ్చయముతో) మాకు నీ సంకీర్తనాభాగ్యం కలిగినది.)

ఓ దేవా! నమోనమో (నీకు అనేక వందనములు). ఓ నాగపర్యంకా! (ఆదిశేషుడను నాగుని పరుపువలె కలిగిన స్వామీ!) నీకు వందనము. వేదములే మూర్తీభవించిన ఆదినారాయణుడా! నీకు నమస్కారము. (తిమిరి అంటే నిజానికి తిమ్మిరి అని అర్థం. తిమురు అంటే త్వరగా అని అర్థం), మాకు దిక్కువలె త్వరగా మమ్ము రక్షించుటకు నీ జమళిభుజముల యందు (రెండు చేతులయందు) శంఖచక్రములను ధరించియున్నావు.

ఓ పరమాత్మా! రక్షించు. నీవే మాకు రక్ష. ఓ శ్రీవేంకటేశ్వరా! మమ్ము రక్షించు. కమలారమణ (ణి) పతి (లక్ష్మీపతీ!) రక్షరక్ష (రక్షకుడవై మమ్ము ఆదుకో) తండ్రీ! మాకు దాపుదండగ (అండదండగా) అక్షయసుఖము (అంతులేని సుఖము) నందించుటకు నీభక్తి మాకు లభించినది. ఓ పక్షివాహనుడ (గరుత్మంతుని వాహనముగా గల దేవా! నీవే మాకురక్ష.

సంపుటి: 4 కీర్తన : నందకధర నందగోపనందన

సంఖ్య : 66 పుట : 407 రాగం: భూపాళం

## భూపాళం

42. నందకధర నందగోపనందన
కందర్పజనక కరుణాత్మన్ ॥ పల్లవి॥

ముకుంద కేశవ మురహర
సకలాధిప పరమేశ్వర దేవేశ
శుకవరద సవితృ సుధాంశులోచన
ప్రకటవిభవ నమో పరమాత్మన్ ॥నంద॥

ధ్రువ పాంచాలీ స్తుతివత్సల మా -
ధవ మధుసూదన ధరణిధరా
భువనత్రయపరిపోషణతత్పర
నవనీతప్రియ నాదాత్మన్ ॥నంద॥

శ్రీమన్ వేంకటశిఖరనివాస మ -
హామహిమన్ నిఖిలాండపతే
కామితఫలభోగప్రద తే నమో
స్వామిన్ భూమన్ సర్వాత్మన్ ॥నంద॥ 66

**అవతారిక:**

శ్రీకృష్ణునిపై చక్కటి భజనను గానం చేస్తున్నారు అన్నమాచార్యులవారు. ఇది స్తోత్రం అవటంవలన దాదాపు కీర్తన అంతా సరళంగానేవుంది. సవితృసుధాంశు లోచనుడు అంటే సూర్యుడు చంద్రుడు తన రెండు నేత్రములుగాగల విశ్వరూపుడని అర్థం. నాదాత్మన్ అంటే నాదమే ఆత్మగాగల నాదస్వరూపుడైన నారాయణుడని అర్థం. నిఖిలాండపతి అంటే





పెద్ద అండము (గ్రుడ్డు) వలెనున్న విశ్వమునకంతటికీ నాధుడని అర్థం. సంస్కృతం రానివారికి కూడా తేలికగా అర్థమయ్యే కీర్తన ఇది.

**భావ వివరణ:**

నందకధర! (నందకము అను ఖడ్గమును ధరించిన శ్రీహరీ!) నందగోపుని యొక్క నందనా! (కుమారా!) కందర్ప జనక (మన్మథుని తండ్రివైన స్వామీ!) కరుణాత్మన్ (కరుణాంతంగా!) నీకు వందనములు.

ముకుంద! (పద్మమును చేబూనిన దేవా!) కేశవ! (కేశి అను రాక్షసుని మట్టుబెట్టినవాడా!) మురహర! (ముర అను రాక్షసుని హరించినవాడా!) సకలాధిప! (సకలమునకు అధిపతీ!) పరమేశ్వరా! (సర్వశ్రేష్ఠుడైన ప్రభూ!) దేవేశ! (దేవతలందరికీ అధినాయకా!) శుకవరద (శుకమహర్షికి భాగవత బోధన అను వరమును ప్రసాదించినవాడా!) సవితృసుధాంశులోచనా! (సూర్యుడు, చంద్రుడు తన రెండు కన్నులుగాగలవాడా!) ప్రకటవిభవ! (సృష్టి స్థితి లయములచేత ప్రకటింపబడుచున్న వైభవము కల దేవదేవా!) ఓ పరమాత్మా వందనములు.

ధ్రువునిచేత ద్రౌపది చేత ప్రార్థించబడి కరుణించిన దేవా! మాధవా! (లక్ష్మీపతీ!) మధుసూదన (మధు అను రాక్షసుని చంపినవాడా!) ధరణీధరా! (భూదేవిని స్వీకరించినవాడా!). త్రిభువనములను బాగుగా పోషించుటయందు నైపుణ్యముగలదేవా!) నవనీతం (అప్పుడే తీసిన వెన్న) అంటే ప్రీతిగలవాడా! నాదాత్మన్ (ఓంకారమను నాదమేరూపమైనవాడా!) నీకు నమస్కారములు.

శ్రీవేంకటమను శిఖరమున నెలకొనిన శ్రీవేంకటేశ్వరా! మహామహిమాన్వితా! నిఖిలాండపతీ! (గ్రుడ్డు ఆకారంలోవున్న సమస్త విశ్వమునకు అధిపతీ!) కామితఫలభోగప్రదా! (కోరుకొన్న కోర్కెలను అనుభవించు అనుగ్రహమును మాకు కలిగించునట్టివాడా!) స్వామిన్ (అధిపతీ!) భూమన్ సర్వాత్మన్ (అందరిలో ఆత్మరూపంలోవున్న ఈశ్వరా!) తే నమో (నీకు నమస్కరించుచున్నాను.)

సంపుటి: 4 కీర్తన : కందర్పజనక గరుడగమన
సంఖ్య : 5 పుట : 363 రాగం: బౌళి

**బౌళి**

43. కందర్పజనక గరుడగమన
నందగోపాత్మజ నమో నమో ॥ పల్లవి॥

వారిధిశయన వామన శ్రీధర
నారసింహ కృష్ణ నమో నమో
నీరజనాభ నిగమగోచర
నారాయణ హరి నమో నమో ॥కంద॥

పరమపురుషా భవవిమోచన
వరద వసుధావధూవర
కరుణాకాంతా కాళిందీరమణ
నరసఖ శౌరీ నమో నమో ॥కంద॥

దానవదమన దామోదర శశి
భానునయన బలభద్రానుజ
దీనరక్షక శ్రీతిరువేంకటేశ
నానాగుణమయ నమో నమో ॥కంద॥ 5

**అవతారిక:**

తన్మయులను చేయగల భజనను వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఇది కూడా శ్రీకృష్ణపరమాత్మనుద్దేశించి చెప్పినదే కాబోలు. నిగమ గోచరుడు అంటే వేదముల ద్వారా గోచరమగు వాడు అని అర్థం. నానాగుణమయుడంటే అన్నిగుణములు, (మంచివియైనా చెడ్డవి అయినా యెవ్వనిచే జనిస్తున్నాయో ఆ దేవదేవుడని భావించవచ్చును. శశి, భాను నయనుడంటే చంద్రుడు...సూర్యుడు తన రెండు కన్నులుగా గల





విశ్వరూపుడని అర్థం. ఇట్లాంటి మధురమైన భజనలను మనకందించిన అన్నమయ్య ఋణం తీరేదేనా?

**భావ వివరణ:**

కందర్పజనకా! (మన్మథుని తండ్రీ!) గరుడగమనా! (గరుత్మంతునిపై వెడలువాడా!) నందగోపాత్మజా! (నందగోపుని పుత్రుడా!) నమో నమో (నీకు వందనములు).

వారిధిశయన (పాలజలధిపై పవళించువాడా!) వామనా! (వామనరూపా!) శ్రీధర (లక్ష్మీపతీ!) నారసింహా! శ్రీకృష్ణా! వందనములు. వందనములు. నీరజనాభా! (పద్మము నాభియందుగల శ్రీహరీ!) నిగమగోచర! (వేదముల ద్వారా ప్రకటితమగు దేవదేవా!) ఓ శ్రీమన్నారాయణుడా! శ్రీహరీ! నమస్కారములు అనేక నమస్కారములు.

పరమపురుషా! (పురుషోత్తముడా!) భవవిమోచన (జన్మచే కలిగిన బంధములను తొలగించువాడా!) వరద! (అనుగ్రహించువాడా!) వసుధావధూవర! (ఆదివరాహమై హిరణ్యాక్షుని చంపి, వసుధ అయిన భూకాంతను తన వధువుగా స్వీకరించిన శ్రీహరీ!) కరుణాకాంతా! (కరుణ నిండినవాడా!) కాళిందియను కన్యను తన ధర్మపత్నిగా స్వీకరించిన కృష్ణభగవానుడా! నరసఖ! (అర్జునుని చెలికాడా!) శౌరీ! (శౌర్యవంతుడా!) నీకు వందనములు.

దానవదమనా! (రాక్షసులను తుదముట్టించిన వాడా!) దామోదరా! (తల్లి యశోదచేత రోటికి పొట్టవద్ద త్రాటితో కట్టబడిన శ్రీకృష్ణా!) చంద్రుడు, సూర్యుడూ రెండు నేత్రములుగా గలవాడా! బలరాముని తమ్ముడా! దీనులను రక్షించు శ్రీవేంకటేశ్వరా! సమస్త గుణములకు నిలయమైన జగన్నాథా! నీకు వందనములు. నమోవాకములు.

సంపుటి: 2 కీర్తన: పరమపురుష నిరుపమాన శరణు శరణురే
సంఖ్య : 367 పుట : 247 రాగం: బౌళి

**బౌళి**

44. పరమపురుష నిరుపమాన శరణు శరణు
రే యేయేయేయే ఇందిరాజమందిరా ॥ పల్లవి॥
కమలనాభ కమలనయన
కమలచరణు (ణ) రే
అమితసురమునినాథ
యూథప నాయకా వరదాయకా ॥పర॥

చతురమూరితి
చతురబాహుశంఖచక్రధరా
అతిశయ శ్రీవేంకటాధిప
అంజనాకృతిరంజనా ॥పర॥367

**అవతారిక:**

గీర్వాణిలో మధురాతి మధురమైన శరణాగతిని వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. చాలా చిన్న కీర్తన అయినా కలకాలం నాలికపై నిలిచిపోగల ఈ కీర్తన శ్రీమన్నారాయణునిపై చెప్పారు అన్నమయ్య. పల్లవిలోని 'శరణు శరణు రే యే యే యే యే" అనే పదమును చూడండి. రే లోని 'ఏ' కారమునకు అనుబంధ స్వరప్రతీకములుగా వుంచినారేమో. ఈకీర్తన ప్రత్యేకత యేమంటే పల్లవి అంతా ఒకటే పాదము చరణములన్నియు రెండేసి పాదములుగా కీర్తన నడుస్తున్నది. అన్నమయ్య పాండిత్యం "అమితసు రమునినాథయాథప నాయక" అనే పదములో తేటతెల్లమవుతున్నది. పోనీ... భావవివరణ చదండి.





**భావ వివరణ:**

నిరుపమాన (సాటిలేని) పరమపురుషా (పరమాత్ముడా!) శరణువేడుచున్నాను. ఇందిరా (శ్రీమహాలక్ష్మికి) నిజమందిరా (నిజమైన స్థానమైన దేవదేవా!) శరణురే ! (శరణువేడుచున్నాను ప్రభూ!)

ఓ కమలనాభా! నీవు కమలనయనుడవు. నీవు కమలములవంటి పాదములు కలవాడవు. ఓ అమిత సురమునినాథయూథప నాయకా! (అసంఖ్యాకులైన దేవ, మునీశ్వరుల సమూహములకు పతివైన నాయకా!) వరములననుగ్రహించు ఓ దేవా! శరణు.

చతురమూరితి (సాటిలేని చాతుర్యము మూర్తీభవించిన దేవా! ఓ చతురబాహూ! (చతుర్భుజా!) శంఖచక్రములను రెండు చేతులలో ధరించినవాడా! అతిశయించిన (ఎన్నికైన) శ్రీవేంకటేశ్వరా! అంజనాకృతిరంజనా! (అంజనాద్రి నీ శిరస్సు ఆకారమున తన భక్తులను రంజింప చేయుచుండగా ఆ శిఖరాన నెలకొనిన దేవదేవా! నిన్ను శరణు జొచ్చుచున్నాను.

**శేషతల్పశాయి బొమ్మ ఫైనల్ పేజీల్లో వస్తుంది**

సంపుటి: 2 కీర్తన : శరణు శరణు విభీషణ వరదా
సంఖ్య : 220 పుట : 147 రాగం: సాళంగనాట

## సాళంగనాట

45. శరణు శరణు విభీషణవరదా
శరధిబంధన రామ సర్వగుణస్తోమ ॥ పల్లవి॥

మారీచసుబాహుమదమర్దన తాటకాహర
క్రూరేంద్రజిత్తులగుండుగండా
దారుణకుంభకర్ణ దనుజ శిరచ్ఛేదక
వీరప్రతాపరామ విజయాభిరామ ॥శర॥

వాలినిగ్రహ సుగ్రీవరాజ్యస్థాపక
లాలితవానరబల లంకాపహార
పాలితసవనాహల్యాపాపవిమోచక
పౌలస్త్యహరణ రామ బహుదివ్యనామ ॥శర॥

శంకరచాపభంజక జానకీమనోహర
పంకజాక్ష సాకేతపట్టణాధీశ
అంకితబిరుద శ్రీవేంకటాద్రినివాస
సోంకారరూప రామ వురుసత్యకామ ॥శర॥ 220

**అవతారిక:**

శ్రీరామచంద్రునికి శరణాగతిని వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. శరధిబంధనా! అంటే సముద్రమును బంధించి దానిపై వారధిని గట్టిన వాడని అర్థం. సాకేతపట్టణాధీశ అంకిత బిరుద అనేచోట, సాకేతపట్టణాధీశ బిరుదాంకిత అని అన్వయించుకోవాలి అని నా భావన. పౌలస్త్యహరణ అంటే రావణాంతక అని అర్థం. ఉరుసత్యకామ అంటే శ్రేష్ఠమైన సత్యవాక్యపరిపాలకుడని చెప్పవచ్చును. ఓంకార రూపుడంటే





ప్రణవ పరబ్రహ్మ స్వరూపుడని భావిస్తున్నాను. యథాతథంగా ఏ నిఘంటువులోనూ అర్థం తెలియని అనేక ప్రయోగాలున్నాయి ఈ కీర్తనలో.

**భావ వివరణ:**

విభీషణుని అనుగ్రహించిన శ్రీరామచంద్రా! శరధి బంధన (సాగరమును బంధించి సేతువును నిర్మించిన రామా!) సర్వగుణ స్తోమా! (సర్వసుగుణముల నిలయా!) శరణు. నిన్ను శరణు వేడెదను తండ్రీ!

మారీచ సుబాహులమదమునణచిన శ్రీరామా! నీవు తాటకహరుడవు (తాటకను సంహరించిన వాడవు). క్రూరుడైన ఇంద్రజిత్తు పాలిటి గుండు గండా! (గుదిబండవంటి వాడా!) భయంకరుడైన కుంభకర్ణుడను రాక్షసుని శిరస్సును ఖండించినవాడా! నీవు విజయాభిరామువడవు (విజయకారకుడవైన మనోజ్ఞమూర్తివి).

ఓ శ్రీరామచంద్రా! నీవు వాలినిగ్రహుడవు (వాలిని అణచినవాడవు). సుగ్రీవుని కిష్కిందారాజ్యమున తిరిగి స్థాపించిన వాడవు. వానరబలగములను లాలించినవాడవు (సంరక్షించినవాడవు) లంకాపహారుడవు (లంకను విధ్వంసము చేసినవాడవు). ఓ పాలితసవనా! (యాగసంరక్షకా!) అహల్యా పాపవిమోచకా! (అహల్యపాపమునుండి విముక్తి చేసినవాడా!) నీవు పౌలస్త్య హరణుడవు (పులస్త బ్రహ్మ మనుమడైన రావణాసురిని హరించినవాడవు. ప్రభూ! నీవు ఎన్నో దివ్యనామములుగలవాడవు.

శ్రీరామా! శంకరచాపభంజనా! (శివధనస్సును విరిచినవాడా!) నీవు సాకేతపట్టణమునకు అధినాథుడు అను బిరుదు నీ గుర్తుగా గలవాడవు. నీవే వేంకటాద్రిపై నెలకొన్నవాడవు. ఓంకారస్వరూపుడవు (ప్రణవ పరబ్రహ్మవు). ఉరుసత్యకాముడవు (శ్రేష్ఠమైన సత్యవాక్పరిపాలకుడవు).

సంపుటి: 2 కీర్తన : పరమపురుష హరి పరమ పరాత్పర
సంఖ్య : 453 పుట : 305 రాగం: మలహరి

### మలహరి

46. పరమపురుష హరి పరమ పరాత్మపర
పరరిపుభంజన పరిపూర్ణ నమో ॥ పల్లవి॥

కమలాపతి కమలనాభ కమలాసనవంద్య
కమలహితానంత కోటిఘనసముదయ తేజా
కమలామలపత్రనేత్ర కమలవైరివర్ణగాత్ర
కమలషట్కయోగీశ్వరహృదయం తేహం నమోనమో(?) ॥పర॥

జలనిధిమథన జలనిధిబంధన జలధిమధ్యశయనా
జలధియంతరవిహార మచ్చకచ్ఛపయవతారా(?)
జలనిధిజామాత జలనిధిశోషణ జలనిధిసప్తకగమన
జలనిధికారుణ్య నమో తేహం జలనిధిగంభీర నమో నమో ॥పర॥

నగధర నగరిపునందిత నగచర యూథపనాథా
నగపారిజాతహర సారసపన్నగపతిరాజశయన (?)
నగకులవిజయ శ్రీవేంకటనగనాయక భక్తవిధేయా
నగధీరా హం తే సర్వేశ్వర నారాయణ నమో నమో ॥పర॥453

**అవతారిక:**

పరమపురుషుడైన శ్రీమన్నారాయణునిపై గీర్వాణిలో చక్కటి కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఇది స్తుతి అయినందువల్ల నారాయణునికి ఆ నామం యెందుకు వచ్చిందో వివరిస్తే రసవత్తరంగానే వుంటుంది కాని స్థలాభావంచేత అదిసాధ్యపడదు. జలనిధి సప్తకగమన అంటే ఏడు సముద్రాలనూ దాటిన వాడని అర్థం. ఎవరు? ఎప్పుడు? ఎలా? ఎందుకు? ఎక్కడ? వివరించాలంటే అదొక ఉపాఖ్యానమవుతుంది. ముందు ఆ కథ తెలియాలి కదా! నగచరయూథపనాథా! కమలషట్క యోగీశ్వరహృదయ లాంటివి కూడా తేలికగా అర్థంకావు. నగపారిజాత అంటే కొండాకాదు, నగలూ కావు. మరేమిటి?





**భావ వివరణ:**

ఓపరమపురుషా! శ్రీహరీ! పరాత్పరా! (పరమునకే పరమైనవాడా!) దేవదేవా! భిన్నత్వములేని పరిపూర్ణతగలవాడా! పరరిపుభంజనా! (దుర్మార్గులైన శత్రువులను తుదముట్టించువాడా!) నమోనమో (వందనములు).

కమలాపతీ! (లక్ష్మీపతీ!) కమలనాభా! కమలాసనుడు (పద్మంలో కూర్చుండు బ్రహ్మచేత కొలువబడువాడా! అనంతకోటి కమలహిత (సూర్యుల) ఘన సముదాయమునకండే తేజస్సుతో ఒప్పువాడా! కమలామలదళనేత్రా! (స్వచ్ఛమైన తామర రేకులవంటి కన్నులు గలవాడా!) కమలవైరి వర్ణగాత్ర! (చంద్రునివంటి శరీరవర్ణము గలవాడా!) కమలషట్కయోగీశ్వర హృదయ (యోగీశ్వరుల హృదయాలలో షట్చక్రస్వరూపుడవై (కుండలినీ యోగమునకు సంబంధించిన, మూలాధారము మొదలైన ఆరు చక్రముల రూపుడవైవున్న యోగేశ్వరా!) తేహం (అట్టివారికి నేను) నమోనమో (వందనములు చేతును).

జలనిధి మథనా! (సాగరమును మథనము చేయించిన శ్రీమహావిష్ణుదేవా!) జలనిధి బంధనా! (సాగరముపై వారధి కట్టించినటువంటి శ్రీరామా!) జలధిమధ్యలో శేషతల్పంపై శయనించు నారాయణా! జలధిలో సంచరించు మత్స్య, కూర్మ రూపములలో అవతరించినవాడా! సాగరుని జామాతా (అల్లుడా!) సాగరమును శోషణ! (ఎండింపచేయదలచిన రామచంద్రా!) జలనిధి సప్తకగమనా! (గురువు సాందీపుని పుత్రుని కోసం సప్త సముద్రములను దాటి చివరికి అతనెక్కడున్నాడో తెలిసికొనిన శ్రీకృష్ణా!) సాగర గంభీరా! నేను నీకు నమస్కరించుచున్నాను.

నగధరా (కొండను వ్రేలిపై యెత్తిన శ్రీకృష్ణా!) నగరిపు నందిత! (కొండల శత్రువైన ఇంద్రుని ఆనందపరచినవాడా!) నగచర (వానర భల్లూకముల) యూథప (సమూహముల అధిపతులగు అంగదుడు, నీలుడు, జాంబవంతుడు వంటి వారికి, నాథా! (నాయకా!), నగపారిజాత హర! (స్వర్గముననున్న పారిజాతమును హరించినవాడా!) సారసపన్నగపతిరాజశయనా! (సముద్రమున సర్వరాజాధిపతియైన ఆదిశేషునిపై శయనించువాడా!) ఏడు కొండలను గెలిచినవాడా! శ్రీవేంకటగిరీంద్రా! భక్తులకు విధేయుడా! సర్వేశ్వరా! నారాయణా! కొండవలె స్థిరధీరుడా! నీకు నా వందనములు.

సంపుటి: 3    కీర్తన : విశ్వమెల్ల నీ విరాడ్రూపము

సంఖ్య : 560    పుట : 356    రాగం: మలహరి

## మలహరి

47. విశ్వమెల్ల నీ విరాడ్రూపము
శాశ్వతహరి నీశరణులము ॥ పల్లవి॥

కన్నులఁ సూర్యుఁడు కమలాప్తుఁడు నీ -
పన్నినమోమున బ్రాహ్మణులు
వున్నతివైశ్యులు వూరువులందును
యెన్నఁగ శూద్రులు యిదె పాదముల ॥విశ్వ॥

యింద్రాదిదేవత లీశానబ్రహ్మ ము-
నీంద్రు లంగముల నెసఁగిరదే
సాంద్రలోకములు జఠరంబున నవె
రుంద్రతేజ మదె రోమముల ॥విశ్వ॥

కాలముఁ గర్మముఁ గైవల్యంబును
ఆలోను వెలియు నది నీవు
శ్రీలలనాధిప శ్రీవేంకటేశ్వర
కోలుముందు నినుఁ గొలిచితిమయ్య ॥విశ్వ॥530

**అవతారిక:**

విశ్వరూపుడైన విరాట్పురుషుని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. దీనినాస్వాదించి ఆ పరమపురుషుని దర్శించండి. ఏ జన్మసుకృతమో దీనిని వివరించే మహద్భాగ్యం నాకిచ్చాడు ఆ వేంకటరమణుడు. ఇంతకీ 'విరాట్టు' అంటే 'ఆది దేవుడ'ని అర్థం. నిజానికి అనంతమైనా, గొప్ప నిబద్ధత, నియమిత కాలగమనము కలిగిన ఈ విశ్వం ద్వారానే ఆయన ప్రకటించబడుతున్నాడు. ప్రాణరూపంలో జీవకోటిలో ద్యోతక





మవుతున్నాడు. జీవాధారమైన పంచభూతములద్వారా (గాలి, నీరు, సూర్యకాంతి, భూమి, ఆకాశము) భుక్తినిస్తున్నాడు. ప్రాణికోటి పుట్టుకకే కాదు, మనుగడకు, చివరికి చావుకూ, చావు తర్వాత శరీర ఖననానికీ కారణభూతుడౌతున్నాడు. అందుకే అన్నమయ్య "ఈ భూతము జగతినిందరిబట్టె'నన్నారు, ఇదివరలో

**భావ వివరణ:**

ఓ దేవదేవా! ఈ విశ్వమంతయూ నీ విరాడ్రూపము. (ఆది నారాయణుడవైన నీ విశ్వరూపమే). శాశ్వతుడవైన ఓ శ్రీహరీ! జీవులమైన మేమందరమూ నీ శరణులము (శరణాగతులము) ప్రభూ!

తండ్రీ! నీరెండు కన్నులు పద్మముల మిత్రుడైన సూర్యుడు మరియు రజనీకాంతుడైన చంద్రుడు. నీ విశ్వరూపమున పన్నినమోమున (విరచితమైన నీవదనమున) బ్రాహ్మణులు ఆవరించియున్నారు. అట్లే వైశ్యులు ఊరువులు (తొడలయందును) ఎన్నదగిన శూద్రులు చరణముల వద్దను వున్నతముగా స్థితులైయున్నారు.

ఓ పురాణపురుషా! నీ అంగముల (వివిధ అవయవములలో) ఈశాన (శంకరుడు) బ్రహ్మ (బ్రహ్మదేవుడు), మునీంద్రులు (సప్తఋషులు) ఇంద్రాది దేవతలు, అదే, యెసగిరి (అతిశయించి యున్నారు). సాంద్రలోకములు (దట్టముగా వ్యాపించిన లోకములన్నియు) నీ జఠరమున (నీ కడుపులోనే) కానుపించుచున్నవి. నీ రోమములు (శరీరముననున్న వెంట్రుకలలో) అదే రుంద్ర తేజము (విరివియైన తేజస్సుతో) సమస్త జీవకోటి ద్యోతకమగుచున్నది.

ఓ సర్వేశ్వరా! "కాలము, కర్మము, కైవల్యము" ఆలోను (అనబడు వాటియందు) వెలయునది (విలసిల్లునది) నీవే. కాలము ఇంత నియమబద్ధంగా వుండటానికి, కర్మము తప్పింప నశక్యమైయుండుటకు, కైవల్యము కేవలము ముక్తులకు (సర్వసంగపరిత్యాగులకు) మాత్రమే లభించుటకు నీవే కారణము. ఓ శ్రీకాంతా! శ్రీవేంకటేశ్వరా! కోలుముందు (మున్ముందే) నిన్ను కొలిచితిమయ్యా! మమ్ము రక్షింపుము.

సంపుటి: 3    కీర్తన : ఆనంద నిలయ ప్రహ్లాదవరదా
సంఖ్య : 502    పుట : 337    రాగం: బౌళి

**బౌళి**

48. ఆనందనిలయ ప్రహ్లాదవరదా
భానుశశినేత్ర జయప్రహ్లాదవరదా    ॥ పల్లవి॥

పరమపురుష నిత్య ప్రహ్లాదవరదా
హరియచ్యుతానంత ప్రహ్లాదవరదా
పరిపూర్ణ గోవింద ప్రహ్లాదవరదా
భరిత కళ్యాణ గుణ ప్రహ్లాదవరదా    ॥ఆనం॥

భవరోగసంహరణ ప్రహ్లాదవరదా
అవిరళ కేశవ ప్రహ్లాదవరదా
పవమాననుతకీర్తి ప్రహ్లాదవరదా
భవపితామహవంద్య ప్రహ్లాదవరదా.    ॥ఆనం॥

బలయుక్తనరసింహ ప్రహ్లాదవరదా
లలిత శ్రీవేంకటాద్రి ప్రహ్లాదవరదా
ఫలితకరుణారస ప్రహ్లాదవరదా
బలివంశకారణ ప్రహ్లాదవరదా.    ॥ఆనం॥502

**అవతారిక:**

వైకుంఠం శ్రీమన్నారాయణుడుండే దివ్యలోకము. దానిని పొందాలని ఆశించని హరిభక్తుడుండడు. అక్కడేముంటుంది? ఆనందం పరమానందం, బ్రహ్మానందం అని కూడా దానినే అంటారు. అంతా ఆనందమేవుండే దానినే ఆనందనిలయం అంటారు. ప్రహ్లాదవరదుడైన నృసింహుని ఆనందనిలయుడని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. రవిచంద్రలోచనుడీ ప్రహ్లాదవరదుడంటున్నారు. జయము





పలుకుతున్నారు. మధురమైన ఈ భజనలో పవనసుతవరదుడు శ్రీరాముడు, బలివంశకారణుడైన వామనుడూ, కేశవుడూ, తిరుమలవాసుడూ కూడా ఆ ప్రహ్లాదవరదుడే అంటున్నారు అన్నమయ్య. అదే భక్తి తత్పరతకి పరాకాష్ట.

**భావ వివరణ:**

ఆనందనిలయుడవైన ఓ ప్రహ్లాదవరదా! నీకు జయమగుగాక! భానుశశినేత్ర! (సూర్యచంద్రులు కన్నులుగాగల) ఓ నరసింహస్వామీ! నీకు జయము పలికెదను ప్రభూ!

స్వామీ! నీవు పరమపురుషుడవు, శ్రీహరివి. చ్యుతి (నాశనము) లేని అచ్యుతడవు. మొదలు – తుది లేని అనంతుడవు. నీకు పరిపూర్ణత తప్ప కొద్దిగా వుండటం అనేదే లేదు. గోవులవంటి సమస్త జీవులను పాలించే గోవిందుడవు. సమస్త కళ్యాణగుణములతో నిండిన దేవదేవుడవు. నీవే ప్రహ్లాదవరదుడవు. అట్టి నీకు జయమగుగాక!

పురాకృతకర్మల వల్ల సంప్రాప్తమయ్యే భవరోగమును అణచగల శక్తి నీకు మాత్రమే వున్నది. నీవు అవిరళమైనవాడవు (విడివడునట్లు చేయలేనివాడవు). కేశవుడవు (కేశి అను దైత్యుని చంపినవాడు శ్రీకృష్ణుడు). పవమాననుతకీర్తివి (ఆంజనేయుని చేత కీర్తింపబడిన శ్రీరాముడవు). పితామహవంద్యుడవు (బ్రహ్మదేవుని చేత కీర్తించబడువాడవు). భవుడవు (శివుడు కూడా నీవే). అట్టి ప్రహ్లాదవరదా! నీకు జయమగుగాక!

ప్రభూ! నీవు అమిత బలశాలివి. (హిరణ్యకశిపుని అమాంతం ఎత్తుకొని గడప మీదకు మోసికొని వెళ్ళాడా నరసింహుడు). శ్రీవేంకటాద్రినున్న లలిత శృంగారరాయుడైన శ్రీవేంకటేశ్వరుడివీ నీవే. కరుణారసము ప్రతిఫలించే ప్రహ్లాదవరదుడవైన కారుణ్యమూర్తివీ నీవే. బలివంశమును రక్షించి పోషించిన త్రివిక్రముడవు నీవే. అట్టి నీకు జయమగుగాక!

సంపుటి: 3 కీర్తన : సౌమిత్రిసహోదర దశరథరామా
సంఖ్య : 499 పుట : 335 రాగం: పాడి

**పాడి**

49. సౌమిత్రిసహోదర దశరథరామా
చేముంచి గుత్తిలో వెలసినరఘురామా ॥ పల్లవి॥

చెలిమి సుగ్రీవుతోడఁజేసినరామ తొల్లి
శిలనుఁ బడఁతిఁ గావించినరామా
చెలరేఁగిన వానరసేనలరామా
శిలుగుమాయామృగముఁ జించిన రామా ॥సౌమి॥

తరణివంశ తాటకాంతక రామా
నరనాథ కౌసల్యానందన రామా
సిరులఁ బెండ్లాడిన సీతారామా
గరిమతో సేతువుగట్టిన రామా ॥సౌమి॥

రావణాదిదనుజహరణ రామా
కావించి విభీషణునిఁ గాచినరామా
దీవెన లయోధ్యలోఁ జెందినరామా
శ్రీవేంకటాద్రిమీఁది శ్రీరామా ॥సౌమి॥ 499

**అవతారిక:**

గుత్తి పట్టణంలో వెలసిన రఘురాముని మీద రమ్యమైన కీర్తనాలపిస్తున్నారు అన్నమాచార్యులవారు. సౌమిత్రి సహోదరుడవైన దశరథరామా! నీవు గుత్తిలో పూనికతో వెలసినావని కీర్తిస్తున్నారు. తరణివంశము అంటే సూర్యవంశం అని అర్థం. సిలుగు (శిలుగు) మాయామృగము అంటే ఉపద్రవము తెచ్చిన మాయలేడి అని అర్థం. ఇది భజన సాంప్రదాయంలో సాగిన కీర్తనకాబట్టి పరవశించి రామభజన చేసే అదృష్టం మీదే.





**భావ వివరణ:**

సుమిత్రానందునుడైన సౌమిత్రి లక్ష్మణునికి సోదరుడవైన ఓ దశరథరామా! నీవు చేముంచి (గొప్ప పూనికతో) 'గుత్తి' పట్టణమున వెలసిన రఘురాముడవు. నీకు వందనములు.

స్వామీ! నీవు సుగ్రీవునితో స్నేహముచేసిన రాముడవు. పూర్వము విశ్వామిత్రుని యాగ సంరక్షణకై వెడలినప్పుడు శిలవలెనున్న అహల్యను చైతన్యవంతురాలనుచేసిన రాముడవు నీవే. లంకను ధ్వంసం చేయాలనుకొని చెలరేగిన (విజృంభించిన) వానర సేనలను నడిపించిన రాముడవు నీవే. శిలుగు (సిలుగు - అనగా - ఉపద్రవము తెచ్చిన) మాయలేడివలె వచ్చి మారీచుని, జించిన (చంపిన) ఓ శ్రీరామచంద్రా! నీకు నమోవాకములు. ఓ తరణివంశా! (సూర్యవంశ దీపకా!) నీవు తాటకను అంతమొందించిన రాముడవు. నరనాథుడవు (ప్రజలను సంరక్షించు చక్రవర్తివి). కౌసల్యాదేవి కన్నబిడ్డవు, నీవే. సీతను సిరుల బెండ్లాడిన (వైభవోపేతముగా చేపట్టిన) మా సీతారాముడవు నీవే ప్రభూ ! నీవు గరిమతో (నీటిలో మునిగిపోవలసిన రాళ్ళను నీ మహిమతో తేలునట్లుచేసి) సేతువు గట్టిన (సముద్రముపై వారధిని నిర్మించిన) శ్రీరామచంద్రమూర్తివి. అట్టి నీకు వందనములు.

రావణుడు మొదలైన రాక్షసులను హరించిన శ్రీరామా! నీవు కామించి (కావాలని శరణమునొసగి) అదే రావణుని సోదరుడైన విభీషణుని లంకాధిపతిని చేసి రక్షించావు. అందరి దీవెనలను పొంది అయోధ్యానగరమును పరిపాలించావు. నీవు మరెవరివో కాదు స్వామీ! శ్రీవేంకటాద్రిమీద కలియుగంలో స్థిరపడి మా అందరికి శ్రీవేంకటరామయ్యగారివి నీవే. మేము నీ శరణాగతులము. నీకు మా శతకోటి వందనములు.

సంపుటి: 3 కీర్తన : ఇతరుల నడుగము యితఁడే మాదాత
సంఖ్య : 526 పుట : 353 రాగం: లలిత

## లలిత

50. ఇతరుల నడుగము యితఁడే మాదాత
యితనియీవి వొరు లియ్యఁగఁగలరా ॥ పల్లవి॥

దేవదేవుఁ డాదిమపురుషుఁడు హరి
శ్రీవత్సాంకుఁడు చిన్మయుఁడు
యీవల నావల యిలువేలు పతఁడు
భావజగురుఁడు మా పాలిటివాఁడు ॥ఇత॥

జగదేకగురుఁడు శాశ్వతుఁ డచ్యుతుఁ-
డగజకు వరదుఁడు అనంతుఁడు
తగి మము నేలినదైవము యేలిక
నిగమమూర్తి మానిజబంధువుఁడు. ॥ఇత॥

కలిదోషహరుఁడు కైవల్యవిభుఁడు
అలరిన శ్రీవేంకటాధిపుఁడు
చలిమి బలిమి మాజననియు జనకుఁడు
అలమి యితఁడు మాయంతర్యామి. ॥ఇత॥ 526

**అవతారిక:**

పెట్టేవాడినే యాచించాలి కాని, పెట్టని వాడి ముందు ఎన్నడూ చేయి చాచరాదంటారు పెద్దలు. అదేమాటను చక్కని కీర్తన రూపంలో వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఈ శ్రీహరి మా అందరి దాత. ఇతని దాతృత్వం ఇంకొకళ్ళకు వుంటుందా? వుండదు గాక వుండదు. అందుకని మేము ఇతరులెవ్వరిని యేమీ అడుగము అంటున్నారు. “చలిమి బలిమి మా జననియు జనకుడు అలమి యితడు మా అంతర్యామి”





అంటున్నారు. బహుశా అన్నమయ్యకాలంలో నేటి ‘చెలిమి’ చలిమి అని పలికేవారేమో!! ‘అలిమి’ అనే మాటను నేటికాలంలో అలముకొని అంటున్నాం. మొత్తానికి మధురాతి మధురమైన కీర్తన ఇది.

**భావ వివరణ:**

జనులారా! ఇతరులనడుగము (మేము పరులను యాచించము). ఇతడే (ఈ శ్రీవేంకటేశ్వరుడే) మా దాత (మాకు దానము చేయగలిగినవాడు). ఇతని ఈవి (త్యాగము) ఇతరులెవరికైనా వుంటుందా?

ఈ శ్రీహరి, దేవదేవుడు (దేవతలందరూ కొలిచే దేవుడు), ఆదిమపురుషుడు (సృష్టి ఆదిలోనే వున్న పరమపురుషుడు), శ్రీవత్సము అనుపేరుగల పుట్టుమచ్చ తన వీపుపై గుర్తుగా వున్నవాడు, చిన్మయుడు (చిదానంద స్వరూపుడు). ఈవల నావల (ఈ మానవలోకంలోనూ, ఆ దేవలోకంలోనూ అతడు ఇలవేలుపు (ఇంటింటా నిత్యము పూజించబడే దేవుడు). భావజగురుడు (భావమునందు మాత్రమే పుట్టుక. మనుగడ కలిగిన మన్మథునికి ఇతడు తండ్రి అంతెందుకు... ఈయన మా పాలిటివాడు (మావంతుగా మాకు దక్కినవాడు).

ఈ శ్రీహరి, జగదేకగురుడు (పతి). శాశ్వతమైనవాడు. చ్యుతి (నాశనము) లేనివాడు. ఈయన అగజకు (పార్వతీదేవికి) వరదుడు (అనేక సందర్భాలలో అండగా నిలిచి కాపాడినాడు). అనంతుడు (తుది అనునది లేనివాడు). మమ్మల్ని తగి (మా అర్హత కొద్దీ) ఏలిన (అనుగ్రహించే) దైవము, మాస్వామియే, ఈయన. ఈ నిగమమూర్తి (వేద స్వరూపుడు) మా నిజబంధువుడు (ఆత్మబంధువు).

ఈయన కలిపురుషుని వలన నరులలో కలిగే దోషములను నిర్మూలిస్తాడు; కైవల్యవిభుడు (ముక్తి నొసగే శక్తి కలవాడు); శ్రీవేంకటాద్రిపై విరాజిల్లే జగన్నాథుడు మాతల్లి, తండ్రీ, చలిమి (స్నేహితుడు) బలిమి (బలము) ఈ శ్రీవేంకటేశ్వరుడే. ఈ మహానుభావుడే, అలమి (మా అణువణువునా ఆక్రమించిన) అంతర్యామి (అంతరాత్మ).

సంపుటి: 3 కీర్తన : కొలువు విరిసె నిదె గోవిందుఁడు పొద్దువోయ
సంఖ్య : 525 పుట : 353 రాగం: పాడి

**పాడి**

51. కొలువు విరిసె నిదె గోవిందుఁడు పొద్దువోయ
వెలుపట నుక్కళాలు వేగుదాఁకా నుండరో ॥ పల్లవి॥

యీపొద్దుకుఁ బోయిరారో ఇంద్రాదిదేవతలు
శ్రీపతి పవ్వళించెను శేషునిమీఁద
తీపులఁబ్రసాద మీరో దేవమునులకునెల్ల
వైపుగఁ దెల్లవారఁగ వత్తురుగాని ॥కొలు॥

పాళెలపట్టుకుఁ బోరో బ్రహ్మరుద్రాదు లిందరు
పాలసముద్రాన హరి పవ్వళించెను
వేళగాదు లోనికిట్టె విచ్చేసె హరి ద్వార -
పాలకులు వాకిళ్ళఁ బదిలము సుండో ॥కొలు॥

గీత మొయ్యనే పాడరో కిన్నరకింపురుషులు
యీతల శ్రీవేంకటేశుఁ డెక్కెను మేడ
ఘూత నెడ నెడ నూడిగకాండ్లు నిలువరో
రాతిరెప్పుడైనా మిమ్ము రమ్మనునో యితఁడు. ॥కొలు॥ 525

**అవతారిక:**

పైన చెప్పిన ఐదారు కీర్తనలను చూచి ఈ కీర్తనలకి వివరణలు కూడానా... అనుకొనే కొందరు అమాయకుల కోసం ఈ కీర్తన ప్రత్యేకంగా యెన్నుకొన్నాను. "నుక్కళాలు" అనేది ఆనాడు వాడుకలో వున్న రాయలసీమ మాండలీకం. నిఘంటువుల్లో అర్థం దొరకదు. ఈ కీర్తనలో గోవిందుడు నిద్రకుపక్రమించాడు ఈవేళకి, "ఓ ఇంద్రాది దేవతలారా! పోయిరండయ్యా! బ్రహ్మా! రుద్రా! పాళెల పట్టుకబోరో, హరి పాలసముద్రంలో పడుకొంటున్నాడు. ఓ ద్వారపాలకులారా! వాకిలి తలుపులు జాగ్రత్త!" కిన్నెర కింపురుషులు సంగీతమాలపించే దేవతాగణాలు. వాళ్ళని పవ్వళింపు సేవ పాటలు పాడమంటున్నారు.





"రాత్రిపూట ఎప్పుడు ఏ అవసరానికి స్వామిపిలుస్తాడో ఊడిగకాండ్లలారా! ఘూత నెడనెడ నిలువరో!" అంటున్నారు. సరిగా అర్థం కాలేదా? మరి భావవివరణ చదవక తప్పదు.

**భావ వివరణ:**

గోవిందుని కొలువుకి విచ్చేసిన మహామహులారా! చాలా పొద్దుపోయింది. అందరూ వెళ్ళిరాండి. ఇదే కొలువు విరిసె (విడిది అయింది). వెలుపల (బయట) వేగుదాకా (తెల్లవారుదాకా) నుక్కళాలు (పహారా) మొదలుపెట్టి వుండండయ్యా!

ఓ ఇంద్రాది దేవతలారా! ఈ పొద్దుకు (ఈనాటికి) పోయిరాండయ్యా! చూస్తున్నారు కదా! శ్రీహరి ఆదిశేషునిపై పవళించబోతున్నాడు. ఆ చేత్తోనే నారదాది దేవమునులందరికీ తీపుల (మధురమైన ప్రసాదాలు) పంచిపెట్టిండి. అంతా తెల్లవారాక సుప్రభాతసేవకి వత్తురుగానీలే, పదండి.

ఓ బ్రహ్మ రుద్రులారా! పాళెల బట్టుకబోరో! (మీమీ ప్రత్యేక విడిది గృహాలకు వెళ్ళి విశ్రాంతి తీసికోండి). అదిగో క్షీరసాగరమున శ్రీహరి పవళించనున్నాడు. ఇక లోనికి వెళ్లగాదు (ఇక లోపలికి ప్రవేశము లేదు). ఓ శ్రీహరి ద్వారపాలకులారా! వాకిళ్ళబదిలము సుండీ! (వాకిటిలో కాపలా జాగ్రత్త సుమా!)

ఓ కిన్నెర కింపురుషులారా! (వీరు గంధర్వులలో స్పెషలిస్ట్ సింగర్స్... అన్నమాట). మీరు గీతము (పవ్వళింపు సేవలో పాడే జోలపాటలను) ఒయ్యనే పాడరో (శ్రావ్యంగా ఆలపించండయ్యా!). ఇదిగో చూశారా ఈతల (ఇక్కడ) శ్రీవేంకటేశ్వరుడు తన భవనము నెక్కాడు. ఓ ఊడిగకాండ్లూ! (భృత్యులారా!) మిమ్ము రాతిరెప్పుడైనా స్వామి రమ్మనునో (రాండిరా అనిపిలుస్తాడో తెలియదు కదా!) అందుకని, ఘూతల నెడనెడ నిలువరో! (వాకిలి వెలుపల అక్కడక్కడా నిలబడండ్రా! జాగ్రత్త.

(ఇంతకీ ఘూతన్ అంటే ఒక పక్కగా అనే అర్థం. ఎంతో సమన్వయపరచుకొంటేగాని స్ఫురిచదు. మరి అదండీ సంగతి.)

సంపుటి: 3 కీర్తన : రామా దయాపరసీమా అయోధ్యపుర
సంఖ్య : 94 పుట : 63 రాగం: బౌళి

**బౌళి**

52. రామా దయాపరసీమా అయోధ్యపుర-
ధామా మావంటి వారితప్పులు లోఁగొనవే ॥ పల్లవి॥

అపరాధియైనట్టియాతనితమ్మునినే
కృపఁజూపితివి నీవు కింకలు మాని
తపియించి యమ్ము మొన దారకుఁజిక్కినవాని
నెపానఁ గాచి విడిచి నీవాదరించితివి. ॥రామా॥

సేయరానిద్రోహము సేసినపక్షికి నీవు
పాయక అప్పటి నభయమిచ్చితి
చాయసేసుకొని వుండి స్వామిద్రోహిఁ జెప్పనట్టి-
తోయపుటేటెని మంచితోవనే పెట్టితివి(?) ॥రామా॥

నేరము లెంచవు నీవు నీదయే చూపుదుగాని
బీరపు శరణాగతబిరుద (వు?) నీవు
చేరి నేఁడు నిలుచుండి శ్రీవేంకటాద్రిమీఁదఁ
గోరినవరములెల్లా కొల్ల లొసఁగితివి. ॥రామా॥ 94

**అవతారిక:**

ఇటువంటి కీర్తనలకు భావ వివరణనిచ్చినప్పుడు గొప్ప క్విజ్ కాంటెస్ట్ గెలిచినంత సంతోషం కలుగుతుంది. పురాణ వాఙ్మయంపైన, తెలుగు భాషపైన యెంత పట్టు వుంటే అంత తేలిక అవుతుంది మీ పని. అన్నమాచార్యుల వారికి జోహార్లు. శ్రీరామచంద్రమూర్తిపై చెప్పిన ఈ కీర్తనలో స్వామిని దయాపరసీమా! అని సంబోధిస్తున్నారు. దయాపారీణుడని భావము. దయయొక్క అంతము దాకా పోయినవాడట. "తోయపుటేటె" అంటే బుర్ర బద్దలు కొట్టుకున్నా అర్థం కాలేదు. చివరికి





"దారి తప్పిన చిన్నవాడు" అని కూపీ లాగాను. అమ్మయ్య! ఇంతకీ వాడెవడండీ బాబూ! ఆలోచించి పారేయండి.

**భావ వివరణ:**

ఓ శ్రీరామచంద్రా! దయాపరసీమా! (దయాపారీణా!) అయోధ్యాపురము ధామముగా (నివాసముగా) కలవాడా! మావంటివారి తప్పులు (అపరాధములను) లోగొనవే (నీమనస్సులో పెట్టుకొని మన్నించవయ్యా!) మేమెంత? ఇదివరకు యెంతమంది యెన్ని తప్పులు చేయలేదూ, నీవుయెంత మందిని మన్నించలేదూ? ఆ పట్టిక చెబుతాను వినవయ్యా!

ఆనాడు నీవు కింకలుమాని (అనుమానాలు వదిలిపెట్టి) అపరాధియైనవానియట్టి (నీకు ద్రోహం చేసినవానియొక్క) తమ్ముడిపైననే (రావణుని తమ్ముడైన విభీషణునిపైననే) కృప జూపితివి కదా! ప్రభూ! నీ శరపరంపరకు చిక్కి తపించి తలవంచుకొన్న వానిని, అమ్ముమొనదారకు జిక్కి (నీబాణముల మొనల వర్షానికి చిక్కిన వానిని, నెపములెంచక కాచి (రక్షించి) విడిచిపెట్టి... అలిసిపోయావు నేడు పోయి మళ్ళీ రేపురావయ్యా! అన్నావు. లంకేశ్వరుడైన రావణునీ పాయవు. పాయక (శరణువేడినాడని, త్యజించవు).

సేయరాని ద్రోహము సీతాదేవికి చేసిన పక్షిని క్షమించి, అప్పటినీ అభయమిచ్చితివి (మరల వానికి అభయమునొసంగితివి. (వాడే ఇంద్రుడి పొగరు బట్టిన కొడుకు... కాకాసురుడు అని అంటారు వాడిని). చెప్పనట్టి (చెప్పలేని) స్వామిద్రోహికి, చాయసేసుకొనివుండి (రక్షణ గల్పించి) తోయపుటేటె అనుకొని (దారితప్పిన చిన్నవాడులే అని మన్నించి) మంచితోవనేబెట్టితివి (సన్మార్గుని చేసి గొప్పవానిని చేశావు). సుగ్రీవుడు అని తెలిసింది కదా!

చాలామంది చక్రవర్తులు తమ శత్రువులకు శరణునొసగు సమయమున వారి పూర్వపు నేరములనెంచి దెప్పిపొడుస్తారు. కాని నీవు అట్లా చేయవు. వారిపై కూడా నీ దయనే చూపిస్తావు. అందుకే నీకు పేరుగన్న "శరణాగతత్రాత" అనే గొప్ప బిరుదువున్నది. ఇదిగో నేడు ఈ శ్రీవేంకటాద్రి మీద చేరి ఇట్లా నిలుచుండిపోయి కొల్లలు కొల్లలుగా మేము కోరిన వరములనిచ్చే శ్రీవేంకటేశ్వరుడవైనావు. (ఇది ఇట్లా నాచేత చెప్పించావు. ధన్యోస్మి.)

సంపుటి: 2 కీర్తన : కిన్నజానోఽహం కేశవాత్పర మహో
సంఖ్య : 83 పుట : 56 రాగం: ముఖారి

**ముఖారి**

53. కిన్నజానేఽ హం కేశవాత్పర మహో
సన్నుతాకర మమాచరణాయ తస్మై ॥ పల్లవి॥

వేదాంతవేద్యాయ విశ్వరూపాయ నమో
ఆదిమధ్యాంతరహితాధికాయ
భేదాయ పునరప్యభేదాయ నమో నమో
నాదప్రియాయ మమ నాథాయ తస్మై ॥కిన్న॥

పరమపురుషాయ భవబంధహరణాయ నమో
నిరుపమానందాయ నిత్యాయ
దురితదూరాయ కలిదోషవిధ్వస్తాయ
హరియచ్యుతాయ మమ ఆత్మాయ తస్మై ॥కిన్న॥

కాలాత్మకాయ విజకరుణాకరాయ నమో
శ్రీలలామాకుచాశ్రితగుణాయ
హేలాంక శ్రీవేంకటేశాయ నమోనమో
పాలితాఖిల మమాభరణాయ తస్మై ॥కిన్న॥ 83

**అవతారిక:**

అన్నమాచార్యులవారి కీర్తనలలో ఒక్కొక్కప్పుడు పల్లవి బహు సరళంగా వుంటుంది. ఒక్కొక్కప్పుడు బహు జటిలంగా వుంటుంది. ఇది ఆ రెండవ కోవకు చెందిన సంస్కృత కీర్తన. పంచమీ విభక్తిలోనే నడుస్తుంది కీర్తన





అంతా. "అతని కొఱకు నమస్కరించుచున్నాను, ("తస్మై") ప్రత్యయంతో నడుస్తుంది. పెద్దల సహకారంతో ఈ కీర్తన వివరించగలుగుతున్నాను. నిజంగా, శ్రీమన్నారాయణునిపై చక్కని కీర్తన ఇది.

**భావ వివరణ:**

మహోన్నతుడునూ, సన్నుతించినవారిని సంరక్షించువాడునూ, నేను అనుసరించదగిన వాడునూ అయిన కేశవునికంటే అన్యునెవరిని ఎరుగను. ఆతని కొఱకు నమస్కరించుచున్నాను.

వేదాంత వేద్యుడైన బ్రహ్మజ్ఞాని కొఱకు, విశ్వవ్యాప్తుడైన విరాట్ స్వరూపుని కొఱకు, ఆది మధ్యాంతరాహిత్యమును పొందిన వాని కొఱకు, భేదమూ అభేదమూ రెండూ తానే అయిన వాని కొఱకు, నాదప్రియుని కొఱకు, నా ప్రభువైన వానికొఱకు నమస్కారములు.

పరమపురుషుని కొఱకు, జీవుల భవబంధములను సడలించువాని కొఱకు, సాటిలేని ఆనందస్వరూపుని కొఱకు, శాశ్వతుడైనవాని కొఱకు, పాపములను హరించువాని కొఱకు, కలిదోషమును నివారించువాని కొఱకు, హరియునూ అచ్యుతుడునూ అయినవాని కొఱకు, నా ఆత్మస్వరూపుని కొఱకు నమస్కారములు.

కాలస్వరూపుని కొఱకు, కరుణాస్వరూపుని కొఱకు, శ్రీలక్ష్మిస్తనాశ్రిత గుణాసక్తుని కొఱకు, అంతుతెలియని లీలయే తన గుర్తుగా గలవాని కొఱకు, సమస్తమునూ పరిపాలించువానికొఱకు, నాకు ఆభరణము వంటి వాడునూ అయిన శ్రీవేంకటేశ్వరుని కొఱకు నమస్కారములు.

సంపుటి: 3 కీర్తన : అదివో నీప్రతాపము హనుమంతా
సంఖ్య : 500 పుట : 336 రాగం: సాళంగనాట

**సాళంగనాట**

54. అదివో నీప్రతాపము హనుమంతా
యెదురులేదు నీకు నెక్కడా హనుమంతా. ॥ పల్లవి॥

యెత్తిననీ కుడిహస్త మిల నసురలు చూచి
హత్తిరి పాతాళము హనుమంతా
చిత్తగించి నీయెడమచేతిపిడికిటికి
తత్తరించి చిక్కిరదె దైత్యులు హనుమంతా. ॥అది॥

నలియఁదొక్కిన నీవున్నతపుఁ బాదముకింద-
నలమటించే రరులు హనుమంతా
చలపట్టి నీవు జంగ చాఁచిన పాదహతిని
బలుదానవులు భంగపడిరి హనుమంతా. ॥అది॥

వడి నీవు మీఁదికి వాలమల్లార్చిన
అడఁగిరి రాక్షసులు హనుమంతా
బడినే శ్రీవేంకటేశు పంపున నీవు గెల్వఁగ
బెడిదమై పొగడేరు పెద్దహనుమంతా. ॥అది॥ 500

**అవతారిక:**

పెద్దహనుమంతునిపై అన్నమాచార్యులవారు చెప్పిన కీర్తన నాస్వాదించండి. ఇంత చిన్నకోతి తనను జలధి నూరుయోజనాలు దాటించి తన భర్తను చేర్చగలదా! అని శంకించి నవ్వుకొనిన సీతమ్మ శంకను పటాపంచలు చేయటానికి నింగీనేలా నిండిపోయేట్లు తనదేహాన్ని పెంచి చూపించాడు హనుమంతుడు. తిరిగి రామకార్యానంతరం రావణుని కలుసుకోవటానికి నానాభీభత్సం సృష్టించాడు. రాక్షసుల్ని





ముప్పుతిప్పలుపెట్టి మూడు చెఱువుల నీళ్ళు తాగించాడు. చేతికందినవాణ్ణి చిదిమేశాడు. ఆ వైనం కీర్తన రూపంలో వినండి. అసురులు, దైత్యులు, దానవులు, రాక్షసులు... అంతా ఒకే జాతికి చెందిన వర్గాలు.

**భావ వివరణ:**

ఓ హనుమంతుడా! అదిగో, నీ అద్భుత ప్రతాపమునకు యెక్కడా నీకు యెదురు లేనే లేదు స్వామీ!

ఓ హనుమంతా! పైకెత్తియున్న నీ కుడిచేతిని చూచి, ఇల (భూలోకంలోనున్న) అసురులందరూ పాతాళమునకు, హత్తిరి (తగులుకొనిరి). నీ ఎడమ చేతి పిడికిలిని చూచి దైత్యులు తత్తరించి (గాభరాపడిపోయి) చిత్తగించి చిక్కిరదే (వినమ్రులై నీకు వశులయ్యారు).

ఓ హనుమంతుడా! వున్నతమైన నీ పాదము క్రింద నీ అరులను (శత్రుసైన్యమును) నీవు నలియదొక్కిన (నలిగిపోయేట్లు కుమ్మదొక్కివేస్తే) అదిగో యెట్లు అలమటిస్తున్నారో (కుయ్యో! మొఱ్ఱో! అని మొత్తుకొంటున్నారో) చూడు. నీవు చలపట్టి (ఆగ్రహించి) జంగచాచిన పాదహతిని (కాలుచాచి ఒక్కతన్ను తన్నేసరికి) బలుదానవులు (బలవంతులైన దానవులు కూడా భంగపడిరి (ఓడిపోయారు)

ఓ హనుమంతుడా! నీవు పైకిలేపి వేగముగా నీవాలమల్లార్చిన (తోకను అల్లల్లాడిస్తే) రాక్షసులంతా అడగిరి (అణగారిపోయారు). బడినే (అదే క్రమములో) నీవు ఈ కలియుగంలో శ్రీవేంకటేశ్వరుని పంపున (పురమాయింపుపై) గెల్వగా (విజయుడవైతే) పెద్ద హనుమంతుడు ఈ స్వామి అని భక్తులంతా బెడిదము పొగడేరు (అధికముగా కీర్తించుచున్నారు).

సంపుటి: 4 కీర్తన : తథాకురుష్వ ముదా మామద్యేవ

సంఖ్య : 424 పుట : 284 రాగం: లలిత

**లలిత**

55. తథాకురుష్వ ముదా మామద్యేవ
అధోక్షజస్తే అనుదాసోహం ॥ పల్లవి॥

తవాస్మి శరణం దహరాహం
భవదురితాని భంజ మమ
భువి కృతం చ యా పురా ప్రతిజ్ఞాం
జవన దదామి సర్వేభ్య ఇతి ॥తథా॥

వ్రజామి శరణం వరద తవాహం
త్యజితానుబంధ దర్మ మమ
భుజకృతాం పురా ప్రతిజ్ఞాం
వృజినై ర్మోక్షయిష్యామీతి ॥తథా॥

చింతితం మయా శ్రీవేంకటేశ
కింతు త్వం మయి కృపాంకురు
తంతుహి పురాకృతం ప్రతిజ్ఞాం
అంతగతిం నయామీతి మహి. ॥తథా॥ 424

**అవతారిక:**

సంస్కృతంలో అద్భుతమైన శరణాగతిని వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. అధోక్షజుడైన శ్రీమన్నారాయణుని తనకు సత్వరమే ఆనందం కలిగించమని వేడుకొంటున్నారు. దాసోహం అంటున్నారు. కల్కి భగవానునితో తనను కాపాడమని అర్థిస్తున్నారు. ధర్మ సంస్థాపనే నీ





ధ్యేయం అనే ప్రతిజ్ఞను పాలించమంటున్నారు. తనను సర్వ కర్మల ఫలితమునుండి విముక్తుని చేయమని ఆ శ్రీవేంకటేశ్వరుని వేడుకొంటున్నారు. డా॥ పవన్ గారి సహాయం యెనలేనిదని మళ్ళీ వారికి కృతజ్ఞతలు చెబుతున్నాను.

**భావ వివరణ:**

వెనువెంటనే నాకు పరమానందమును ప్రాప్తింపజేయునట్టి దేవదేవా! నీకు నమస్కారములు. అధోక్షజుడవైన నీకు నేను దాసానుదాసుడను.

తొల్లింట నీవు గొప్పవేగము గల శ్వేతాశ్వమునధిరోమించి, పుడమియందుగల సజ్జనులనందరిని కాపాడెదనని ప్రతిజ్ఞ చేసియన్నావు. నేడునా సమస్తపాపములను నివారింపుము ప్రభూ! నేను నిన్ను హృదయపూర్వకముగా శరణువేడుచున్నవాడను.

తొల్లింట, నీవు నీ భుజస్కందములపై గొప్ప బాధ్యతను వేసికొని మాట ఇచ్చియున్నావు. ప్రపంచమున పాపప్రక్షాళనము చేసెదనని వాగ్దానము చేసియున్నావు. నీ ప్రతిజ్ఞను నేడు నిలబెట్టుకొనుము. ధర్మమార్గమును అతిక్రమించినందులకు నన్ను మన్నించి రక్షించుము. నేను నిన్ను దీనుడనై శరణువేడుచున్నాను.

తొల్లింట నీవు నీ శరణాగతులను వారు చేసిన పురాకృతకర్మల ఫలితములనుండి విముక్తులను చేసెదవని ప్రతినపూనియున్నావు. నేడు నీ వాగ్దానమును నిలబెట్టుము. ఓ శ్రీవేంకటేశ్వరా! నిన్నే సదా ధ్యానించెదను. కాన, నీవు నన్ను తప్పక కృపజూతువుగాక!.

సంపుటి: 3 కీర్తన : చూడ నరుదాయనమ్మ సొరిది నందరికిని
సంఖ్య : 114 పుట : 77 రాగం: లలిత

## లలిత

56. చూడ నరుదాయనమ్మ సొరిది నందరికిని
వేడుకతో వచ్చి సేవించేరు బ్రహ్మాదులు ॥ పల్లవి॥

కోరి చంద్రుఁడుదయించ గోకులచంద్రుఁడు వుట్టె-
నేరీతి నీతఁడు నాతఁ డేమౌదురో
వారిధికొడు కతఁడు వారిధియల్లుఁ డీతఁడు
యీరీతి నీతఁ డాతని కేలికాయఁగాని ॥చూడ॥

నల్లనివాఁ డీతఁడాయ తెల్లనివాఁ డతఁడాయ
యెల్ల వారికిఁ జూడ వీరేమౌదురో
అల్లాతఁడే యమృతము అమృతనాథుఁడితఁడు
చల్లనైనహరితోడ సరిగాఁడుగాని ॥చూడ॥

ఆతఁడు పూర్వాద్రిమీఁద నమరెఁ నిందరుఁ జూడ
నీతఁడు శ్రీ వేంకటాద్రి నిరవైనాఁడు
యేతుల వుబ్బుసగ్గులు యిలమీఁద నాతనికి
చైతన్యమెప్పు డీతఁడు సింగారవిభుఁడుగాని. ॥చూడ॥ 114

**అవతారిక:**

ఓ అమ్మలారా! చూడనరుదాయనమ్మా! ఓ బ్రహ్మాది దేవతలారా! సంతోషంతో మీరంతా వచ్చి ఈ గోకుల చంద్రుడు చిన్నారి కృష్ణయ్యను సేవించుకోండర్రా! ఆకాశంలో వున్న ఆ చంద్రుని చూస్తూనేవున్నారు కదా! ఆయనకీ ఈ కృష్ణయ్యకు పూర్వాపరాలు చెప్పమంటారా? అయితే వినండి అని అద్భుతమైన కీర్తననందుకొన్నారు తాళ్ళపాక అన్నమాచార్యులవారు.





ఇలమీదనాతనికి యేతుల వుబ్బుసగ్గులు. మరి యీతడో సింగారవిభుడూ, చైతన్యమెప్పుడూ.... అంటున్నారు అర్థం కాలేదా? ఆలోచించండి.

**భావ వివరణ:**

సొరిది (ఆ క్రమములో) అందరికీ చూడనరుదాయనమ్మ (ఈ దేవదేవుని దర్శించుట అందరికీ సాధ్యపడదమ్మా!) మన అదృష్టంకొలదీ బ్రహ్మాది దేవతలే వచ్చి వేడుకతో (సంతోషంతో) ఆయనను సేవించేరు. చూచి తరించండి.

ఆకాశంలో చంద్రుడు ఉదయిస్తుండగా ఈ నేలపై గోకులచంద్రుడు వుట్టె (పుట్టినాడు). మరి వీరిర్వురూ ఏవిధముగా ఒకరికొకరు ఏమవుతారు? అతడు (ఆకాశంలోనున్న ఆయన) వారిధి కొడుకు (క్షీరసాగరునికి పుట్టిన కొడుకు). మరి యీతడు అదే క్షీరసాగరుడు కాళ్ళు కడిగి కూతురునిచ్చిన అల్లుడు ఈ విధముగా ఈతడు ఆతనికి ఏలిక (నాథుడు) అయ్యాడు కదా!

ఇంతేకాదు... ఈయనేమో అందాల నల్లనయ్య. ఆయన పిండివెన్నెలలాగా తెల్లనైనవాడు, ఎల్లవారికైనా (ఎవరికైనా) వీరేమవుతారో కదా! అల్లాతడే (అల్లదిగో ఆకాశంలో వున్న ఆయన అమృతము వంటివాడు (అమృతము తోబుట్టువు కదా!) మరి ఈయన అమృతంతో పాటు పుట్టిన లక్ష్మీదేవికి, అమృతానికి కూడా నాథుడే. చల్లని వాడైన ఈ శ్రీహరితో సమానులెవరయ్యా?

అదిగో ఆ చంద్రుడు పూర్వాద్రినమరె (తూర్పు కొండపై అమరియుంటాడు), ఆయన్ని అందరూ చూచి ఆనందిస్తుంటారు. మరి ఈయనో... శ్రీవేంకటగిరి అనిపిలువబడే కొండపై నెలకొనియుంటాడు. ఇలమీద (ఈ లోకంలో) ఆయనకు యేతుల (ఉద్ధతితో) కూడిన) వుబ్బు సగ్గులు (పెరుగుట తరుగుట) వుంటాయి. మరి ఈ శృంగారరాయనికి? ఎప్పుడూ చైతన్య స్వరూపుడే.

సంపుటి: 4 కీర్తన : త్వమేవ శరణం త్వామేవ మే

సంఖ్య : 41 పుట : 389 రాగం: కన్నడగౌళ

## కన్నడగౌళ

57. త్వమేవ శరణం త్వామేవ మే
భ్రమణం ప్రసరతి ఫణీంద్రశయన ॥ పల్లవి॥

కదావా తవ కరుణా మే
సదా దైన్యం సంభవతి
చిదానందం శిథిలయతి
మదాచరణం మధుమథన ॥త్వమే॥

మయా వా తవ మధురగతి (?)
భయాదిక (దిహ?) విభ్రాంతోఽహం
తయా విమలం (?) దాతవ్యా
దయా సతతం ధరణీరమణ ॥త్వమే॥

ఘనం వామమ కలుషమిదం
అనంతమహిమాయతస్యతే
జనార్దన ఇతి సంచరసి
ఘనాద్భున వేంకటగిరిరమణ ॥త్వమే॥ 42

**అవతారిక:**

ఫణీంద్రశయనుడైన శ్రీమన్నారాయణునిపై గీర్వాణిలో మధురమైన కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. తన స్వకర్మల చేతనే తనాశిస్తున్న చిదానందం శిథిలమైపోతున్నదని వాపోతున్నారు. తన చేష్టల వల్లనే తనాశిస్తున్న మధురానుభవమును కోల్పోతున్నానని దు:ఖిస్తున్నారు.





తనను ఘనమైన పాపపంకిలం నుండి బయట పడవేయమని జనార్దనుని వేడుకొంటున్నారు. ఆఖరి చరణంలోని "ఘనాద్భున వేంకటగిరి రమణ" అనే దాంటో "ఘనాఢ్యన" అయివుండవచ్చని నా భావన.

**భావ వివరణ:**

ఓ ఫణీంద్రశయనా! (ఆదిశేషునిపై పవ్వళించు శ్రీమన్నారాయణుడా!) నీవే నాకు శరణము. నీయందే నా పరిభ్రమణము జరుగుచున్నది.

ఓమధుమథనా! (మధు అనుదైత్యుని వధించిన మధుసూదనా!) నీ కరణ నామీద యెన్నడు సంభవించును? సదా నాకు దీనత్వమే లభించుచున్నది. నా వ్యర్థ కర్మలచేత నా చిదానందము శిథిలమగుచున్నది. నీవు నన్ను అనుగ్రహించి కరుణించుట యెన్నడు సానుకూలమగును ప్రభూ!

ఓ ధరణీరమణా! (భూకాంతుడా!) నా చేష్టల వలన నాకు నీ మధురానుభవము కలుగుట లేదు. అధికమైన భయము నన్ను వివశుని చేయుచున్నది. నిర్మలమైన నీ దయ యెల్లప్పుడునూ నాపై ప్రసరింపజేయుము స్వామీ!

ఓ జనార్దనా! ఘనులకే ఘనుడవైన శ్రీవేంకటేశ్వరా! నా పాపపంకిలము (కలుషితమైన బురదవంటి పాపము) చెప్పనలవి కానంతవున్నది. నీవు అనంత (అంతులేని) దివ్యమహిమలు గలవాడవు కదా! అందుకే నీకై తిరుగుచునే యున్నాను (వెదకుచున్నాను) నన్ననుగ్రహింపుము తండ్రీ!

సంపుటి: 4 కీర్తన : పృథులహేమకౌపీనధర:
సంఖ్య : 72 పుట : 409 రాగం: పాడి

**పాడి**

58. పృథులహేమకౌపీనధర:
ప్రథితవటుర్మే బలం పాతు ॥ పల్లవి॥

సూపాసక్త: శుచిస్సులభ:
కోపవిదూర: కులాధిక:
పాపభంజన: పరాత్పరోయం
గోపాలో మే గుణం పాతు ॥పృథుల॥

తరుణ: ఛత్రీ దండకమండలు
ధర: పవిత్రీ దయాపర:
సురాణాం సంస్తుతిమనోహర:
స్థిరస్సుధీర్మే ధృతిం పాతు ॥పృథుల॥

త్రివిక్రమ: శ్రీతిరువేంకటగిరి
నివాసోయం నిరంతరం
ప్రవిమల మసృణ కబళప్రియోమే
దివానిశాయాం ధియంపాతు ॥పృథుల॥

**అవతారిక:**

బ్రాహ్మణ వటువును కళ్ళముందు ఆవిష్కరిస్తున్న అన్నమాచార్యుల వారిని అవధరించండి. సంస్కృత కీర్తన అయినందువల్ల కొన్ని చోట్ల భావానికి తగ్గట్లు వివరణలో మార్పులు చేర్పులూ జరిగాయి. పప్పుధప్పళం అంటే ఈ వామనుడికి మరీ ఇష్టంట. ఆ పవిత్రమూర్తిని చూచి సురగణములన్నీ సంస్తుతిస్తున్నాయట. అందరికీ కబళం (అన్నం ముద్ద) పెట్టే ఆ త్రివిక్రముడే, తిరుమల శ్రీవేంకటేశ్వరుడట. అటువంటి స్వామీ!





"మే బలంపాతు" అంటున్నారు. అంటే నాకు బలమును ప్రసాదించుము అని అర్థం. యావత్ జగతికే కబళం పెట్టేవాడు కబళాన్నే యాచించడం వింతల్లోకి వింత కదా!

**భావ వివరణ:**

పృథుల (శ్రేష్ఠమైన) బంగారు వర్ణముగల కౌపీనము (గోచీ) ధరించినవాడా! పృథితవటుర్మే బలం పాతు (ప్రఖ్యాతిగాంచిన బ్రహ్మచారీ! నాకు బలమును ప్రసాదించుము). ఓ వామనరూపా! నీకు నా వందనములు.

నీవు సూపాసక్త: (ముద్దపప్పు తినుటయందు ప్రీతిగలవాడవు). ఎల్లప్పుడూ శుచిగా వుంటే వారిని సులభముగా అనుగ్రహించువాడవు. కోపతాపములను పరిత్యజించినవాడవు. పరాత్పరుడవు (శ్రేష్ఠులకే శ్రేష్ఠుడవు). గోవులవంటి జీవాత్మలను పాలించు పరమాత్మవు. అట్టి నీవు, 'మే గుణంపాతు' (నా గుణములను పవిత్రీకరింతువు గాక!)

తరుణ: (తరుణవయస్కుడు లేక బాలుడును); గొడుగు, కమండలము, దండములను రెండు చేతులలో ధరించినవాడునూ, పరమ పవిత్రుడును అయిన ఆ వామనుడు అమిత దయాపరుడు. అతడు దేవతలందరి చేత వేనోళ్ళ కీర్తించబడుచున్న మనోహరుడు (శ్రీమన్నారాయణుడు). ఆయన నాకు స్థిరమైన, శ్రేష్ఠమైన బుద్ధిని ప్రసాదించు గాక!

త్రివిక్రముడు (ముల్లోకములను సూదిమొనకూడ పట్టనంతగా వ్యాపించినవాడు) అయిన ఆ దేవదేవుడు శ్రీతిరువేంకటగిరి నిలయుడు. నిరంతరము జీవులకు సునాయాసముగా భుక్తి (ఆహారము) నొసగే ఆయనే భోక్తశ్రేష్ఠుడు. అట్టి భుక్తిప్రధాతా! సర్వభోక్తా! రేయింబవళ్ళు నా బుద్ధిని కాపాడుము తండ్రీ!

సంపుటి: 5 కీర్తన : తవ మాం ద్రష్టుం దయాస్తివా
సంఖ్య : 114 పుట : 78 రాగం: కాంబోది-రచ్చతాళం

**కాంబోది - రచ్చతాళం**

59. తవ మాం ద్రష్టుం దయాస్తివా
త్రివిధైర్ఘనాని తే నామాని ॥ పల్లవి॥

కరరమణీ కంకణైర్ఘనకుచ-
గిరౌ స్థాపిత కిన్నరీయం
సరసం మ్లేచ్ఛరచనాని త్వయి
స్థిరా నదయతి తే నామాని ॥తవ॥

కలవర (రవ) కంపిత కంఠవిలసనం
కిలకిలమేళన కిన్నరీయం
లలనా కావా లంఘితవాద్యం
తిలకయతి తదా తే నామాని ॥తవ॥

నిరత మూర్ఛనా నిబిడతాళరవ
గిరాయోజిత కిన్నరీయం
తరుణీ రణయతి తదా సమీపే
తిరువేంకటవర తే నామాని. ॥తవ॥ 114

**అవతారిక:**

ఇది జటిలమైన సంస్కృత కీర్తన. వ్రాయసకాండ్రలోపాలేమోగాని కొన్ని చోట్ల స్థూలంగా అర్థం ఊహద్వారా సరిపుచ్చవలసివచ్చింది. కృష్ణయ్య రేపల్లెలోని లీలలను అపార్థం చేసికొనినవారే అధికంగా కనబడతారు. నాస్తికవాదులు, కాంతావ్యామోహం కలవారు, తిరువేంకటేశ్వరుని భక్తులు - ఈ మూడు రకాలవారూ మూడు రకములుగా ఆ దేవదేవుని నామమును పలుకుచున్నారు. అదిగో పులి అని ఒకడు అంటే... ఇదిగో





తోక అని వత్తాసు పాడే మానవులం మేము నిన్ను చులకనగా మాట్లాడితే పోనీలే అని నీవే కరుణించాలి. అట్టి దయ నాపై నీకు వున్నదా లేదా? అని అడుగుతున్నారు అన్నమాచార్యులవారు.

**భావ వివరణ:**

మాంద్రష్టుం, తవదయ... అస్తివా? (నన్ను చూచుటకు నీకు దయవున్నదా? లేదా?) తే నామాని త్రివిధైర్ఘనాని (నీ నామములు మూడు విధములుగా గొప్పవిగా వున్నవి).

నీహస్తములు, రమణుల కుచగిరులపై నర్తించునపుడు నీ ముంజేతికంకణముల సవ్వడి, కిన్నెరీయం (వీణానాదములను) చేయుచున్నవి. ఇట్టి వర్ణనలతో మ్లేచ్ఛుల (నాస్తికుల) రచనలుగా (కల్పితములుగా) నీనామములు (లీలలు) వినవచ్చుచున్నవి. ఓ దేవదేవా! అట్టి తుచ్ఛమైన రచనల వల్ల నా మనస్సు భ్రష్టుపట్టకుండ నన్ను దయతో స్థిరముగా వుంచి కాపాడుము.

నిన్ను నుతించు స్త్రీల కంఠస్వరములు, కలరవ కంపితములు (హంసధ్వనులవలె కంపిచుచున్నవి). వారి కిలకిల ధ్వనులు కిన్నెరీయం (వీణానాదముల వలె వినవచ్చుచున్నవి). ఆ లలనల (స్త్రీల) రవములు పై వాటి నతిక్రమించే విధముగా వారినోళ్ళతో నీ నామోచ్చరణ చేయుచున్నారు. కాని ప్రస్ఫుటించుచున్న నీ నామోచ్చరణపై నామనస్సు నిలుచుటలేదు. మరి నీకు నన్ను కరుణించే సమయమువున్నదా? (అనే నిరంతర అనుమానపీడిత భ్రష్టుడను ప్రభూ!)

తదా సమీపే తరుణీ రణయతి (నీసమీపమున మేమంటే మేమని పోటీపడుతూ స్త్రీలు) నీ నామములను పలుకుచున్నారు. నిరత (ఎల్లప్పుడూ) ఆరోహణ అవరోహణ (పైస్థాయికి పోయి క్రింది స్థాయికి వచ్చునట్లు) యుక్త రాగాలతో, నిబద్ధమైన తాళ రవ యుక్త కీర్తనలతో కిన్నెరీయం (వీణానాదములవలె వినవచ్చుచున్నవి). స్త్రీ సహజమైన చిరుకలహము కూడా వారు నీనామముతోనే చేయుచున్నారు. అట్టి శ్రీవేంకటేశ్వరా! నీకు మాపై దయవున్నదా? లేదా? తండ్రీ! చెప్పవయ్యా! (అనుమానమే మారోగం కదా!)

సంపుటి: 5 కీర్తన : సకలం హేసఖి జానామి తత్
సంఖ్య : 22 పుట : 16 రాగం: నాదరామక్రియ

## నాదరామక్రియ

60\. సకలం హేసఖి జానామి తత్
ప్రకటవిలాసం పరమం ధధసే ॥ పల్లవి॥

అలికమృగమదమయ మషీకలనో-
జ్జ్వలతాం హేసఖి జానామి
లలితం తవ పల్లవితమనసి ని-
శ్చలతర మేఘశ్యామం ధధసే ॥సకలం॥

చారుకపోల స్థల కరాంచిత వి-
చారం హేసఖి జానామి
నారాయణ మహినాయకశయనం
శ్రీరమణం తవ చిత్తే ధధసే ॥సకలం॥

ఘనకుచశైలాగ్రస్థిత విధుమణి-
జననం హేసఖి జానామి
కనదురసా వేంకటగిరి పతే-
ర్వినుత భోగసుఖ విభవం ధధసే. ॥సకలం॥ 22

**అవతారిక:**

బహుళ జనాదరణ పొందిన అన్నమాచార్యులవారి సంస్కృత కీర్తన నవధరించండి. రాధామాధవీయాన్ని జయదేవుడు యెంత మధురంగా చెప్పాడో తాళ్ళపాకవారూ అంత రసభరితంగానే వినిపించారు. ఈ కీర్తనలో రాధతో ఆమె నెచ్చెలి (అన్నమయ్య) చెబుతున్నది. "ఓ సఖీ! నాకు అతనులీలలన్నీ ధరించినవాడని తెలియును. లలాటమున కస్తూరీ





తిలకమును ధరించిన ఆ నల్లనయ్య నీ మనోనాథుడు. నీ అందమైన కపోలములపై కన్నీటి చారికలే కథనంతా చెబుతున్నాయి. ఆ నారాయణుడు నీచిత్తములోనే వున్నాడని నాకు తెలుసు. విచారించకు, నీవు శ్రీవేంకటపతి భోగసుఖమునే పొందుతున్నావు".

**భావ వివరణ:**

ఓసఖీ! నాకు ఆతని (శ్రీకృష్ణుని) ప్రకటవిలాసము (ప్రకటితములైన లీలలను) ధరించిన వివరము తెలియును.

ఓ సఖీ! ఝుంకారముచేయు గండుతుమ్మెదలను బోలిన నల్లదనమున్న ఆయన లలాటమున (నుదుట) కస్తూరీ తిలకాంచిత వుజ్జ్వల తేజస్సు మెరయుచున్నదని నాకు తెలియును. ఓ సఖీ! నీమృదులమైన, లలితమైన మనస్సునందు నీలమేఘశ్యాముని నిశ్చలత్వంతో ధరించియున్నావని నాకు తెలియును.

ఓ సఖీ! నీ చారుకపోలస్థలమున (అందమైన చెక్కిళ్ళయందు) విచారగ్రస్తమైన కన్నీటి చారికలున్నవని నాకుతెలియును. ఆయన అహినాయక శయనుడు (పన్నగముల అధిపతి అయిన ఆదిశేషునిపై శయనించు) నారాయణుడని, శ్రీదేవి వల్లభుడని; నీవు ఆయననే నీ చిత్తమున ధరించియున్నావని నాకు తెలియును.

ఓ సఖీ! నీ ఘనకుచశైలాగ్రమున (ఘనస్తనగిరులలో) విదుమణి జననం (చంద్రోదయమైనదని... అది నారాయణుని వదన చంద్రోదయమని) నాకు తెలియును. నీవు ప్రఖ్యాతి చెందిన శ్రీవేంకటపతి యొక్క వినుతభోగసుఖవిభవం (ప్రసిద్ధమైన భోగసుఖపు వైభవమును) ధరించియున్నావు.

సంపుటి: 6 కీర్తన : సదయ మానస సరోజాత మాదృశవశం
సంఖ్య : 162 పుట : 116 రాగం: పాడి

**పాడి**

61. సదయ మానస సరోజాత మాదృశవశం
వదముదాహం త్వయా వంచనీయా కిమ్ ।పల్లవి॥

జలధికన్యా పొంగ చారు విద్యుల్లతా-
వలయ వాగురి కాంత వనకురంగ
లలితభవ దీక్షా విలాస మనసిజబాణ
కులిశపాతై రహం క్షోభణీయా కిమ్ ॥సదయ॥

ధరణీవధూ పయోధర కనకమేదినీ-
ధరశిఖర కేళితత్పర మయూర
పరమ భవదీయ శోభనవదనచంద్రాంశు
తరణికిరణై రహం తాపనీయా కిమ్. ॥సదయ॥

చతురవేంకటనాథ సంభావయసి సం-
ప్రతి యథా తత్ప్రకారం విహాయ
అతిచిర మనాగత్య హంత సంతాపకర
కితవకృత్యై రహం ఖేదనీయా కిమ్. ॥లల ॥

**అవతారిక:**

ఈకీర్తనలో విశిష్టతయేమంటే అన్నమాచార్యులవారు మన్మథునిపై సవాలు విసురుతున్నారు. హరిదాసులం, మమ్మల్ని క్షోభబెట్టుట నీ తరమౌతుందా? పాపం నారాయణుడు సాగరకన్యకు, నరసింహుడు భిల్లకన్యకు, వరాహస్వామి భూకాంతకు లొంగినట్లు నేను లొంగుతానా?





ఇదిగో నేను నా శ్రీవేంకటేశుని నమ్ముకొన్నాను. నీచేష్టలకు నేను దు:ఖిస్తానాయేమిటి? అని ప్రశ్నిస్తున్నారు. చాలాక్లిష్టమైన కీర్తన ఇది. నేను చెప్పిన వివరణే అన్నమయ్య మనోగతం అని కూడా అనటానికి ఆస్కారం పూర్తిగా లేదు. ఇది నా భావన.

**భావ వివరణ:**

మానససరోజాత! (మనస్సు అనే సరోవరంలోనే పుట్టుక కలిగిన ఓ మన్మథుడా!) "మాదృశవశం వదముదాహం" (మావంటివారిని అనగా మావంటి హరిదాసులను, వశము చేసికొనుట) నీ తరమా? నీకు అసాధ్యము. నేను క్షోభ జెందుట లేదు ఆనందముగానేయున్నాను.

రమణీయమైన విద్యుల్లతా (ఆకాశంలో తళుక్కున మెరిసే మెరుపుల) వలయములు గల జలధికన్య (క్షీరసాగరకన్య)ను పొందిన వాని (శ్రీమన్నారాయణుని) వలెనూ, వనకురంగము (అడవిజింకను) పట్టుకొను చాకచక్యముగల భిల్లకాంతకు (చెంచులక్ష్మికి) లొంగిన వానిలా (నృసింహుని) వలెనూ, నేను నీయొక్క బాణములకు క్షోభిల్లుతానటరా? ఓ మన్మథా! అట్లెన్నటికీ కాదు.

కనకమేదినీ (బంగారముగల మేదినీకాంతను) ధరించినవాని వలెనూ, భూదేవి పయోధర శిఖరాలలో నర్తించు మయూరము (నెమలి) యైన వానివలెనూ, చంద్రకిరణాల శోభలో కామపీడితుడనగుటకు నేను ధరణీధరునివంటి వాడననుకొన్నావా? (వరాహమూర్తియైన శ్రీహరినా) యేమి? ఓమన్మథా! లేదు. నేనట్లు కాదు.

చతురడవైన ఓ వేంకటనాథా! నీవు యథేచ్ఛగా నన్ను విడిచిపోజూచెదవా? అతి త్వరగా వచ్చి నా క్లేశమును హరింపజేయుము. ఓ మన్మథా! ఆ దేవదేవుడు నా మొరవింటాడు. సంతోషాన్ని కలిగించే నీతుంటరి చేష్టలకు నేను దు:ఖించెదనా యేమి? లేదు. నీకు అది అసాధ్యము.

సంపుటి: 5 కీర్తన : జానామ్యహంతే సరసలీలాం
సంఖ్య : 135 పుట : 92 రాగం: ముఖారి

**ముఖారి**

62. జానామ్యహంతే సరసలీలాం
నానావిధ కపటనాటక సఖత్వమ్ ॥ పల్లవి॥

కిం కరోమి త్వాం కితవ పరకాంతాన-
ఖాంకురప్రకటన మతీవ కురుషే
శంకాం విసృజ్య మమ సంవ్యాన కర్షణం
కింకారణమిదం తే ఖేలన మిదానీం ॥జానా॥

కిం భాషయసి మాం కృతకమానసతయా
డాంభికతయా విట విడంబయసి కిం
గాంభీర్యమావహసి కాతరత్వేన తవ
సంభోగ చాతుర్య సాదరతయా కిం ॥జానా॥

కిమితి మామనునయసి కృపణ వేంకటశైల-
రమణ భవదభిమతసురతమనుభవ
ప్రమదేన మత్ప్రియం ప్రచురయసి మానహర
మమతయా మదననిర్మాతాన కింత్వం ॥జానా॥135

**అవతారిక:**

అన్నమాచార్యులవారు ఆవిష్కరించిన శృంగార భక్తినే జయదేవుడు తన అష్టపదులలో అతిమధురంగా వినిపించాడు. రాధామాధవుల శృంగార తరంగిణిలో అసంఖ్యాకులైన శ్రీకృష్ణపరమాత్మ భక్తులు తన్మయులై తరించారు. ఈ అన్నమయ్య సంస్కృత కీర్తన కూడా ఆ కోవకు చెందిన అమృత గుళికయే. ఈ రోజు శ్రావణ బహుళ అష్టమి. ఈ





శ్రీకృష్ణజన్మాష్టమి నాడు ఈ కీర్తన వివరించడం నా అదృష్టం. “నీ సరసలీలలు నానావిధకపటనాటకాలు నాకు బాగుగా తెలియునులే” అంటున్నది నాయిక. నీవు మరీ విటునివలె ప్రవర్తిస్తున్నావని రుసరుసలాడుతోంది. నీఇష్టం వచ్చినదానితో పో నాకేమిటి? అన్నది. ఆఖరికి ఆ వేంకటకృష్ణయ్యను నిలదీసింది నాపై ప్రేమను యెందుకు చూపించవు? అని అడుగుతున్నది. అదండీ సంగతి పాపం!

**భావ వివరణ:**

“తే సరసలీలాం అహం జానామి” (నీయొక్క సరసలీలలు నాకు తెలుసునులే. నానావిధములైన కపట నాటక సఖత్వమ్ (దొంగనాటకాల చెలిమి, వలపు) నాకు బాగా తెలియునులే. ఇకచాలు.

కృష్ణా! ఇప్పుడు నన్నేంచేయమంటావు? నీ మేనిపై పర కాంతల నఖక్షతాలు కనబడటం లేదూ? ఆ చిహ్నాలు మిక్కుటముగా కనబడుతూనే వున్నాయి కదా! ఒకమాట చెప్పవయ్యా! ఉద్విగ్న భరితమైన, నిశ్శంకావృతమైన ఈ ఆటలు నీకెందులకు?

గోపాలా! కృతకమైన మనస్సుతో నాతో యెందుకు మాట్లాడుతున్నావు? డాంబికముతో నాదగ్గర ఒక విటునివలె యేల ప్రవర్తించుచున్నావు? కపటగాంభీర్యమును జూపి నన్నేల నవ్వులపాలు చేయుచున్నావు? నీసంభోగ చాతుర్యపు సాదరత్వమును యెందుకు లక్ష్యపెట్టకున్నావు?

ఓ శ్రీవేంకట శైల రమణా! ఓ దయారహితా! నన్నేల వ్యర్థముగా వూరడించుచున్నావు? నీ ఇచ్చవచ్చినట్లు యెవ్వరితోనైనా సుఖించు నాకేమి? ఓ మానహరా! కపటముతో నీప్రేమను యేలదాచెదవు? మమతతో కూడిన ఓ మదననిర్మాతా! (మన్మథుని జనకా!) ఆనందముతో నీ నిజమైన ప్రేమను నాపై యేల చూపించవు?

సంపుటి: 3 కీర్తన : కన్నులపండుగలాయ గడపరాయనితేరు
సంఖ్య : 93 పుట : 63 రాగం: సాళంగనాట

## సాళంగనాట

63. కన్నులపండుగలాయఁ గడపరాయని తేరు
మిన్ను నేల శృంగారము మితిమీరినట్లు ॥ పల్లవి॥

కదలెఁ గదలె నదె గరుడధ్వజుని తేరు
పొదిగి దేవదుందుభులు మ్రోయఁగా
పదివేలు సూర్యబింబము లుదయించినట్లు
పొదలి మేరువు వచ్చి పొడచూపినట్లు ॥కన్ను॥

వచ్చె వచ్చె నంతనింత వాసుదేవుని తేరు
అచ్చుగ దేవకామిను లాడిపాడఁగా
ముచ్చటతో గరుడఁడు ముందట నిలిచినట్టు
మెచ్చులమెరుఁగులతో మేఘము వాలినట్టు ॥కన్ను॥

తిరిగెఁ దిరిగె నదె దేవదేవోత్తము తేరు
సరుస దేవతలెల్ల జయవెట్టఁగా
విరివిఁ గడపలో శ్రీవేంకటేశుఁడు తేరుపై-
నిరవాయ సింహాసన మిదేయన్నట్లు ॥కన్ను॥ 93

**అవతారిక:**

దేవునిగడపలో (నేటికడపలో) శ్రీవేంకటేశ్వరుని పూజించి ఆనాటి తిరుమల యాత్రికులు తమ ప్రయాణమారంభించేవారట. కడపరాయనిగా పేరొందిన ఆ దేవదేవుని రథోత్సవం సందర్భంగా అన్నమాచార్యులవారు చెప్పిన చక్కని కీర్తనను అవధరించండి. పదివేల సూర్యులు ఉదయించినంత కాంతితో, స్వర్ణమయమైన మేరు పర్వతం వచ్చి యెదుటనున్నదా అన్నంత దీప్తితో దేవదుందుభులు మ్రోగుతుంటే ఆ గరుడ ధ్వజుని తేరు కదలివస్తున్నదట.





ఎవరో గొప్ప వ్యాఖ్యాత తన నైపుణ్యం కొలదీ వ్యాఖ్యానం (రన్నింగ్ కామెంటరీ) చెబుతున్నట్లు వున్నది కదా! మరి ఆనందించండి. కాకపోతే మీ బాహ్యేంద్రియాలు పనికిరావు. మనోనేత్రం కావాలి.

**భావ వివరణ:**

ఓ భక్తులారా! అదిగో చూడండి. మిన్ను నేల శృంగారము మితిమీరినట్లు (దివిలోనూ భువిలోనూ వైభవము అవధులు దాటిన విధముగా) కన్నులకు పండుగయైన చందమున కడపరాయని తేరు (రథము) వచ్చుచున్నది.

గరుడధ్వజుడు (గరుత్మంతుడు తన రథపు ధ్వజముపై అంటే (జెండాపై) గల ఆ స్వామి రథము అదిగో కదిలింది... కదిలింది. దేవదుందుభులు (నింగిలోని దేవతల ఢంకలు) పొదిగి (సమూహముగా) మ్రోగుచున్నవి. పదివేల సూర్యబింబములు వుదయించినంత కాంతి మిరుమిట్లు గొలుపుతున్నది. బంగారపు మేరుపర్వతము వచ్చి పొదలి (వర్ధిల్లి) పొడచూపినట్లు (కనబడుతున్నట్లు) ఈ కమనీయదృశ్యం వున్నది.

ఈ వాసుదేవుని రథము అంతనింత వచ్చెవచ్చె (ఎంతో గొప్పగా వస్తోంది... వస్తోంది). దేవకామినులు (అప్సరసలు మొదలైన దేవకాంతలు) అచ్చుగ (చక్కగా) ఆడిపాడుతున్నారు. ఇక స్వామివారు బయలుదేరుతారని గరుడుడు (గరుత్మంతుడు) వచ్చి ముచ్చటగా స్వామి ముందు నిలచినాడు, స్వామి అతనిపై ఎక్కుతుంటే గొప్ప నల్లనిమేఘము కమ్ముకుంటున్నదా... అన్నట్లుంది.

దేవదేవోత్తముడు (దేవతాధిపతులందరికీ యేలిక అయిన... అంటే... ఇంద్రుడు, కుబేరుడు, అశ్వనీదేవతలు మొదలైన నాయకులు అందరికీ దొర అయిన వాడు) యెక్కిన రథము అదిగో ఇటు తిరుగుతున్నది, తిరుగుతున్నది చూడండి. దేవతలంతా దగ్గరచేరి జయజయధ్యానములు చేయుచున్నారు. కడపలో శ్రీవేంకటేశ్వరుని రథము విరివి (అతిశయించి) వస్తున్నది. స్వామివారి సింహాసనమే కదలి వస్తున్నదా అన్నట్లుంది. మనం ధన్యులము.

సంపుటి: 5 కీర్తన : దశవిధాచరణం తన్నభవతి
సంఖ్య : 374 పుట : 253 రాగం: కేదారగౌడ

## కేదారగౌడ

64. దశవిధాచరణం తన్నభవతి
దశవిధావస్థార్థం తే తత్ర ।పల్లవి॥

స్థాపయిష్యామి వేదానితి వ్యాజేన
దీపితోయం మత్స్య దేహ: పురా
వ్యాపారోయమేవం నచ తరుణ్యా
రూపజలధౌ కేళిరుచయే తత్ర ॥దశ॥

ధారయిష్యామి మందరమితి వ్యాజేన
చారుకచ్ఛపవిధాచరణం పురా
నీరసేయం తవ మనీషా ప్రియవధూ-
భారకుచమందరౌ భర్తుం తత్ర ॥ లల ॥

భువముద్ధరిష్యామి పునరితి వ్యాజేన
ధవళికిటివైభవం ధత్సే పురా
వ్యవహృతిరియం నచ మహామహీకుచతటే
తవ దంతక్షతం దాతుం తత్ర ॥దశ॥

దనుజం హరిష్యామి తమితి వ్యాజేన
ఘన నారసింహవిక్రమణం పురా
దనుజహర తవ మహత్త్వం తన్నచ నఖా-
ర్జనమిందిరాయా (యాం?) ప్రసర్తుం తత్ర ॥దశ॥

అపహరిష్యామి బలిమహమితి వ్యాజేన
కపటవామనరూపకలనం పురా
నిపుణ ఏవం నఖలు నియతిస్సతీషు తే
కపటాచరణం ఘటయితుం తత్ర ॥దశ॥





సంహరిష్యామి నృపజనమితి వ్యాజేన
బహ్వారుణతోయే ప్రాప్తి: పురా
సింహవిక్రమణతే స్థితియం నచ సతీ-
విహ్వలత్వం తదా వేత్తుం తత్ర ॥దశ॥

రావణం జేష్యామి రణ ఇతి వ్యాజేన
భూవరత్వే తే భోగ: పురా
ఏవం నభవతి మహీసుతా విరహం
సావధానేన ప్రహర్తుం తత్ర ॥దశ॥

కంసం హనిష్యామి ఖలమితి వ్యాజేన
సంసారోయమాచరిత: పురా
హింసాదూర నచ హితమిదం వ్రజవధూ-
సంసరణలీలాం ప్రసక్తుం తత్ర ॥దశ॥

పాతయిష్యే ప్రలంబమితి వ్యాజేన
జాతరోషస్య తే జననం పురా
భూతరక్షక తే ప్రభుత్వం తన్నఖలు
భూతలే రేవతీం భోక్తుం తత్ర ॥దశ॥

బుద్ధో భవిష్యామి పురహృతివ్యాజేన
బద్ధరోష ఇతి తే ప్రాప్తి: పురా
తద్ధితం నహిఖలు తదా వధూహస్త
సిద్ధప్రసారేణ సేవితుం తత్ర ॥దశ॥

మారయిష్యామి కలిమతమితి వ్యాజేన
క్రూర కల్క్యవతారకోప: పురా
ధీనర వేంకటనగాధీశ ఏవం న ఖలు
భీరుమూర్వీం సంప్రీణయితుమత్ర ॥దశ॥ 374

**అవతారిక:**

గీర్వాణిలో శ్రీమన్నారాయణుని దశావతార విభవాన్ని వివరిస్తున్నారు అన్నమాచార్యులవారు. 32వ సంఖ్య గల అన్నమయ్య భక్తి సంకీర్తన ఇది. 32 పెదతిరుమలాచార్యుల శృంగార కీర్తనలతో కలిసి ఇది 64వ సంకీర్తన. దీని తరువాత అన్నమయ్య మనుమడి వైరాగ్య భక్తి కీర్తనలు మొదలవుతాయి. ఈ దశావతార కీర్తన శృంగారపరిమళం గుబాళించే పారిజాతం. దీని పల్లవి కొంచెం క్లిష్టమే. ప్రభూ! నీ అవతారాలన్నీ ఏదోమిష (నెపము) చేత వెలుగు చూచినవే. అన్నిటి ఆశయమూ దుష్టశిక్షణ, శిష్ట రక్షణ మాత్రమే. కానీ పైకి అవన్నీ నీవు ఏదో ఒక స్త్రీ కొరకు చేశావనిపిస్తుంది. కానీ నిజానికి నీవు; నిర్మోహివి, నిస్సంగివి, నిర్గుణివి. కోపతాపాలూ, వాంఛలు జగన్నాథునికి వుంటాయా? అంతా ఆస్వామి లీల అని తెలియుటయే జ్ఞానం. తెలవక పోవటం అజ్ఞానం, అంతే.

**భావ వివరణ:**

ఓదేవదేవా! నీ అవతార విభవము, దశవిధ ఆచరణల (శృంగారకలాపముల) కొఱకు కాక, దశవిధ అవస్థల (పదిరకములైన రూపములెత్తినది) దుష్ట శిక్షణ శిష్ట రక్షణ కొరకు మాత్రమే సుమా!

వేదములను ఉద్ధరించెదననెడి 'మిష' చేత పూర్వము ఈ మత్స్య రూపమును ప్రకాశింపజేసితివి. అంతేకాని తరుణుల రూపసంపద అనెడి సముద్రమును ఆనందించుట అను వ్యాపారమునందు మక్కువ వుండుటజేతకాదు. మందర పర్వతమును ధరింతుననెడి 'మిష' చేత రమణీయమైన కచ్ఛప (తాబేలు) రూపమును దాల్చితివి. అంతేకాని ప్రియవధూటీ సమూహముల భారమైన కుచమందరములను ధరించుటకు కాదు. ఇదియే నీకు గొప్ప రసస్ఫూర్తి.

మరల, పూర్వము భూమిని ఉద్ధరించెదననెడి 'మిష' చేత శ్వేత వరాహవైభవరూపమును ధరించితివి. అంతేకాని నీవ్యాపారము భూదేవి ఘనస్తనశైలములపై నీ నఖ క్షతములిచ్చుటకు కాదు.

దనుజుని (హిరణ్యకశిపుని) సంహరించెదననెడి 'మిష' చేత పూర్వము ఘనపరాక్రమ నారసింహ రూపమును ధరించితివి. అంతేకాని





ఓదనుజహరా! నీ మహాత్మ్యము ఇందిరాదేవి యందు నీగచ్ఛుతమును గావించుటకు కాదు.

బలిచక్రవర్తిని నివారించెదనను 'మిష' చేత, పూర్వము కపట వామనరూపకల్పన గావించితివి. అంతేకాని నైపుణ్యం కల నీవు కపటమైన ఆచరణతో సతులను పొందుట కొఱకు కాదు.

రాజలోకమును సంహరించెదననెడి 'మిష' చేత గొప్పదైన శోణసాగరమును (రక్తపుసముద్రమును) సృష్టించినవాడవైతివి (పరశు రామావతారం). ఇది నీకు సింహ విక్రమ స్థితియే కాని సతీ విరక్తుడవగుట కాదు.

రావణాసురుని రణమును సంహరించెదననెడి 'మిష' చేత నీవు పూర్వము రామచంద్రమూర్తి విభవము చూపితివి. అంతేకాని సీతాదేవి విరహమును సావధానముగా నిర్మూలించుకొనుట కొఱకు కాదు.

ఖలుడైన కంసుని వధించెదననెడి 'మిష' చేత పూర్వము సంసారమున (ప్రపంచంలో) కృష్ణ రూపమును ప్రదర్శించితివి. అంతేకాని ఓహింసాదూరా! వ్రజాంగనల (గోపికల) పొందు అనెడి శృంగార లీలాప్రదర్శనము కొఱకు కాదు.

ప్రలంబాసురుని వధించుట అనెడి 'మిష' చేత పూర్వము రోషముగల రూపమును (బలరాముడు) ధరించుట నీకు హితవు అయినది. అంతేకాని రేవతీదేవిని అనుభవించుట కొఱకు కాదు. త్రిపురాసుర సంహారమనెడి 'మిష' చేత బుద్ధభగవానుడనగుదునని రోషమును అదుపులోనుంచుట నీకు హితవైనది. అంతేకాని ఆ త్రిపురాసురుల భార్యల శీలములను చెరచుట కొఱకు కాదు.

కలిమతమును (కలిపురుషుని ప్రభావమును) నిర్మూలించెదననెడి 'మిష' చేత క్రోధయుక్తమైన, మరియు క్రూరమైన కల్కిరూపము ధరించితివి. అంతేకాని ఓధీర శ్రీవేంకటనగాధీశా! భీతిచెందిన భూదేవిని సంప్రీతి చెందింపజేయుటకు కాదు.

## తాళ్లపాక చినతిరుమలాచార్యుల సంకీర్తనలు:

సంపుటి: 10-1 కీర్తన : బ్రహ్మగన్నవాడు పసిబిడ్డా
సంఖ్య : 11 పుట : 6 రాగం: బౌళి

**బౌళి**

65. బ్రహ్మఁగన్నవాఁడు పసిబిడ్డా
బ్రహ్మమైనవాఁడు పసిబిడ్డా ॥ పల్లవి॥

వగపులేక చంపవచ్చిన బూతకి
పగసాధించినవాఁడు పసిబిడ్డా
పగటునఁ దనమీఁదఁ బారవచ్చినబండి
పగులఁ దన్నినవాఁడు పసిబిడ్డా ॥బ్రహ్మ॥

గట్టున నావులకొరకు వేలనె కొండ
పట్టి యెత్తినవాఁడు పసిబిడ్డా
జెట్టిపోరునఁ దన్నుఁ జెనకవచ్చినవానిఁ
బట్టి చంపినవాఁడు పసిబిడ్డా ॥బ్రహ్మ॥

మిడికెటికోపపు మేనమామఁ బట్టి
పడనడిచినవాఁడు పసిబిడ్డా
కడువేగ శ్రీవేంకటనాథుఁడై గొల్ల-
పడఁతులఁ గూడినాఁడు పసిబిడ్డా ॥బ్రహ్మ॥

**అవతారిక:**

అన్నమయ్య అనుయాయులలో (అనుసరించినవారిలో) తాళ్లపాక చినతిరుమలయ్య తాత అన్నమయ్యకు తగ్గ మనుమడని పేరుపొందాడు. వైరాగ్య కీర్తనలు చెప్పటంలో ఈయన తాతకే దగ్గులు నేర్పగలవాడనిపించాడు. నా ఈ అన్నమయ్య - అనుయాయులు రచనలో ఇదివరలో అన్నమయ్య భక్తి కీర్తనలు, ఆయనకొడుకు పెద తిరుమలయ్య శృంగార కీర్తనలు రుచిచూచారు. ఇక తాళ్లపాక మనుమడి వైర్యాగం రుచి చూడండి. నేడు శ్రీకృష్ణాష్టమి. ఈ పర్వదినాన చిన్నారి కృష్ణయ్యను స్మరించి తరిద్దాం. వీడు పసిబిడ్డా అని ప్రశ్నల





వర్షం కురిపిస్తున్నారు. బ్రహ్మమే తానై, బ్రహ్మను కన్నవాడు పసిబిడ్డా? ఇంకానయం. కడువేగ శ్రీవేంకటనాథుడై గొల్లపడతుల గూడినాడు పసిబిడ్డా? అంటున్నారు. అన్నట్లు ఈయనా 'వేంకట' మకుటంతోనే కీర్తనలు రచించాడండీ.

**భావ వివరణ:**

ఆహా! యేమి ఆశ్చర్యము!! బ్రహ్మదేవుని (విధాతను) కన్నవాడు (తండ్రియైనవాడు) పసిబిడ్డా (చిన్నారి బాలుడా)? బ్రహ్మమైనవాడు (పరబ్రహ్మస్వరూపుడు) పసిబిడ్డా?

పూతకి (పూతన) అనే రాక్షసి కంసుని ఆజ్ఞపై వచ్చి పొత్తిళ్ళలోని కృష్ణయ్యకు విషపూరితమైన తన చనుబాలు ఇచ్చి చంపుదామని వచ్చింది. దాన్ని ఏమాత్రమూ వగపు (విచారము) లేక పాలుతాగి ప్రాణం తీసి పగసాధించినవాడు పసిబిడ్డా? తన మీదకు సగటున (బాహాటంగా) పారవచ్చిన (పడుటకు వచ్చిన) బండిన (బండి రూపంలో వున్న శకటాసురుని) ఒక్క తన్ను తన్ని ముక్కలు ముక్కలుగా పగులదన్నినవాడు పసిబిడ్డా?

తనని పూజించడం మానేశారని రేపల్లె వాసులపై అలిగి ఇంద్రుడు రాళ్ళవాన కురిపించాడు. తన చిటికెన వ్రేలిమీద గోవర్ధన పర్వతాన్ని గొడుగులా యెత్తిపట్టి దాని గుట్టున (నీడలో) గోకులంలోని గోవులను, గోవులవంటి గోపాలురను కాపాడినాడు. వీడు పసిబిడ్డా? తమ మామ కంసుని ఆహ్వానంపై మధురానగరం వచ్చారు. బలరామకృష్ణులు. ముష్టికుడు, చాణూరుడు అనే ఇద్దరు గొప్ప జెట్టీలను (మల్లయుద్ధ నిపుణులను) (అన్నట్లు... చాణూరుడు మన ఆంధ్రుడన్న సంగతి మీకు తెలుసా...) వారిపై వుసిగొల్పాడు కంసుడు. తనను చెనకవ వచ్చన (చంపవచ్చిన) ఆ జెట్టీని పట్టినేలకేసి కొట్టి, మట్టుబెట్టిన దిట్ట... పసిబిడ్డా?

తనని యెప్పుడు చంపుతాడో అని అనుక్షణం భయంతో మిడుకుతూ (త్రుళ్ళిపడుతూ) ఆగ్రహంతో బ్రతికాడు కృష్ణుని మేనమామ కంసుడు. చివరికి వాడిని పట్టుకొని నేలపై పడనడచి (పడవేసి) చంపినవాడు పసిబిడ్డా? ఆ ద్వాపరయుగం అయిపోయాక, కడువేగ (అతిశీఘ్రముగా) తిరుమలకొండ చేరుకొని వేంకటనాథుడైనాడు ఆ గొల్లపడుచుల వుల్లపు ఝుల్లరి. వీడు పసిబిడ్డా? ఇంకానయం. ఈయన పరమపురుషుడు కదటయ్యా!

సంపుటి: 10-1 కీర్తన : చిన్నవాడు నాలుగు చేతులతోనున్నాడు
సంఖ్య : 32 పుట : 18 రాగం: గౌళ

## గౌళ

66. చిన్నవాఁడు నాలుగుచేతులతో నున్నాఁడు
కన్నప్పుడె శంఖముఁ జక్రముఁ జేత నున్నది ॥ పల్లవి॥

నడురేయి రోహిణి నక్షత్రమునఁ బుట్టె
వడిఁ గృష్ణుఁ డిదివో దేవతలందు
పడిన మీబాధ లెల్ల ప్రజలాల యిప్పు డిట్టె
విడుగరాయె మీరు వెరవకఁ డిఁకను ॥చిన్న॥

పుట్టుతానె బాలుఁడు అబ్బురమైన మాఁటలెల్ల
అట్టె వసుదేవుని కాన తిచ్చెను
వట్టి జాలింకేల దేవతలాల మునులాల
వెట్టివేములు మానెను వెరవకుఁడిఁకను ॥చిన్న॥

శ్రీవేంకటనాథుఁడె యాసిసువు దా నై నాఁడు
యీవల వరము లెల్లా నిచ్చుచును
కావఁగ దిక్కైనాఁ డిక్కడనె వోదాసులాల
వేవేగ వేడుకతోడ వెరవకుఁ డిఁకను ॥చిన్న॥

**అవతారిక:**

అది శ్రావణ బహుళాష్టమినాటి అర్ధరాత్రి రోహిణీ నక్షత్రమున నాలుగు భుజములతోను హస్తములలో శంఖ చక్రములతోను చిన్నవాడు కృష్ణయ్య దేవకీ వసుదేవులకు దివ్యదర్శనమిచ్చి, వారి పూర్వజన్మల పుణ్యమును వివరించి అబ్బురముగా వసుదేవునికి కర్తవ్యోపదేశము గావించాడు. ఇదంతా చెప్పిన పిదప, "దేవతలాల! మునులాల! ఇంకా వట్టిజాలియేల?





వెట్టివేములు మానెను ఇక వెరవకుడు" అన్నాడు హరి. ఆ 'సిసువు' వేరెవరో కాదు శ్రీవేంకటనాథుడే అంటున్నారు మన తాతగారి మాదిరిగానే తాళ్లపాక చినతిరుమలయ్య. అందుకే కొన్ని పదములు నిఘంటువు తెరిచినా మింగుడుపడవు.

**భావ వివరణ:**

ఈ చిన్నవాడు (చిన్నారి బాలుడు) నాలుగు చేతులతో నున్నాడు. కన్నప్పుడే (పుట్టినప్పుడే) వీనికి చేతులలో శంఖచక్రములు ఆయుధములుగా నున్నవి.

నడిరేయి (అర్ధరాత్రి) రోహిణీ నక్షత్రమున దేవతలందు (దైవ గణములయందు ఇదిగో శ్రీకృష్ణుడు వడి (శీఘ్రముగా) పుట్టినాడు. ఓ ప్రజలారా! మీరు పడిన బాధలెల్లా ఇట్టే విడుగరాయె (విడిచిపోయాయి). ఇప్పుడు మీరు, వెరవకుడికను (ఇక భయపడకండి).

బాలుడు పుట్టుతూనే (పుడుతూనే) అబ్బురమైన (ఆశ్చర్యకరమైన) మాటలతో వసుదేవునికి అట్టే (అట్లా చేయుము అని) ఆనతిచ్చెను (ఆజ్ఞాపించాడు). ఓ మునులారా! దేవతలారా! ఇంక వట్టిజాలియేల? (వ్యర్థమైన దీనత్వమెందులకు?) వెట్టివేములు మానెను (ఇకవెట్టి చాకిరీవుండదు) వెరవకండి, ఇకను (ఇక భయపడకండి).

ఆ తిరుమల శ్రీవేంకటేశ్వరుడే ఆ'సిసువు' (శిశువు) తానే అయ్యాడు. ఈవల (ఇప్పుడు) వరములెల్లా ఇచ్చుచున్నాడు. ఓ దాసులాల! (హరిదాసుల్లారా!) ఇక్కడే (ఈ తిరుమలలోనే) వేడుకతో వేవేగ కావగ దిక్కైనాడు (రక్షించే దిక్కయినాడు). ఇకను వెరవకుడు (ఇక భయపడకండి).

సంపుటి: 10-1 కీర్తన:తన దాసుని కొరకు ధరియించె నీ రూపము
సంఖ్య : 37     పుట : 21          రాగం: సాళంగనాట

## సాళంగనాట

67. తన దాసునికొరకు ధరియించె నీరూపము
దిన దిన వేడుకఁ గదిరి నారసింహుఁడు ॥ పల్లవి॥

బలురక్కసు నొడిసిపట్టి తొడలపైఁ బెట్టి
చెలఁగి కొనగోళ్లఁ జించినాఁడు
చలపట్టి పేగులజంధ్యాలతోడుతను
తెలివై వున్నాఁడు కదిరి నారసింహుఁడు ॥ లల ॥

ఘోరదానవు కంఠకుహరరక్తము ముంచి
సారెకు వసంతముగాఁ జల్లినాఁడు
మారుకొన్నదైత్యుని చర్మ మొలిచి మేనిమీఁద
ధీరతఁ గప్పినాఁడు కదిరి నారసింహుఁడు ॥ లల ॥

అందపులక్ష్మియుఁ బ్రహ్లాదుఁడు నుతింపఁగాను
విందుగా నాగముపాల వెలసినాఁడు
అంది శ్రీవేంకటనాథుఁడై యీడా నాడాను
దిందుపడున్నాఁడు కదిరి నారసింహుఁడు ॥తన॥

**అవతారిక:**

తెలుగు భాష గొప్పదనం, మన పురాణ సాహిత్యంలో వున్న విశిష్టత ఈ పల్లవిలోనే కనబడుతుంది. కదిరిలో వెలసిన ఫాలలోచన నరసింహునిపై చిన తిరుమలయ్య చెప్పిన ఈ కీర్తన పరిశీలించండి. ఈ రూపాన్ని (నరుడు - సింగము) ఈయన తన దాసుని కొఱకు ధరించాడట. ఎవరా దాసుడు? ప్రహ్లాదుడు. కాని నిజానికి హిరణ్యకశిపుడు కూడా ఆయన దాసుడే. హరిద్వారపాలకుడైన జయుడు





కదా! మనబోటివాళ్ళకి శరీరాలతో సంబంధమైతే ఆ స్వామికి ఆత్మలతోనే సంబంధం కదా! ఆయనకు నిత్యమూ వేడుకలే యెందుకంటే శ్రీవేంకటనాథుడూ ఆయనే కదా!

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! దినదినము (ప్రతిరోజూ) వేడుకలు గల ఈ కదిరి నరసింహుని సేవించి తరించండి. ఈయన తన దాసుని కొఱకు (నమ్మిన సేవకుని కొరకు) ఈ రూపమును ధరించినాడు.

ఈయన బలురక్కసుని (బలవంతుడైన రాక్షసుడు హిరణ్యకశిపుని) ఒడిసిపట్టి (బిగించి పట్టుకొని) తన తొడపై పరుండబెట్టుకొని, చెలగి (విజృంభించి) తన కొనగోళ్ళతో చీల్చివేసినాడు. చలపట్టి (మాత్సర్యముతో) తోడుతనె (తదనంతరం) ఆ పేగులను జంద్యాలుగా తన మెడలే వేసికొనినాడు. ఈ కదిరి నరసింహుడు ఈ విధముగా తెలివియై యున్నాడు (తెలుపబడియున్నాడు).

ఘోరదానవుడైన హిరణ్యకశిపుని, కంఠకుహర రక్తము (కంఠపు నాళములోని రక్తమును) మాటి మాటికీ అతిశయముగా వెదజల్లి వసంతములాడినాడు. మారుకొన్న (తన నెదిరించిన) ఆ రాక్షసుని చర్మమును ఒలిచి తన ఒంటిపై కప్పుకొనినాడు. ఈ కదిరి నరసింహుడు. ఈ విధముగా తన ధీరత్వమును ప్రదర్శించినాడు.

అందమైన ఇందిరాదేవి, భక్తుడైన ప్రహ్లాదుడు తనను నుతించుచుండగా ఈ నాగముపాలలో శోభాయమానముగా వెలసియున్నాడు. అంది (అటుపిమ్మట) శ్రీవేంకటేశ్వరుడై ఈడ (ఈ కదిరిలోనూ) ఆడా (ఆ తిరుమలలోనూ) ఈ కదిరి నరసింహుడే దిందుపడున్నాడు (దిందు పడుట అంటే మూర్ఛపోవటం అని అర్థం. కాని తాళ్ళపాక కవులు, సమ్మోహనంగా వున్నాడు అనే అర్థంలోనే ఈ పదమును ప్రయోగించారు).

సంపుటి: 10-1 కీర్తన:దవ్వుల తెరువు మరేటికి తడబాటులు మరేటికి
సంఖ్య : 38 పుట : 22 రాగం: సామంతం

## సామంతం

68. దవ్వులతెరువు మరేఁటికి తడఁబాటులు మరి యేఁటికి
యెవ్వరు దలఁచిన నిదియె యిహపరముల నొసఁగున్ ॥ పల్లవి॥

మనసనియెడు పెనువింటను మాయాలక్ష్యముపైని
పనివడి జ్ఞానం బనియెడి బాణం బేసినను
వెనకటి దుష్కర్మంబులు వేళ్లతోడఁ బెకలిన
తనయంతనె సకలంబును తప్పక కాన నగున్ ॥దవ్వు॥

మలయుచు మంత్రార్థం బను మందరగిరిచేతను
చలమున సంసారం బను జలనిధి దచ్చినను
అలవడ హరిభక్తి యనెడియమృతము వొడమినను
పొలసెటి చావునుఁ బుట్టుగు పొడమక బదుక నగున్ ॥దవ్వు॥

జీవుఁ డనియెడిపాదున చిరకాలంబును మొలచిన
శ్రీవేంకటనాథుండను సిద్ధౌషధతరువు
భావింపఁగఁ దనకృప యను పండూ పండినను
కావలసిన యర్థము దనకైవస మగుఁ గానా. ॥దవ్వు॥

**అవతారిక:**

దవ్వుల తెరువు అంటే సుదీర్ఘమైన మార్గము. భగవంతుని కృప పొందాలంటే కొన్ని సులభమైన మార్గాలున్నాయి కొన్ని కష్టమైన మార్గాలున్నాయి. స్వామీ! నీవేతప్ప ఇత: పరంబెరుగను అని గజేంద్రునిలా శరణాగతి సులభమైన మార్గం. విశ్వామిత్రునిలా వేల సంవత్సరాలు తపస్సు చేయటం... ఆ తరువాత కామక్రోధమోహాది బలహీనతలకు లొంగి, తడబడి మళ్ళీ మొదటికే రావటం... ఇదంతా అవసరమా? ఇహలోకములో సుఖించటానికీ, పరలోకంలో పరమసుఖం పొందటానికీ ఎవ్వరు ఆశించినా ఇదియే (ఈ హరిభక్తియే) సిద్ధౌషధము అంటున్నారు





తాళ్ళపాక చినతిరుమలాచార్యులవారు.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! భగవంతుడైన ఆ శ్రీమన్నారాయణుని కృపను పొందితేకాని ముక్తి లభించదు. ఆయన దయతో మాత్రమే ఇహపరములన్ (జీవించియున్నప్పుడు ఇహలోకంలోనూ మరణించాక పరలోకంలోనూ) సుఖము దక్కదు. ఆయన దయ పొందాలంటే కొన్ని దవ్వల తెరువులు (సుదీర్ఘమైన మార్గాలూ) కొన్ని సులభమార్గాలూ వున్నాయి. ఆ దవ్వల తెరువులలో తడబడుతూ (పొరబాట్లు చేస్తూ) మరింకెందుకు కష్టపడటం? ఎవ్వరు దలచిన (ఎవరికి కావాలన్నా) ఈ తేలికమార్గం వున్నది కదా!

'జ్ఞానము' అనెడి బాణమును తీసుకోండి. మీ 'మనస్సు' అనెడి గొప్ప 'వింటికి' (ధనస్సునకు) సంధించండి. 'మాయ' అనే ఈ శత్రువుపై గురిపెట్టి వేయండి. ఇక చూడండి. వెనకటి దుష్కర్మంబులు (మీరు పూర్వ జన్మలలో చేసిన పాపాలు కూడా) వేళ్ళతో పెకలించబడి కూలిపోతాయి. సకలంబును (ఏది మంచిదో ఏదికానిదో) తప్పక తనంతట తానే, కాననగును (తెలిసిపోతుంది). అంటే జ్ఞానము ఒక మోక్షమార్గము. అవును కదా!

చలమున, సంసారంబును (మాత్సర్యపూరితమైన ఈ ప్రపంచం అనే) జలనిధిని (సముద్రాన్ని) మంత్రార్థము (నారాయణుని నామమంత్రం అనే) మందరపర్వతంతో మలయుచు (తిప్పుతూ) దచ్చిన (చిలికితే) హరిభక్తి అలవడి (అలవాటై) అమృతముగా వొడముతుంది (తయారవుతుంది). అప్పుడు ఆ అమృతం త్రాగితే పొలసేటి (కలిగే) చావుపుట్టుకలనుండి విముక్తుడై బదుకనగున్ (బ్రతుకవచ్చును).

జీవుడు అనే ఈ పాదున (చెట్టు మొదలులో) చిరకాలంబున (యెప్పటికో) ఆస్వామి కృపవలన శ్రీవేంకటేశుడు అనే సిద్ధౌషధతరువు (గొప్ప ఔషధతత్వముగల చెట్టు) మొలుస్తుంది. దానికి భావింపగ (ఆయననే ధ్యానిస్తుంటే) తనకృప (ఆయన దయ అనే) పండు పండుతుంది. అప్పుడు కావలసిన అర్థములు (ఇహ పరసుఖములు) తనకైవసముగానా (తన స్వాధీనమవుతాయి కదా!)

సంపుటి: 10-1 కీర్తన : అల్లముబెల్లమౌనా అన్నలాల
సంఖ్య : 10 పుట : 9 రాగం: సామంతం

## సామంతం

69. అల్లము బెల్లమౌనా అన్నలాల
యెల్లకాలమును గుణమేల మానీనయ్యా ॥ పల్లవి॥

నిక్కము గొండలనీరు నేలకు వేగమె పారు
యెక్కువనేలపై నీరు యెక్క దండుకు
మిక్కిలి ప్రకృతిలోన మెలఁగెటి వానికి
చొక్కమైన జ్ఞాన మెట్టు సొగసీ నయ్యా ॥అల్ల॥

అచ్చపుఁబాలలోన తోడంటితేనె పెరుగౌను
పచ్చి సేసినఁ బెరుగు పాలు గాదు
వచ్చి వచ్చి యెఱఁగనివానికిఁ దెలుప వచ్చు
కుచ్చితుని నెటువలె గుణిఁ జేసే దయ్యా ॥అల్ల ॥

చందనపువాసనలు సంగడిమాఁకుల నంటు
అందలివాసన లిందు నంట వెన్నఁడు
కందువైన శ్రీవేంకటనాథునిదాసు
లెందుండినా నితరము లేల తోఁచీనయ్యా ॥అల్ల॥

**అవతారిక:**

అద్భుతమైన వైరాగ్యమునావిష్కరిస్తున్నారు చినతిరుమలయ్య. కొన్ని సహజ గుణములుగా వుండి పోతాయి కొన్నిటికి. ఎల్లకాలము వాటికా గుణం సహజంగా వుండిపోతుంది. అల్లము కారంగా వుంటుంది. బెల్లం తియ్యగా వుంటుంది. అల్లం యెన్నటికీ బెల్లం కాలేదు. అదే విధంగా వేంకటనాథుని దాసులు యెందుండినా ఆయన శరణాగతితోనే వుంటారు కానీ వారికి ఇతరము లేల తోచీనయ్యా! అని ప్రశ్నిస్తున్నారు. చందనపు





చెట్టు వాసన పక్కనున్న చెట్లకు వస్తుంది కానీ ఆ చెట్టు వాసన చందనం చెట్టు కంటదు. అవునా? చక్కటి ఉదాహరణలు చెప్పటంలో ఈయన తాతకు సరిజోడే సుమా!

**భావ వివరణ:**

ఓ అన్నలారా! అల్లము రుచి కారంగా వుంటుంది. బెల్లం రుచి తియ్యగా వుంటుంది. అవి వాటికి ప్రకృతి చేత సహజగుణాలు. ఎల్లకాలమును (ఎప్పుడూ) అవి వాటిగుణమును మానీనయ్యా! (మానుతాయటయ్యా!)

నిజముగా చూస్తే, కొండలపైనుంచి నీరు వేగంగా నేలమీదకు పారుతుంది. అది దాని సహజగుణం ఎక్కువగావున్నా నేలపై నుంచి నీరు కొండపైకి ఎక్కుతుందా? రోజూ ప్రకృతిలో (ఇచ్చి పుచ్చుకోవటాలు అనే వ్యాపార ధోరణి వుండేవానికి) చొక్కమైన జ్ఞానము (శ్రేష్ఠమైన, భగవత్తత్వ జ్ఞానము) యెట్లు సొగసీనయ్యా! (సోకుతుందయ్యా!) ఎన్నటికీ సోకదు.

అచ్చపు పాలలోన (స్వచ్ఛమైన పాలలో) తియ్యని పెరుగు వేసి తోడంటితేనే (తోడు బెడితేనే) కమ్మటి పెరుగవుతుంది. అది ప్రకృతి కాని మళ్ళీ పెరుగును పచ్చిసేసిన (చల్లబరిస్తే) యెక్కడన్నా పాలుగా మారిపోతాయా? ఎఱుగని వానికి (అజ్ఞానికి) వచ్చివచ్చి (మళ్ళీమళ్ళీ ప్రయత్నించి) జ్ఞానము బోధించవచ్చును. కాని ఒక కుచ్చితుని (కపట బుద్ధికలవానిని) సుగుణఖనిగా యెట్లు చేయగలనయ్యా!

ఒక తోటలో చందన వృక్షాల సంగడినున్న (పక్కనేవున్న) చెట్లకు ఆ సువాసన అంటుతుంది. అంతేకాని అందలి వాసనలు (ఆ చెట్ల వాసనలు) ఇందు (ఈ చందనవృక్షానికి) అంటదు. కందువైన (శ్రేష్టులైన) శ్రీవేంకటేశ్వరుని దాసులు యెందుండినా ఆ దేవదేవునికి శరణాగతులే. అంతేకాని, ఇతరములేల తోచీనయ్యా! (అనవసరమైన ఇతర విషయములు వారికి యెందుకు ఆసక్తి కలిగిస్తాయి... చెప్పవయ్యా!)

సంపుటి: 10-1 కీర్తన : ఏలికెయైన హరి నేల మరవగవలె
సంఖ్య : 49 పుట : 28 రాగం: లలిత

**లలిత**

70. ఏలికయైన హరి నేల మరువఁగ వలె
పాలుమాలి మరియాల భంగవపడవలెను ॥ పల్లవి॥

యిరుకుమానిసంది నేఁటికిఁ జొరవలె
తిరుగలేక యేల తినుక వలె
యెరవులవిషయాల నేల పొరలవలె
కొరగాని పాపాలగొడ వేల వలెను ॥ఏలి॥

మిగుల వురులలోన మెడయాల పెట్టవలె
తగిలించుకొని యేల పొగులవలె
యెగసక్కెపుఁగోరిక లేల కోరవలె
జిగుఉఉవంటిబందాలఁ జిక్కనేలవలెను ॥ఏలి॥

పారేబండికింద పాదమేల చాఁచవలె
జారుపడి మరియాల జడియవలె
మీరి శ్రీవేంకటనాథు మిక్కిలి వేడుకఁగొల్చి
పోరుమాలి వుండకేల పొడిఁబడవలెను ॥ఏలి॥

**అవతారిక:**

పాలుమాలి అంటే బద్ధకించి అని అర్థం. మన పైఅధికారిని కాస్త అలక్ష్యం చేస్తేనే ఆయన వూరుకోడు. శిక్షిస్తాడు కదా!మరి ఆ ఏలికలందరికీ యేలికయైన శ్రీహరిని యేలమరవవలెను? సోమరిపోతువై ఆయనను మఱచి మరెందుకు కష్టాలపాలవ్వాలి? అంటున్నారు చినతిరుమలాచార్యులవారు. సోదాహరణంగా తను చెప్పదలచింది సూటిగా చెప్పటంలో ఈయన





అన్నమయ్యకి సరిజోడే. మీరి శ్రీవేంకటనాథు మిక్కిలివేడుక గొల్చి... పోరుమాలి వుండకేల పొడిబడవలెను? అంటున్నారు. అర్థం అయ్యీ అవనట్లుంది కదూ!

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! యేలికయైన (జగన్నాథుడైన) హరిని (నారాయణుని) యేల మరువవలెను? మరి (ఆ వెనుక) పాలుమాలి (బద్ధకించి) ఆయన శరణాగతిని మానివేసి, భంగపడవలెను (కష్టాలు కొనితెచ్చుకోవాలి?)

ఇరుకుమానిసంది (కిటికీ చువ్వల సందు మధ్యలోనుంచి) ఎందుకు దూరి వెళ్ళాలని ప్రయత్నించాలి? వెళ్ళటానికి వీలుకాక యేల తినుకవలెను? (ముక్కి ముక్కి ఏరగవలెను?... అంటే... ఇబ్బంది పడాలి? అని అర్థం). ఎరవుల విషయాల (పనికిమాలిన విషయాలలో) యెందుకు తలదూర్చాలి? వ్యర్థమైన పాపాలనన్నింటినీ మూటకట్టుకోవటం దేనికి?

మన, మెడ (గొంతును) తీసుకెళ్ళి స్వయంగా బిగించిన వురితాళ్ళలో ఎందుకు బిగించుకోవాలి? ఆ తరువాత యేల పొగులవలెను (దు:ఖించాలి?) ఎగసెక్కపు కోరికలు (కోరరాని వికటమైన కోరికలతో) తెర్లటం దేనికి? దాని పర్యవసానంగా, జిగురు (బంక) లాగా పట్టుకొని వదలని బంధాలలో (ఎటాచ్‌మెంట్స్‌తో) ఇబ్బందులు పడటం దేనికి?

అయ్యలారా! పారేబండికింద (వేగంగా పోతున్న బండి చక్రం కింద) మీ పాదము పెట్టడం దేనికీ ఆ తరువాత దానికిందజారిపడి యేల జడియవలెను (మిడుకవలెను). సర్వశ్రేష్ఠుడవైన ఓ శ్రీవేంకటేశ్వరా! గొప్ప సంతోషముతో నిన్ను కొలచి, పోరుమాలియండక (దురుసుతనం మాని వుండక) పొడిబడవలెనా? (చూర్ణం చూర్ణం కావలెనా?... అంటే కష్టాలు పాలవవలెనా?)

సంపుటి: 10-1 కీర్తన : భారము నీదిగాన పట్టి విన్నవించేగాక
సంఖ్య : 36 పుట : 21 రాగం: లలిత

**లలిత**

71. భారము నీదిగాన పట్టి విన్నవించేఁగాక
ఆరితేరి బుద్దెరిఁగే దది యెన్నఁ దయ్యా ॥ పల్లవి॥

వీలని సంసారపువెట్టి నేఁ జేయఁగాను
యేలిన నిన్నుఁ గొలిచే దెన్నఁదయ్యా
కాల మెల్లా విషయాల గాడినె కట్టుండఁగాను
ఆలించి నీ సేవ సేసీ దది యెన్నఁదయ్యా ॥భార॥

బట్టబయలు మాయలబారిఁ బడి వుండఁగాను
యిట్టె నిన్నుఁ దలఁచే దెన్నఁదయ్యా
వుట్టిపడే కోరికల వువ్విళ్ళూరఁగాను
ఆలించి నీ సేవ సేసే దది యెన్నఁదయ్యా ॥భార॥

సొలసి నాలుక నూరుసుద్దులె తడవఁగాను
యిలపై నిన్ను నుతించే దెన్నఁదయ్యా
కలిగి నన్నును శ్రీవేంకటనాథ కాచితివి
ఫలియించెఁ దపము యీ బాగు లెన్నఁదయ్యా ॥భార॥

**అవతారిక:**

వైరాగ్యం ముప్పిరిగొన్న ఈ కార్తనలో చినతిరుమల సంసారము అనే వెట్టి చాకిరీకి కట్టుబడ్డవాళ్ళం. మాకు నిద్రలేచింది మొదలు నిద్రపోయేదాకా, వున్న కాలమంతా 'యావ', 'వాంఛ', 'పరాయివాళ్ళ బాగోగులు' మోసపోవటమో మోసం చేయటమో ఇంతే తప్ప పట్టుమని పదినిముషాలు పరమాత్ముని ప్రార్థించే తీరికే దొరకటం లేదు. మధ్యలో, వెంట్రుక వాసిలో చావునుంచి తప్పించి నాకు సంకేతాలు ఇస్తూనేవున్నావు.





అయినా నాకు బుద్ధిరాదు. నిన్ను నుతించను. ఏమిటయ్యా! నీమాయ!! పోదా నాకీ యావ?

**భావ వివరణ:**

అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడే మమ్మల్ని కడతేర్చే భారము (బాధ్యత) మా తండ్రివైన నీది కాక ఇంకెవరిది? అందుకనే నీకు పట్టి (పూనుకొని) విన్నవిస్తున్నాను (మొరబెట్టుకొంటున్నాను). మేము ఎటువంటి దురవస్థలో వున్నామో ఒకసారిచూడు. దీంట్లోంచి ఆరితేరి (బయటపడి) బుద్ధితెచ్చుకొని నిన్ను నేను తలచి ధ్యానించేది యెన్నడయ్యా?

వీలని (వదలలేని) సంసారపు వెట్టిచాకిరీ నేను చేస్తూనే బ్రతుకు గడుపుతున్నాను. ఎంతసేపటికీ సంసారపు యావయే. ఇక జగముల యేలికవైన నిన్ను కొలిచేది యెన్నడయ్యా! కాలమెల్లా విషయవాంఛల గాడికొయ్యకు కట్టుబడివుండవలసివచ్చింది. ఇక ఆలించి (మంచి మాటలు విని) నీ శరణాగతుడనై నీకు సేవచేసేదెన్నడయ్యా?

ప్రభూ! నీ బట్టబయలు మాయలు (పైకి కనిపిస్తూనే వుండే మాయలు) ఎవ్వరూ ఎవ్వరికీ ఏమీకారు అని ఎవరికి తెలియదు? అందరికీ తెలుసు. కానీ నాభార్య, నా సంతానం, నాఇల్లు నావాళ్ళు అని ఒకటే 'యావ'. వాళ్ళందరి మంచిచెడులన్నీ నావే అనుకోవటమే నీమాయ. ఈ మాయలో కలిగే తాపత్రయంతోనే సరిపోతున్నది. ఇక నిన్నెప్పుడు తలిచేదయ్యా? ఉట్టిపడే కోరికలతో (అతిశయించే కాంక్షలతో) ఉవ్విళ్ళూరుతుంటాను. ఇక నిన్నెప్పుడు పొగిడేదయ్యా?

నా నాలుకపై లేచింది మొదలు ఊరసుద్దులే (ఊళ్ళోవాళ్ళముచ్చట్లే వుంటాయి). అట్లా నేను తడవగాను (పట్టించుకొంటూ వుంటే) ఇక నిన్ను నుతించేదెన్నడయ్యా? ఇట్లా నేను అఘోరిస్తున్నా నామీద కరుణతో ఇట్లాంటి నన్ను కూడా శ్రీవేంకటేశ్వరా! నీవు కాచితివి (రక్షించావు). నా తపము ఫలించింది. ఈ బాగులెన్నడయ్యా? (ఇకపై ముక్తి యెన్నడయ్యా?... అని నా భావన.)

సంపుటి: 10-1 కీర్తన : తచ్చి చూచితేజాలు దైవమే కలదుగాక
సంఖ్య : 35 పుట : 20 రాగం: లలిత

**లలిత**

72. తచ్చి చూచితేఁజాలు దైవమే కలఁడుగాక
హెచ్చిన మాయలఁ బడనేల మాకు నిఁకను ॥ పల్లవి॥

సారెసారె నే నెంత సంపదలు గోరినాను
పోరచి నీ దేహమెకా భోగించేది
యీ రీతి మనసు దా నెన్నటికిఁ దనిసీని
గారవాన హరి నిన్నుఁ గన్నదె దక్కెను ॥తచ్చి॥

పలుమారు చావులేని బదుకు కాసపడేది
యిలలో సంసారమెకా యేఁ జేసేది
కలిగినయాస యే కాలమున ముదుసును
అలరి విష్ణునిశరణన్నదె నిలిచె ॥తచ్చి॥

వేడుకతో ఘనమైన విద్యలు నేరిచినాను
జోడుగా నిందరికిని చూపు టింతేకా
వీడని తలఁపుతో శ్రీవేంకటనాథునిఁ గొల్చి
యీడేరి బదుకుటె యెన్ని కింతె కాకా ॥తచ్చి॥

**అవతారిక:**

"కలదు కలండనెడివాడు కలడో లేడో" అనే సందేహం జీవితంలో ఒక్కసారి కూడా రాని మానవుడు యెక్కడా వుండడేమో అనిపిస్తుంది. నిస్సహాయస్థితిలో దీనావస్థలో వున్నప్పుడు అది సహజమే. కాని తచ్చి చూచితే చాలయ్యా! ఆ దైవము వున్నాడు అంటున్నారు చిన తిరుమలయ్య. అయితే ఆయన మాయలో బడితే మాత్రం... రాక్షసులమైపోతాము. మాయ కాకపోతే యెంత సంపాదించినా భోగించేది రేపు వుండని ఈ దేహమే, మనస్సు కాదు.





ఆశ అనేది తీరుతుందా? ఇంకా బ్రతకాలి అని కోరుకొనేది ఈ సంసార సుఖాలకోసమా? విష్ణుని శరణనటానికి కాదా? అసలు సకల విద్యా-పారంగతుడనిపించుకొనేది దేనికి? ఆలోచించండి. మరి ఇది ఒక్కసారి చదవండి.

**భావ వివరణ:**

'తచ్చు' అనే పదము వికృతి. 'త్రచ్చు' అనేది ప్రకృతి. 'తచ్చు' అంటే మథించటం. అంటే చిలుకుట. అంటే బాగా ప్రయత్నించటం. అలా త్రచ్చితే దైవాన్ని కనుగొనగలం గాని, వూరకనే తిరుమలకొండలెక్కితే కనబడడు. అందుకే అసలున్నాడా అనిపిస్తుంది. మాకు అటువంటి, హెచ్చిన (పెరిగిపోయిన) మాయలలో పడుట భావ్యమా?

ప్రతిసారీ నేను ఆ స్వామిని యెంత సంపద కోరినా, దానితో పొరచి భోగించేది (పొంది సుఖపడేది) అశాశ్వతమైన ఈ దేహమే కదా! ఇక మనస్సు ఎన్నటికి తనిసీని (యెప్పుడు తృప్తిపడుతుంది?) గౌరవంతో శ్రీహరిని దర్శించగలిగితే అదే భాగ్యము.

ప్రతివాడు చావులేని బ్రతుకు కావాలని కోరుకొంటాడు, దేనికండీ అది? నీ వాళ్ళంతా చచ్చిపోయాక నీవొక్కడివే బ్రతికి యేమి చేస్తావు? ఎన్నిసార్లు చేసినా సంసారమే కాని మరొకటి కాదు కదా! కాని ఆ విష్ణుమాయవల్ల నేను చావకూడదనే ప్రతివాడూ ఆశపడతాడు. ఈ ఆశ యే కాలమున, ముదుసును? (ఎప్పుడు ముసలిదవుతుంది... అంటే యెప్పుడు తీరుతుంది?) తీరనే తీరదు. విష్ణుని శరణంటే అదొక్కటే నిలుస్తుంది. తక్కిన కోరికలన్నీ నశించేవే... కానీ... తీరేవి కావు.

వేడుకతో (కుతూహలంతో) ఎన్ని విద్యలు నేర్చుకొనినా పరులకు చూపించి సెబాసు అనిపించుకొనుటకే కానీ మరెందుకు? మహా అయితే దానివల్ల ధనలాభం రావచ్చును. మేడలు కట్టవచ్చును. కానీ చివరికి దాని వల్ల నీకేం ఉపయోగము? ఈ ఆశ వీడిన తలపుతో ఆ శ్రీవేంకటేశ్వరుని కొలిచి చూడు. నీకు అంతులేని ఆత్మానందం కలుగుతుంది. నీ బతుకు ఈడేరుతుంది (తరిస్తుంది). ఎన్నిక అవుతుంది. ఇంతకంటే కావలసినది ఇంకేమిటి చెప్పండి?

సంపుటి: 10-1 కీర్తన : అందరు వికారమందుదురె
సంఖ్య : 44 పుట : 25 రాగం: లలిత

**లలిత**

73. అందరు వికార మందుదురె
నిందలేని నీవు నాదాసులుదక్క ॥ పల్లవి॥

సతుల సుతులఁ జూచి జగములో వారెల్లా
మతిలోన భ్రమయక మానరు
రతికెక్కఁగా హేయరాగరహితుఁడవై
సతతము గలిగిన స్వామివి నీవు దక్క ॥అంద॥

ధనధాన్యములు చూచి తగినజీవులు వాని
వెనువెంటఁ దిరుగక విడువరు
పనిపూని యాశాపాశదూరుఁడవై
ఘనత గలుగు శ్రీకాంతుఁడ నీవు దక్క ॥అంద॥

యిల్లు ముంగిలి చూచి యీ దేహులు వాని
నొల్ల మనుచు రోసి వుడుగరు
వెల్లివిరగ శ్రీవేంకటనాథుఁడవై
తెల్లమైనయట్టి దేవుఁడవు దక్క ॥అంద॥

**అవతారిక:**

మానవమాత్రులైనవారు తమకున్న భోగభాగ్యాలు చూసికొని, తమ భార్యా బిడ్డల విశిష్టతలను చూసికొని, తమ ఇల్లు వాకిళ్ళు ధనసంపదలను చూసికొని వుబ్బి తబ్బిబ్బవడం సహజమే. వాటివల్ల వారికి కామ క్రోధాది వికారములు కూడా కలుగుతుంటాయి. అందరు అట్టి వికారములనందేవారే. అయితే నిర్మలులైన శ్రీ పతిదాసులు మాత్రం ఆయన శరణాగతిని తప్ప ఇంకా దేనినీ కోరరు, లెక్కచేయరు. వారికి





ఇంకేదైనా రోతయే. వారికి శ్రీకాంతుని చింత తప్ప ఇంకొకటి అక్కరలేదు అంటున్నారు చినతిరుమలాచార్యులవారు.

**భావ వివరణ:**

ఓ ప్రభూ! అందరు (ఈ ప్రపంచంలో వుండేవాళ్ళంతా) వికారమందుదురె (రాగద్వేషాది వికారములను అనుభవిస్తూనే వుంటారు). నిందలేని (ఏలోపము లేని) నీదాసులు (హరిదాసులు) దక్క (తప్పించి) ప్రతివాడికీ ఈ వికారాలు అతి సహజమే.

అందరు ఈ ప్రపంచంలో తమ భార్యల అందచందాలకు, కొడుకుల గొప్పతనం చూచి వాళ్ళ మనస్సులో గర్వించి తాము చాలా అదృష్టవంతులమని భ్రమపడుతూనే వుంటారు. కానీ వారంతా అశాశ్వతులు. శాశ్వతుడవైన స్వామివి నీవొక్కడివే. నీవు మాత్రమే రతికెక్కగా (విఖ్యాతుడవై) హేయము (ద్వేషము) రాగము (అనురాగము) రహితుడవు (లేనివాడవు). అట్టి నీవు తప్ప అందరూ రాగద్వేష పీడితులే.

ధనధాన్యములకాశపడి ఈ ప్రపంచంలోని జీవులంతా వాటి వెనుకనే పరుగులు తీస్తుంటారు. ఎన్నటికీ ఈ బలహీనతలను వారు విడువరు. ఓ శ్రీకాంతా! ఘనత గలిగిన నీవొక్కడివే పనిపూని (పనివేళా) ఆశాపాశమునకు దూరముగా వుండగలవు. మానవమాత్రులమైన మాకు ఆశాపాశము వురివంటిది.

దేహధారులైన ఈ మానవులంతా తమకున్న ఇళ్ళూ వాకిళ్ళూ చూసికొని గర్వంతో విఱ్ఱవీగుతూనే వుంటారు. రేపు మనము ఎలాగైనా వీటిని వదిలిపెట్టిపోయేవారమే కదా! ఎందుకు వాటిపై వ్యామోహం? అని వారు ఎన్నటికి రోయరు (విముఖులు కారు). నీవు శ్రీవేంకటేశ్వరుడవై వెల్లివిరి అయినావు (ప్రకటింపబడినాడవు). నీవు దక్క (తప్పించి) ఈ విధముగా తెల్లమైనట్టి (విఖ్యాతుడైన) దేవుడు ఇంకొకరు లేనే లేరు తండ్రీ!

సంపుటి: 10-1 కీర్తన : ఇందరునేల దూరేరు హితవే నీవుసేయగ
సంఖ్య : 40 పుట : 23 రాగం: ఆహిరినాట

**ఆహిరినాట**

74. ఇందరు నేల దూరేరు హితవే నీవుసేయఁగా
ముందుముందె తమ్ముఁ గర్మములు సేయుమంటివా ॥ పల్లవి॥

తెలిసి నిన్నుఁ గొలువ దేహ మిచ్చితివి గాక
బలిమినె మాయలలోఁ బడుమంటివా
మలసి నిన్నుఁ దలఁచ మన సిచ్చితివిగాక
కొలగట్టి విషయాలఁ గోరు మంటివా ॥ఇంద॥

నగుతా నిన్నుఁ బొగడ నాలు కిచ్చితివి గాక
అగడుగా నూరమాట లాడుమంటివా
సొగసి నిన్నుఁజూడఁగాఁజూపు లిచ్చితివి గాక
వగవగలతో నూరివారిఁ జూడు మంటివా ॥ఇంద॥

శ్రీవేంకటనాథ నిన్నుఁ జేరు మనంటివి గాక
జీవులను మనుజులాఁ జేరుమంటివా
భావించి నీదాసులనె భజించు మంటివిగాక
దావతి లంపటాలతోఁ దడఁబడు మంటివా ॥ఇంద॥

**అవతారిక:**

కాపాడినవాడిని కాటువేయటం కాలకూటవిషం కక్కే పాముకి సహజగుణము. పామరుడైన నరుడు ఆ పాముకి ఎందులోనూ తీసిపోడు. చినతిరుమలాచార్యులవారు ఈ కీర్తనలో "ప్రభూ! నీవు ఈ మానవుణ్ణి పుట్టించి, రక్షించి, వాడికోసం ఇంద్రియాలనిచ్చి ఎంతో హితవు చేస్తే వాడు ఆ ఇంద్రియాలను నిన్ను కీర్తించటానికి బదులు తుచ్ఛమైన కోరికలు





తీర్చుకోవటానికి వాడుతున్నాడే!! పైగా నీవిచ్చిన తెలివితేటలతో నీవే లేవని నిరూపించేందుకు నిన్ను తిడుతున్నాడు. ఇట్లాంటి దౌర్భాగ్యుణ్ణి ఈ చెడ్డపనులు నీవు చేయమన్నావా? ఏమి అజ్ఞానం!! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీవు హితవేసేయ (మేలేచేస్తే) ఇందరున్ యేలదూరేరు (నిందిస్తున్నారు?) నీవు ముందుముందే (మొట్టమొదట) వాళ్ళని, కర్మలు సేయమంటివా (చెడ్డపనులు చేయమన్నావా?) లేదుకదా!

ప్రభూ! నిన్ను తెలిసికొని కొలిచేటందుకు వీడికి దేహము (శరీరము) నిచ్చావు. బలవంతమైన మాయలో పడిపొమ్మన్నావా? లేదే? మలసి (ఉద్యమించి) నిన్ను ధ్యానించటానికి వీడికి మనస్సునిచ్చావు. వాణ్ణి కొలగట్టి (పాపచింతతో) విషయసుఖాల వెంట పరుగులెత్తమన్నావా? లేదే?

స్వామీ! వీడికి నీవు నాలుకయెందుకు ఇచ్చావు? నగుతా (నవ్వుతూ ఆనందంగా) నిన్ను పొగడమని ఇచ్చావు. అగడుగా (నిందిస్తూ) ఊరమాటలు (పనికిరానిమాటలు) ఆడమంటివా? రెండు కళ్ళు యెందుకిచ్చావు? సొగసి నిన్ను జూడగా (ఇంపుగా నిన్ను చూచి ధన్యుడవమని ఇచ్చావు). వగవగతో (రాగద్వేషాలతో) వూళ్ళోవాళ్ళని చూడమన్నావా? లేదే?

ఓ శ్రీవేంకటేశ్వరా ఈ జీవులను (మనుష్యులను) చేరి వాళ్ళ సాంగత్యంలో జీవితమంతా వ్యర్థంగా గడపమని చెప్పావా? లేదే? నిన్ను చేరుకోమని చెప్పావు. భావించి (సద్భావనతో) హరిదాసులను కీర్తించమన్నావు. అంతేకాని దావతిలంపటాలతో (దు:ఖభాజనమైన సంబంధాల పీకులాటలో) తడబడమంటివా (తత్తరపడుతూ బ్రతుకుమన్నావా?) లేదే? అన్నీ వీడు చేసికొని నిన్ను నిందించి ఇంకా యెక్కువ పాపం మూటకట్టుకొంటున్నాడు.

సంపుటి: 10-1 కీర్తన : ఇందరిజూచి చూచి యెఱఁగ వద్దా
సంఖ్య : 56 పుట : 32 రాగం: నాట

**నాట**

75. ఇందరిఁ జూచి చూచి యెఱఁగ వద్దా
బందెపసులకు మెడ పన్నించనేలా ॥ పల్లవి॥

యినుమునఁ జేసిరా యెవ్వరిదేహమైనా
పొనిఁగి పోతేఁబోవు పోకుంటే మాను
పనివడి యిందుకుఁగాఁ బాటవడ నేమిటికి
మొనసి దొసపంటికి యినుపకట్టేలా ॥ఇంద॥

మంచిరాతఁజేసిరా మనుజుని మేనేమి
నించి చెడితేఁజెడు నిల్చితే నిల్చు
పొంచిపొంచి యిందుకుఁగా పొడిఁబడనేఁటికి
పంచ నీరుబుగ్గ రాతిబరణిఁ బెట్టనేలా ॥ఇంద॥

చేఁగమానఁ జేసిరా చెల్లఁబో నరుల నెల్లా
యీఁగి కుంగితేఁ గుంగు హెచ్చితే హెచ్చు
నాఁగువార శ్రీవేంకటనాథుఁడు మన్నించఁగాను
దాఁగి జీలుగుబెండుకు తరము వెట్టనేలా ॥ఇంద॥

**అవతారిక:**

వైరాగ్యం (విరక్తి) తొణికిసలాడే కీర్తనలు చెప్పటంలో చినతిరుమలయ్య యెంతటి దిట్టతనం గలవాడో చూడండి. సంసారతాపత్రయంలోబద్ధ మానవులం కాబట్టి అప్పుడప్పుడు బందిలదొడ్డి (పసువులజైలు)లో, తప్పులు చేసిపడుతూనే వుంటాము. కానీ కనీసం ఇంతమందిని చూచి చూచి అయినా తెలుసుకోవద్దా. చిరకాలం ఆ 'బందెల పసువుల'లాగే వెతలకొగ్గి బ్రతకాలా అంటున్నారు. అద్భుతమైన వుదాహరణలతో తన నీతి బోధను వినిపిస్తున్నారు.





**భావ వివరణ:**

ఓ జనులారా! ఇంతమందిని చూచి చూచి అయినా మంచియేదో చెడుయేదో యెఱుగవద్దా? జీవితాంతం బందెల దొడ్డిలో బడిన పశువుల వలెనే మెడపన్నించి (తలవొగ్గి) బ్రతుకవలెనా?

మన దేహాన్ని ఇనుముతో చేశారా? ఎవ్వరిదేహమైన సున్నితమైనదే. దాన్ని పొనిగి (తృణీకరించి) పోతే పోయిందిలే అని దురుపయోగం చేయరాదు. అయితే ఇది శాశ్వతం అనుకొని ఏవేవో తిప్పలుపడి దీనికోసం పాటుబడటం దండుగమారిపని. ఎందుకంటారా... ఒక్కసారి ఆలోచించండి, మొనసి (పూనుకొని) దొసపంటికి (తొస్సిపన్ను కోసం) ఎవడన్నా ఇనుముతో చేసిన కట్టు వేయించుకొంటాడా?

మనుష్యుని మేను (శరీరం) యేమన్నా మంచి దిట్టమైన రాతితో చేశారా? చెడిపోతే పోయింది, వుంటేవుంది అని దురుపయోగం చేయవచ్చునా? చేయరాదు. అయితే దీనికోసం పొంచిపొంచి (తిప్పలుపడి) పొడిబడనేటికి (శ్రమపడుట యెందులకు?) అదిమాత్రం దండుగే. ఎందుకంటే... ఒక్కసారి ఆలోచించండి, నీటి బుడగ యెప్పటికైనా చిట్లిపోయేదేకదా! దాన్ని ఎవడన్నా రాతి భరణి (రాయితో చేసిన భరణి)లో పెట్టి కాపాడుతాడా?

చెల్లబో! (ఓరి నాయనో!) మనుష్యుల్ని చేగమానులతో (కొయ్యతో) చేశారా యేమిటయ్యా? ఈగి (బలహీనపడి) ఈ చేగమానులోపలికి వంగిపోతుంది లేదా పైకి వంగిపొడుచుకొస్తుంది. అయితే దీనికోసం శ్రమించి భద్రపరచక్కరలేదు. శ్రీవేంకటేశ్వరుడు నాగువార మన్నించగా (అభివృద్ధి చెందునట్లు దయదలంచితే) సరే.. కానీ.. ఎక్కడనైనా జీలుగుబెండుకు (చీలిపోయిన కొయ్యకు) తరమువెట్టనేల (నగిషీలు చెక్కిస్తాడా యెవడైనా?)

సంపుటి: 10-1 కీర్తన : ఎఱుక గలిగితేను యీతఁడె దిక్కు
సంఖ్య : 55 పుట : 31 రాగం: దేసాళం

## దేసాళం

76. ఎఱుక గలిగితేను యీతఁడె దిక్కు
మఱి నిమిష మీతని మానివుండఁ దగునా ॥ పల్లవి॥

యెవ్వరిసొమ్ము గుడిచి యెవ్వరిగుఱ్ఱాలవెంట
క్రొవ్వుదీరఁ బారాడి కొలిచేది
యివ్వలఁ బుట్టించి పెంచి యేలినదేవుఁ డుండఁగా
అవ్వలివ్వలి వారిని ఆసపడఁదగునా ॥ఎఱు॥

తా నెవ్వరికిఁ బుట్టి తలఁకక వూరివారి
నానందాన అయ్య లమ్మ లనుకొనేది
పానిపట్టి సర్వవిధబంధుఁడు విష్ణుఁ డుండఁగా
మానిసిచుట్టరికాలు మరుఁగఁ జెల్లునా ॥ఎఱు॥

యెందువంకనో యీ దేహి యేమిటోనో పొగడుచు
విందువలె నెవ్వరిని వెట్టిఁ జేసేది
కందువైన శ్రీవేంకటనాథుఁడు గావఁగా
సందుసుడికోరికల సటఁబడఁ జెల్లునా ॥ఎఱు॥

**అవతారిక:**

'ఎఱుక' అంటే జ్ఞానం. తాళ్ళపాక చినతిరుమలయ్య చెప్పిన ఈ కీర్తనలోని ఆనాటి తెలుగునుడికారపు విశిష్ఠతను గమనించండి. ఈ దేవదేవుడే అందరికీ దిక్కు అని చాలామందికి అనిపించదు. అలా అనిపించాలంటే ఆయనకు మనపై కృప రావాలి. ఆ ఎఱుక కలిగేదాకా ఎన్నిసార్లు చూసినామనకు విగ్రహమే కనిపిస్తుంది. చూస్తాము, దండము పెట్టుకొని వెళ్ళిపోతాం. కానీ ఒకనాడు ఆయనకు మనపై





దయకలుగుతుంది. మఱి నిముషమీతని మానివుండదగునా? అనిపిస్తుంది. సందుసుడి కోరికలన్నీ చప్పుడు చేయకుండా జారుకొంటాయి. ఏమిటిదంతా... అనుకొంటే... భావవివరణమే శరణము.

**భావ వివరణ:**

ఓ మానవులారా! అజ్ఞానం నశించి, ఎఱుక (జ్ఞానం) కలిగితే, ఈతడే మనందరికి దిక్కు అని స్ఫురిస్తుంది. మఱి (ఇక ఆపైన) ఒక్క నిమిషమైనా ఈదేవదేవుని మానివుండదగునా (వద్దు అని వుండవచ్చునా?)

ఎవ్వరిసొమ్ము గుడిచి (ఏ మనిషిని సేవించి వాడిచ్చిన జీతంతో) బలిసిన నా క్రొవ్వు కరిగేట్లు వాడెక్కిన గుఱ్ఱాల వెంట పరుగెత్తి వాడిని కొలిచేది? ఇక్కడ నన్ను పుట్టించి పెంచి నా రక్షకుడైన భగవంతుడుండగా... అవ్వలివ్వలివారిని (ఆపైలోకాలలోవున్న అన్యదేవతలను, ఈ భూమ్మీదున్న ధనవంతులను) ఆసపడదగునా (ఆశించి యాచించవచ్చునా?)

ఎవ్వరో ముక్కూ మొగము తెలియని వాళ్ళకి పుట్టి, తలకక (ఏమాత్రం చలించక) వారినే అమ్మా నాన్నలనుకొని సంతోషపరచాను, సంతోషం పొందాను. అన్ని విధములా శ్రీమహావిష్ణువే పానిపట్టి (పనివేళా) అందరికీ ఆప్త బంధువు. ఆయనుండగా ఈ మానవచుట్టాలతో కాలయాపన చేయవచ్చునా?

ఎందువంకనో (దేనికోసమో), ఏమిటినో (ఏమిటేమిటో) పొగుడుతూ, ఈదేహముతో ఎవ్వరిని విందువలె వెట్టి చేసేది (సంతోషంతో) వెట్టివాళ్ళను చేయమంటారు చెప్పండి)? కందువైన (సర్వసమర్ధుడైన) శ్రీవేంకటేశ్వరుడు కావగా (అనుక్షణం కంటికి రెప్పలా కాపాడుతుంటే) సందుసుడి కోరికలు (సందుచూసుకొని మధ్యలో పుట్టే కోరికలవల్ల) సటబడజెల్లునా? (సతమతమవటం తగినపనియేనా?) చెప్పండి.

సంపుటి :10-1 కీర్తన:ఎట్టి హితోపదేశకుడు డెటువంటి దయాళువు
సంఖ్య : 52 పుట : 29 రాగం: దేసాళం

## దేసాళం

77. ఎట్టి హితోపదేశకుఁ డెటువంటి దయాళువు
అట్టె తాళ్లపాకన్నమాచార్యులు ॥ పల్లవి॥

పచ్చి తామసుల మమ్ముఁ బరమసాత్త్వికులఁగా
యిచ్చటనె సేసినాఁడు యెంత చిత్రము
యిచ్చగించి మా కులాన నెన్నఁడులేని వైష్ణవ
మచ్చముగాఁ గృపసేసె నన్నమాచార్యుఁడు ॥ఎట్టి॥

ముదిరిన పాపకర్మములు సేసినట్టి మమ్ము
యెదుటఁ బుణ్యులఁజేసె నెంత సోద్యము
కదిసి యే జన్మానఁ గానని సంకీర్తన
మదన నుపదేశించె నన్నమాచార్యుఁడు ॥ఎట్టి॥

గడుసుఁదనపు మమ్ముఁ గడు వివేకులఁ జేసి
యిడుమ లెల్లాఁ బాపె నే మరుదు
నడుమనె యెన్నఁడుఁ గానని శ్రీవేంకటనాథు
నడియాలముగ నిచ్చె నన్నమాచార్యుఁడు ॥ఎట్టి॥

**అవతారిక:**

తన తాతగారైన అన్నమాచార్యులవారిపై కీర్తన వినిపిస్తున్నారు తాళ్ళపాక చినతిరుమలాచార్యులవారు. మాకులములో యెక్కడా లేని వైష్ణవమును మాకు అచ్చముగా కృపచేశారయ్యా ఆయన అని అంటున్నారు. ఎందుకంటే జన్మత: అన్నమయ్య శైవులు. ఓంనమో వేంకటేశాయ అనే అష్టాక్షరీమంత్రాన్ని హితోపదేశంగా చేశారు. ఎంతదయాళువు ఆయన తాళ్ళపాక అన్నమాచార్యులు!! అని కీర్తిస్తున్నారు.





మేము తామసులం, పాపకర్మిష్ఠులం, గడుసుదనం కలవాళ్ళం. మమ్మల్ని కూడా శ్రీవేంకటేశుని దాసులు చేశారు, ఆ స్వామిని అడియాలముగా మాకిచ్చారు అని అంటున్నారు. అంటే యేమిటో...

**భావ వివరణ:**

అట్టె (అదిగో) ఈ తాళ్ళపాక అన్నమాచార్యులవారు, యెటువంటి హితబోధకుడు!! యెంతటి దయామయుడు!!

మేము జన్మత: పరమ తామసులము. అటువంటి మమ్ము ఇక్కడే పరమసాత్వికులను చేశాడాయన. ఎంత చిత్రంగా వున్నది!! మేము పుట్టుకతో శైవులము. మా కులములో విష్ణువును సేవించటం యెన్నడూ లేదు. అటువంటిది, ఇచ్చగించి (ఇష్టపూర్వకంగా) వైష్ణవాచార్యులుగా మారి, మాకు శ్రీమన్నారాయణుని అచ్చముగా అందించారు ఈ అన్నమాచార్యులవారు. ఇంతకంటే యేమి కావాలి చెప్పండి?

మేము పాపకర్మలు చేయటంలో ముదిరిపోయాం (అలవాటుగా మారిపోయాము)-అటువంటి మమ్మల్నే చినతిరుమలాచార్యులవారిగాను, పుణ్యాత్ములుగానూ చేశారు. ఎంత చోద్యం!! కదిసి (మాకుదగ్గరయై) ఏ జన్మలోనూ ఎరుగని సంకీర్తన మదనను (సంకీర్తనా వసంతశోభను) మాకు ఈ అన్నమాచార్యులవారు ఉపదేశించినారు. మేమెంత అదృష్టవంతులం!!

మేము స్వతహాగా గడుసుదనముగలవాళ్ళం. (మొండితనంగలవాళ్ళం). అటువంటి మమ్మల్నే వివేకవంతులను చేసి అన్నమాచార్యులవారు మా ఇడుములన్నీ బాపె (కష్టాలన్నీ తీర్చినారు). నడుమనే (మా మధ్యలోనే) ఏనాడూ ఎవ్వరికీ దర్శన భాగ్యం ఇవ్వని ఆ శ్రీవేంకటేశ్వరుని ఈ అన్నమాచార్యులవారు, మాకు అడియాలము (మకుటము)గా ఇచ్చారు. అందుకే మేము కూడా 'శ్రీవేంకట' మకుటంతో కీర్తనలు చెప్పి తరిస్తున్నాము.

సంపుటి: 10-1 కీర్తన : ఎంతలేదిదియెంచిన
సంఖ్య : 10 పుట : 6 రాగం: గుజ్జరి

### గుజ్జరి

78. ఎంతలే దిది యెంచిన
సంతోషించని సంసారంబు ॥ పల్లవి॥

యేలకొ నేఁ డీదేహి
ఆలరి భోగము లడిగీఁగాక
చాలించఁగఁ జాలఁడు
కోలుముందు హరిఁ గొలువఁగరాదా ॥ఎంత॥

యెందైనను యీమనసు
పందదనంబునఁ బారీఁగాక
ముందరికోరిక మువుఁగదు
కందువ శ్రీవిభుఁ గానఁగరాదా. ॥ఎంత॥

విడువనితగు లీవేడుక
తొడిఁబడ నెందవైన దొరసీఁగాక
కడగని శ్రీవేంకటనాథు
బడిబడిఁ దిరుగుచు బ్రదుకఁగరాదా. ॥ఎంత॥

**అవతారిక:**

'ఎంతలేదు' అంటే ఎంతైనావున్నది అని అర్థం. ఆలోచించిచూస్తే ఈ సంసారం ఎంతకైనా తగినదే. దీంట్లో సంతోషించనివారే కానీ తృప్తిగా ఆనందంగావుండేవారు లేరు అంటున్నారు, చినతరుమలయ్య. దీంట్లోని వేడుకలన్నీ ఎన్నటికీ వదలని 'తగులు' (లంపటాలు). అవి తొడబడనెందైన దొరసీగాని అంటున్నారు. అంటే విచలితులనుచేసి ఎన్నటికీ విడువలేని స్థితికి తీసికొనిపోతుంది. ఈ వెధవ పీకులాట బదులు ఆ వేంకటేశ్వరుని





నమ్ముకోరాదా? బ్రతికిన నాలుగురోజులు హాయిగా బ్రతుకరాదా? అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ మానవులారా! ఎంచిన (ఆలోచించిచూస్తే) ఈ సంసారము యెంతలేదు? (యెంతటికైనా తగినదే). పోనీ ఇది సుఖమయం అనుకొందామా అంటే, కాదు. ఇది సంతోషించని (సంతోషమే లేని) సంసారము.

ఈ శరీరంలోవుండే దేహి (ఆత్మ) ఏలకో ఆలరిభోగము లడిగీ (ఎందుకనో చిలిపి భోగములనే కోరుకొంటాడు). నేడు చాలించగ జాలడు, (ఈరోజునుంచి నాకు ఈ భోగాలు చాలు, ఇకవద్దు అని మాత్రం అనడు). దీని బదులు ముందుగానే శ్రీహరిని శరణువేడవచ్చును కదా! అదేం మాయయో చచ్చేదాకా ఆ శ్రీహరి జోలికిపోడు.

ఈ మనస్సు అనేది యెంత విచిత్రమైనది!! ఇది పందదనంబున (పిఱికి తనంతో) యెందైననూ బారీ (ఎక్కడికైనా పారిపోతుంది) కాని, దీనికి నిలబడి కష్టాలనెదుర్కొనే ధైర్యం లేదు. తీరని కోర్కెలతో ఇట్లాగే కోరికలతో సతమతమవుతుందికాని, ముందరి కోరిక మువుగదు (పరము గురించిన ఆలోచనలనే రానీయదు). ఈ మనస్సు చేసే మాయాజాలంలో మగ్గే బదులు, కందువ (సామర్థ్యంతో) శ్రీపతిని దర్శించరాదా? మనశ్శాంతి పొందరాదా?

మిత్రులారా! ఈ వేడుకలున్నాయి చూశారా, ఇవి విడువని తగులు (విడిచిపెట్టని పెట్టలేని పీకులాట. ఒక్కసారి వీటిని అనుభవించామంటే తొడిబడన్ (విచలతులమయ్యేట్లు) చేస్తుంది. ఎందైనా దొరసీ (ఎన్నటికీ విడువలేని స్థితికి తీసికొనిపోతుంది). మరి దారేమిటి? ఈ వెధవ పీకులాట బదులు, కడగని (వీటిని అంతము చేసికొని) శ్రీవేంకటేశ్వరుని, బడిబడిదిరుగుచు (వెంటవెంట తిరుగుతూ) బ్రతుకరాదా!

సంపుటి: 10-1 కీర్తన : నీవు గలిగిన జాలు నిక్కము అన్నీ గలవు
సంఖ్య : 46 పుట : 26 రాగం: రామక్రియ

## రామక్రియ

79. నీవు గలిగినఁ జాలు నిక్కము అన్నీఁ గలవు
ఆవల మాయాచార్యుఁ డానతిచ్చెనయ్యా ॥ పల్లవి॥

యేలోకమున నున్న యెడయనిసొమ్ము నీవె
తాలిమి యెందుఁ బోని ధనము నీవె
కాలముకడా తరగని ధాన్యము నీవని
ఆలించి మాగురుఁ డిట్టె ఆనతిచ్చెనయ్యా ॥నీవు॥

యెందెందుం దిరిగిన యేలికవు నీవె
నిందలేనియట్టి తోడునీడవు నీవె
ముందువెనకల నిల్లు ముంగిలియు నీవె యని
అందముగ దేశికుఁడె ఆనతిచ్చెనయ్యా ॥నీవు॥

యెన్నఁడుఁ గలఁగనట్టి హితుఁడవు నీవె
పన్నినట్టె వుండె నిచ్చపంటా నీవె
నన్నుఁ గాచే శ్రీవేంకటనాథుఁడ వని తాళ్లపా
కన్నమయ్యగారె నాకు నానతిచ్చిరయ్యా. ॥నీవు॥

**అవతారిక:**

ఈ కీర్తనద్వారా తన గురువు (ఆచార్యుడు) స్వయంగా తన తాతగారైన అన్నమాచార్యులవారేనని చెబుతున్నారు, చినతిరుమలయ్య. తాతగారి పెంపకంలో పెరిగి తామసుడనైన తాను సాత్త్వికునిగామారేనని ఆయనే వేరొక కీర్తనలో చెబుతారు. నన్ను గాచే శ్రీవెంకటనాథుడవని తాళ్ళపాక అన్నమయ్యగారె నాకు ఆనతిచ్చారయ్యా అని పేర్కొంటున్నారు. అన్నట్లు దేశికుడు అంటే గురువుగారని అర్థం.





**భావ వివరణ:**

ఓ దేవదేవా! నిక్కము (ఇది నిజము). నీవు గలిగిన జాలు (నీవు లభ్యమైతే ఇకచాలు). అన్నీ గలవు (సర్వమూ లభిస్తాయి). ఆవల (ఆనాడు) మా ఆచార్యుడు (గురుదేవులు) ఆ విధముగా ఆనతిచ్చిరి (ఆజ్ఞాప్రబోధము చేశారు).

నీవు ఏలోకములోనున్నా, యెడయని సొమ్మువు (తొలిగిపోని ఆభరణానివి). నీవు ఎందుబోని తాలిమి ధనము (ఎక్కడికీ పోని ధైర్యము అనే ధనము) నీవు ఎంత కాలము తినినా తరగని ధాన్యమువంటివాడవు. ఇదంతా వేరెవరో చిన్నా చితకావాడు చెప్పలేదు. స్వయంగా మా గురువు మా సంగతులన్నీ విని ఇదే మంచి తరుణోపాయమని సెలవిచ్చారు.

ఎందెందు తిరిగినా (మేము ఏ రాజ్యం వెళ్ళినా) యేలికవు నీవే. నిన్ను వుల్లంఘించి మేమెక్కడికి పోగలము? నీవు నిందలేనియట్టి తోడు నీడవు. (నీ ఆశ్రయంలో వుంటే యెవ్వరికీ యే నిందారాదు). ప్రభూ! నీవు ఇట్లు ముంగిలివి (ఇంటి మధ్య ప్రదేశానివి). అయితే విచిత్రంగా ఆ ఇంటికి ముందు భాగమూ నీవే, వెనక భాగమూ నీవే. (అంటే మా ఇంట్లో అణువణువునా వున్న రక్షకుడు నీవే), ఈ విషయం మా దేశికుడు (ఆచార్యుడు) చక్కగా సెలవిచ్చారు.

స్వామీ! నీవు యెన్నడున్ కలగని (వెనుకంజవేయని) హితుడవు (స్నేహితుడవు). మిగతాహితుల మాదిరి అవసరానికి మొగము చాటువేయవు. నీవు పన్నినట్టే వుండే నిచ్చపంటవి. (మేము ఆశించినట్లే పుష్కలంగా పండే అందులోనూ నిత్యమూ పండే పంటవు నీవే.) నన్ను రక్షించే శ్రీవేంకటేశ్వరుడు నీవే, ఈ విధంగా మా తాతగారు తాళ్ళపాక అన్నమాచార్యులు సెలవిచ్చారయ్యా! అందుకే మేము నీదాసులం అయ్యాము తండ్రీ!

సంపుటి: 10-1 కీర్తన : ఎవ్వరు చెప్పినా మనసేల మానును
సంఖ్య : 8 పుట : 5 రాగం: దేవగాంధారి

## దేవగాంధారి

80. ఎవ్వరుచెప్పినా మనసేల మానును
యివ్వలవ్వలౌఁగాక యేలమానును ॥ పల్లవి॥

కమ్ముకొన్న యింద్రియాలు గారడించఁగా జీవుఁ
డెమ్మెలఁ బొరలక మరేల మానును
యిమ్ములేనికోరికలు యెక్కెక్కు లాడఁగాను
వుమ్మడికర్మాలు సేయ కూర కేల మానును ॥ఎవ్వరు॥

పేరడిమదములెల్లా పెనగొనఁగా నొరుల
నీరసించ కీ దేహి యేలమానును
తీరనిచలము లివి తెలివి చెరుచఁగాను
యేరవెట్టుకొని యుండ కేలమానును ॥ఎవ్వరు॥

వుడివోనియాసలు వొత్తుకోలుసేయఁగాను
యిడియక యీప్రాణుఁ డేలమానును
కడువేగ శ్రీవేంకటనాథుఁడు గావఁగా
నెడయక కని మన కేలమానును. ॥ఎవ్వరు॥

**అవతారిక:**

ఆలోచనకి కేంద్రం మనస్సు. ఆశ దీని బలహీనత. వాటివల్ల కోరిక పుడుతుంది. అది తీరక వేదన కలుగుతుంది. అది చివరికి మృత్యువు క్రింద పరివర్తితమై తీరుతుంది. మనస్సుకున్న ఇంకొక దుర్గుణం ఏమిటంటే, ఇది ఎవ్వరి మాటావినదు. ఇవ్వలవ్వలవటం అంటే ఇటూ అటూ అయిపోవటం. అంటే తత్తర జెందటం. ఈ మనస్సు మనిషిని తత్తరజెందేట్లు చేస్తుంది. ఇక మనస్సు చేత పీడించబడే మానవుడికి ఆ





తిరుమల శ్రీవేంకటనాథుడు తప్ప ఇంకా రక్షించేవాడెవరు? అంటున్నారు చినతిరుమలాచార్యులవారు.

**భావ వివరణ:**

మన మనస్సు చాలా మొండిది. అది యెవ్వరు చెప్పినా (మంచి బోధించినా) ఏల మానును? ఎందుకు మానివేస్తుంది? ఇవ్వల అవ్వల ఔగాక (ఇటూ అటూ తత్తరజెంది కలతపడుతుందేకాని) యేలమానును (యెందుకు మానివేస్తుంది?

ఈ జీవుడున్నాడే... వాడి ఇంద్రియాలు వాడిని కమ్ముకొని (ఆక్రమించుకొని) గారడించి (గారడీచేసి) ఎమ్మెల బొరలించును (విలాసాలలో పొర్లిపోయేట్లు) చేస్తాయి. మరి మనస్సు ఆ అనుభవాలను యెందుకు మానివేస్తుంది? ఇమ్ములేని కోరికలు (తీరని వాంఛలు) యెక్కెక్కులాడు (రోజు రోజుకీ పెరుగుతూనే వుంటాయి. అటువంటప్పుడు ఈ జీవుడు ఉమ్మడి కర్మలు సంచిత, ఆగామికర్మలు) చేయకుండా, ఏల మానును? మరివాడి కర్మకి యెవరేం చేస్తారు?

ఈదేహి వున్నాడే... వాడిని పేరడిమదములెల్లా పెనగొను (విజృంభించిన మదము ఆక్రమిస్తుంటుంది). అప్పుడు వాడు అందరినీ నీ (ని)రసిస్తూనేవుంటాడు (తిరస్కరిస్తుంటాడు). ఏలమానును (అట్లావుండక యెందుకుమానుతాడు?) ఆ దేహికుండే అంతులేని చలము (మత్సరము) వాడి తెలివిని (ఇంగిత జ్ఞానమును) హరించగా, వాడు యేరువెట్టుకొనియుండు (తానే అధికుడనని కలివిడిలేక వుంటాడు). అట్లుగాక యేలమానును? (ఎందుకు మానివేస్తాడు?)

ఈ ప్రాణులు వున్నారే... వీళ్ళని వుడివోని ఆసలు (తీరని ఆశలు) వొత్తుకోలుసేయు (ఒత్తిడిచేస్తూనే వుంటాయి). అటువంటప్పుడు వాళ్ళు, ఇడియక (చీలిపోక) యేలమానును (యెందుకుంటారు?) మరి ఇక దారి యేమిటండీ... అంటే, శ్రీవేంకటేశుని శరణు అనండి. అప్పుడు ఆయన కడువేగ (వెనువెంటనే) కావగా (రక్షించగా) ఈ మనస్సు, కని (ఆయనను దర్శించి) యెడయక (ఎన్నడూవిడిచిపెట్టక) మనును (వుంటుంది). ఏలమానును (ఇంకా యెందుకు మానదు?) తప్పక మానివేస్తుంది.

సంపుటి: 10-1 కీర్తన : చలమె చెల్లించుకొన్న సతులాల
సంఖ్య : 28 పుట : 16 రాగం: గుజ్జరి

## గుజ్జరి

81. చలమె చెల్లించుకొన్న సతులాల
సులభమా మీతో పొందు సుతులాల ॥ పల్లవి॥

వ్రతి నైన యతి నైన వలలమాటలఁ బెట్టి
బతిమి చెరుతురుగా బంధువులాల
హితవరుల వలెనె యింత నంత నెలయించి
తతి గొందురుగా ధనధాన్యములాల ॥చలమె॥

పెద్దనైన పిన్ననైన పెలుచుఁదనమె రేఁచి
కొద్ది మీరించిన కామక్రోధములాల(?)
అద్దొ యెంత విరక్తు నైనా విషయాలకె
దిద్దితిరిగా పంచేంద్రియములాల ॥చలమె॥

ముని నైన ఋషి నైన మోహమె పెంచి మరపి
మొనసితిరిగా యిల్లు ముంగిళ్ళాల
ఘనుఁ డైన శ్రీవెంకటనాథుపాదములు
చనవునఁ జూపితి రాచార్యులాలా. ॥చలమె॥

(చినతిరు - అధ్యా - 28 సంకీర్తన.)

**అవతారిక:**

స్త్రీలు తమకున్న సిరిసంపదలవల్ల అహంకరించి గట్టి పట్టుదలతో వుంటారు. దానిని 'చలము' అంటారు. ఎప్పుడూ దానిని చెల్లించుకోక మానరు. అట్లాగే కొడుకులతో పొందు (కలిసివుంటే) అనేక ఇబ్బందులు తెచ్చిపెడుతుంది. వాటితో వేగటం అంతసులభమా?... అంటున్నారు చినతిరుమలయ్య. ఆరువందల సంవత్సరాలక్రితం అదీ పరిస్థితి అయితే, నేటి





నవీన భారతావని గురించి చెప్పేది యేముందండీ? "కొద్దిమీరించిన కామ క్రోధాలు, పెద్దనైన పిన్ననైన పెలుచుదనమె రేచి" అంటున్నారు చినతిరుమల. ఏదో అర్థమయ్యీ కానట్లు వుందికదా! భావవివరణ చదవండి మరి.

**భావ వివరణ:**

ఓ సతులాల! (భార్యామణులారా!) మీరు చలమె చెల్లించుకొన్న (మీ మొండిపట్టుదల నెగ్గించుకొన్న) ఘనులు. ఓ సుతులాల (కొడుకుల్లారా!( మీతో పొందు (కలిసివుండటం) సులభమా (అంత తేలిక అయిన పని అనుకొన్నారా?)

ఓ బంధువుల్లారా! మీరు వ్రతదీక్షాదక్షుడినైనా, యతీంద్రుడంతటివాడినైనా మీ వలలమాటల (మాయమాటలతో బాగా చెడగొడతారు). ఓ ధనధాన్యములారా! మీరు హితవరుల వలె (మేలుచేసేవాళ్ళవలె) యింతనంత నెలయించి (ఇంతా అంతా అహంకరింపించి) తతి గొందురుగా (విఱ్ఱవీగేట్లు చేస్తారు). దానివల్ల మనిషి చెడకుండా వుంటాడా?

ఓ కామక్రోధములారా! మిమ్మల్ని కొద్దిమీరించిన (కొద్దిగా వుండక పెట్రేగిపోయేట్లు చేస్తే) మీరు, పెద్దవాళ్ళనైనా చిన్నవాళ్ళనైనా పెలుసుదనమేరేచి (అతిశయంతో కఠినులయేట్లు చేస్తారు.) ఓ పంచేంద్రియములారా! (కన్ను, ముక్కు, చెవి, నోరు, చర్మం) అద్దో (అదిగో) మీరు యెంత విరాగినైనా విషయాలకే దిద్దితిరిగా (విషయలోలుడవునట్లు మారుస్తారు కదా!) ఎంత దుర్మార్గులు!!

ఓ ఇల్లు ముంగిళ్ళలారా! మీరు మునినైనా ఋషినైనా మోహభరితుల్నిచేసి, మరపిపెంచి (వారికి గతంలో వారి స్థితిని మఱచిపోయేట్లు చేసి) మొనసితిరిగా (పూనుకొంటారు కదా!) అటువంటి దుస్థితిలో మా ఆచార్యులు (మా గురుదేవులైన మా తాత అన్నమాచార్యులవారు) చనవున (ప్రేమతో) ఘనుడైన శ్రీవేంకటేశ్వరుని పాదములు జూపితిరి (చూపించారు). ఓ గురుపుంగవులారా! మీరు చేసిన మేలును మరువలేను.

సంపుటి: 10-1 కీర్తన : ఏలికవైన నన్నొకని నేలగాను నీ
సంఖ్య : 34 పుట : 18 రాగం: దేసాళం

## దేసాళం

82. ఏలికవై న న్నొకని నేలఁగాను నీ
లీలావిభూతి కొకలేశము దక్కువా ॥ పల్లవి॥

పని పూని నాయొకనిపాపము మానుపఁగా నీ
ఘనసంకల్పమునకుఁ గడమా
చెనకి నేనె పూజ సేయఁగా మెచ్చే నంటె
కనుకొనే వందేమి కండ గట్టుకొంటివో ॥ఏలిక॥

దేవుఁడవై నామనసు దెరిచి రక్షించఁగాను
గోవింద నీమాయ కేమి గొఱతా
సోవల నాలోని భక్తి చూచి కాచే నంటివా
కావలసి నీవెంత గాదెఁ బోసుకొంటివో ॥ఏలిక॥

అలరి నాహృదయమునందుఁ గానుపించితేను
వెలయ నీమహిమకు వెలితా
కలిమితో నన్ను శ్రీవేంకటనాథ కూడితివి
యిలమీఁద నీకు నిప్పు డెంత కీర్తి గూడెనో. ॥ఏలిక॥

**అవతారిక:**

తనతాతన అన్నమాచార్యులవారి కీర్తనలు చదివి, చదివి జీర్ణించుకొనిన మనుమడు చినతిరుమలయ్య కూడా అటువంటి కీర్తనలే రచించినాడనుటకు ఈ కీర్తన గొప్ప ఉదాహరణ. ఆయన అన్నమయ్య కీర్తన 'నేనొక్కడలేకుండితే నీ కృపకు బాత్రమేదీ' (అన్న. అధాత్మ 8 సంపుటి - 49వ కీర్తన) అనేదాన్ని ఎన్నోసార్లు చదివి ఆకళింపుచేసుకోవడం వలన ఇటువంటి కీర్తనలు వెలుగులోకి వచ్చివుంటాయి. 'నన్నొక్కణ్ణి రక్షిస్తే నీ





సొమ్మేంపోతుందయ్యా? నీలీలా విభూతి ఒక్కలేశమైనా తక్కువవుతుందా? నాకు కనిపించినంతమాత్రాన నీ మహిమ కొచ్చిన వెలితియేమిటయ్యా వెంకటనాథా'! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! యేలికవై నన్నొక్కడిని యేలగాను (రక్షించినంతమాత్రాన) నీ లీలావిభూతికి (నీలీలావైభవ ప్రదర్శనకు) ఒక్క లేశము దక్కువా? (కొంచెమైనా తరుగువస్తుందా) చెప్పవయ్యా! స్వామీ!

ప్రభూ! నీసంకల్పానికి తిరుగులేదు. నిజమే అదిఘనమైనదే... కానీ పనివేళా నావొక్కడి పాపము మాన్పినంతమాత్రాన నీసంకల్పానికి యేమన్నా నష్టమా? చెనకి (అందరినీ కాదని) నావొక్కడిపూజను మెచ్చుకొని స్వీకరించినంతమాత్రాన నీకు పోయేదేముంది స్వామీ? కనుకొనే వందేమి కండగట్టుకొంటివో? (దానికోసం నీవు నీకండల్ని కరిగించుకోవాలటయ్యా?) ఎంత సునాయాసంగా నా పూజలు స్వీకరించవచ్చును?

ఓ గోవిందా! నీమాయ దాటరానిది. అది జగద్విదితమైన విషయమే కదా! కానీ నీవు దేవుడవు, నేను అజ్ఞానిని. నా మనసుదెరిచి (నాకు జ్ఞానం ఇచ్చి) రక్షించినంతమాత్రాన నీ మాయకు వచ్చిన లోపం యేమిటయ్యా? సోవల (ఋజువైన) నా భక్తిని చూచి నన్ను కాచేనంటివా (రక్షిస్తానంటే) కావలసినంత వున్నట్టి నీ దయ అనే గాదెలో (ధాన్యాగారంలో) గాదెబోసుకొంటివో (ధాన్యం తరిగిపోతుందటయ్యా! కాస్త దయచూపిస్తే చాలు కదటయ్యా!

ఓ మహానుభావా! నాహృదయంలో అలరి (నెలకొని) అందు గానుపించితే (నా హృదయంలో దర్శనమిచ్చినంతమాత్రాన, ఇదివరకే యెంతో మందికి, యెన్నో విధాలుగా, యెన్నోసార్లు నిరూపింపబడిన నీమహిమకు వచ్చిన ఇబ్బందేమిటయ్యా! ఇప్పుడు చూడు నీ కృప అనే కలిమితో (సంపదతో) నన్ను కూడితివి (నావాడివియైనావు.) ఓ శ్రీవేంకటేశ్వరా! ఇప్పుడు చూడు నీకీర్తి ఈ యిలమీద (భూమిమీద) యెంత ప్రసిద్ధి చెందుతుందో!!

సంపుటి: 10-1 కీర్తన : పంకె లేక తలచిన జాణలకు
సంఖ్య : 20 పుట : 11 రాగం: మలహరి

## మలహరి

83. సంకె లేక తలచిన జాణలకు
సంకీర్తనమె పో సర్వశాంతి ॥ పల్లవి॥

భవహర మగుశ్రీపతినామమె
జపకట్టి తలంచితే జన్మశాంతి
తవిలి హరిపూజ తాఁ జేయుటె
కువలయమున నిదిగో గృహశాంతి ॥సంకె॥

అంది ధ్రువవరదుఁడ యనినదె
కందు వైన సర్వగ్రహశాంతి
యిందురవినయనుని నెరుఁగుటె
చందమైన దిదివో నక్షత్రశాంతి ॥సంకె॥

భావించి యనంతునిఁ బలుకుటె
కావించిన దిదివో కాలశాంతి
శ్రీ వెంకటనాతునిఁ జేరుటె
దేవమానవులకును దేహశాంతి ॥సంకె॥

**అవతారిక:**

'సంకెలేక' అంటే అసంఖ్యాకమైన అని భావించ రాదు 'శంకలేక' అంటే ఏమాత్రం అనుమానం లేక, తలచిన (ధ్యానించిన) జాణలకు సర్వ శాంతికరము సంకీర్తనయేపో - అంటున్నారు చినతిరుమలాచార్యులవారు. ఆ శ్రీహరినామం జన్మశాంతికరము, గృహశాంతికరము, గ్రహశాంతికరము, నక్షత్ర శాంతికరము, కాలశాంతికరము, దేహశాంతికరము అని, అదెలాగో వివరిస్తున్నారు. తాతగారి ప్రభావం మనుమడిపైనెంతుందో చెప్పటానికి ఈ కీర్తన చక్కటి ఉదాహరణ.





**భావ వివరణ:**

ఓ మానవుల్లారా! సంకెలేక (ఏమాత్రమూ, శంక కాని సంశయము కానిలేక) తలచిన జాణలకు (ధ్యానించిన నేర్పరులకు) సర్వశాంతికరము (అన్నివిధములా శాంతిని కలిగించునది) శ్రీహరి సంకీర్తనమె పో (నారాయణుని కీర్తించుటే సుమా!)

భవహారమగు (పుట్టుకనుండి విముక్తి చేయు) శ్రీపతినామమును, జవకట్టి తలంచిన (భద్రముగ ధ్యానిస్తే) జన్మశాంతి కలిగి మరుజన్మ లేకుండా పోతుంది. తాను తవిలి (ప్రయత్నపూర్వకంగా శ్రీహరిపూజ చేయుటయే కువలయవమున (ఈ భూమి మీద) గృహశాంతి. శ్రీహరినామం జపించక, వెయ్యిమంది పురోహితులతో ఎట్టి 'శాంతి' చేయించినా ఫలితం పెద్దగుండుసున్నా అని గ్రహించండి.

బ్రాహ్మణోత్తములను నియోగించి, నవగ్రహాలకు శాంతి జరిపించుకొంటే కలిగే మేలు బహుస్వల్పం. ఆ శాంతి, అశాంతి కాకూడదనుకొంటే దానితో పాటు అంది (పూనుకొని) ధ్రువవరదుడ (ధ్రువుని అనుగ్రహించినవాడా! (అని అనండి. అదే, కందువైన (సమర్థవంతమైన) గ్రహశాంతి చేస్తుంది.

కొంతమంది నక్షత్రశాంతి చేయించుకొంటారు. కాని నందనందనుని స్మరించరు. అదెంత తెలివిలేని పనియో చూడండి. ఇందు రవి నయనుడు (చంద్రుడు సూర్యుడు తనకన్నులుగా గల) శ్రీహరిని తెలిసికొనుటయే, చందమైన (చక్కటి) నక్షత్రశాంతి. ఇంకొకటి లేదు.

కొంతమంది మాకు కాలం బాగుగా లేదు (మా 'టైమ్' బాగోలేదండీ) అని రక్షరేకులు యంత్రాలు కట్టించుకొంటారు. అదీ దబ్బుదండగ పనియే. భావించి మనస్ఫూర్తిగా అనంతుని పలుకుటే (ప్రార్థించుటే) గొప్పకాలశాంతి. మన బాగోగులు ఆయనే చూసికొంటాడు. దేవతలకు మానవులకు దేహములిచ్చిన దేవదేవుడు శ్రీవేంకటేశ్వరుడు. ఆయనను చేరి కీర్తించుటయే గొప్ప దేహశాంతి. అదిగాక ఇంకేదైనా పనికిమాలినదే.

సంపుటి: 10-1 కీర్తన : అందుకేమి దోసమా అయితే నేమి
సంఖ్య : 119 పుట : 69 రాగం: సాళంగనాట

## సాళంగనాట

84. అందు కేమి దోసమా అయితే నేమి
కందు వై లోకములోనఁ గలదే కాదా ॥ పల్లవి॥

వలచి యిందిరాదేవి వన్నెలుఁ జక్కఁదనాలు
వలఁపులో నేపొద్దూఁ దలపోయఁగా
సలిగెతోడుత నాపె సారూప్య మందినట్టు
నలు వై గోవిందుఁడే నారాయణి యాయను ॥అందు॥

బాలకియై లకిమమ్మ పై పై శిగ్గువడఁగా
తేలించి యాపె మనసు తెలియఁ బూని
చాలా వేడుక నాకె సకియె యుండినటు
ఆలికిఁ గా భువనమోహనరూప యాయను ॥అందు॥

యెడయ కింతులలో మే లెల్లాఁ దెలియఁ బూని
కడఁగి యాఁదురూపము గైకొని చూచి
బడినె తనకు నెందూఁ బతిలేనివాఁడు గాన
కడ గోవిందుఁడే శ్రీవెంకటనాథుఁ డాయను ॥అందు॥

**అవతారిక:**

వైరాగ్య కీర్తనలు చెప్పటంలో దిట్ట అయిన చిన తిరుమలయ్య చెప్పిన సరసశృంగారకీర్తనను మచ్చుకి అందిస్తున్నాను ఆస్వాదించండి. ఈ లోకంలో భర్త భార్యపై వలపుతో సారూప్యమందుట సామాన్యమే. అందుకే మెరుపులోని తటిల్లత వలె మెరిసే పైడిబొమ్మ ఇందిరాదేవి నల్లని వేంకటేశునితో సారూప్యస్థితిని బొంది నల్లని నారాయణి అయింది, అంటున్నారు. అయితేనేమి? అందుకేమి దోసము? అని సమర్థిస్తున్నారు.





తినబోతూ రుచి అడుగుట దేనికి? భావవివరణ చదివి పరవశించండి. పులి కడుపున మేకపుడుతుందా? ఈయనెవరు? అన్నమయ్య మనుమడు కదా! అన్నట్లు... "ఆరు నెలలు సావాసం చేస్తే... వారు వీరవుతా"రనే సామెత వుంది దాన్నే ఇంకొకలాగా చెబుతున్నారు.

**భావ వివరణ:**

ఓ మానవులారా! అందుకేమి దోసమా? (అందులో తప్పేముంది?) అయితేనేమయింది? కందువై (గొప్పగా) లోకంలో, గలదేకాదా (జరుగుతున్నదే కదా!) కాదంటే నేను చెప్పేది వినండి.

ఇందిరాదేవి (లక్ష్మీదేవి) వన్నెలు చక్కదనాలు చూచి ఈస్వామి వలచినాడు. ఏపొద్దూ (ఎప్పుడూ) ఆమె వలపులో, ఆమెనే తలపోయగా (ఆలోచనలలో నిలుపుకోగా) సలిగెతోడుత (చనువుకొద్దీ) ఆమె ఈయనతో "సారూప్యమోక్షము" చెందిందా అన్నట్లు, నలువై (నల్లనైన) ఈ గోవిందుడే నారాయణి అయింది. అందుకే ఆమే నల్లని నారాయణి.

ఈస్వామికి ఆ"లకిమమ్మ" (లక్ష్మమ్మ) తననెంత ప్రేమిస్తోందో తెలుసుకోవాలనే కోరిక కలిగింది. ఆమెయేమో బాలకి (యవ్వనంలోవున్న తరుణి). ఆమెకు పైపై సిగ్గులు సహజమే. తేలించి (వాటిని అలావుంచి) ఆమె మనసు తెలియబూని, చాలా వేడుకతో (కుతూహలంతో) ఆమె సకియ (చెలికత్తెలాగా మారి ఈయన ఆమెతోనే తిరిగాడు. అందుకనే ఆమె భువనమోహన రూప అయింది.

ఇదేదో బాగుందని... కృష్ణయ్య అయినప్పుడు, తన ఇంతులలో (అష్టభార్యలలోని) మేలెల్లా (మంచినంతా) తెలుసుకొందామని, కడగి (పూనుకొని) అనేక పర్యాయములు ఈయన సుందరీమణుల రూపాలు ధరించి వుంటాడు. బడినె (వెంటనే) ఈయనకు కూడా యెక్కడా, పతిలేనందువల్ల (సాటిలేనందువలన) ఆ గోపాలకృష్ణుడే ఈ శ్రీవేంకటేశ్వరుడై ఇట్లా అందాలు చిందిస్తున్నాడు. చూచి తరించండయ్యా! మీ జన్మకింకేమి కావాలి?

సంపుటి: 10-1 కీర్తన : కుడువనికుడుపులు కొనసాగె మమతలు
సంఖ్య : 19 పుట : 11 రాగం: లలిత

**లలిత**

85. కుడువనికుడుపులు కొనసాగె మమతలు
కడువేగ శ్రీహరిఁ గానఁగవలదా ॥ పల్లవి॥

నమలక చవులయ్యె నాతుల సుద్దులు
అమర చింతకాయలవంటివి
భ్రమసి కొరుకఁబోతె పండ్లు పులుసును
తెమలక శ్రీహరిఁ దెలియఁగ వలదా ॥కుడు॥

విచ్చుక మెరుఁగులు విడివడ్డ వలపులు
పచ్చి మేడిపంటి భావమువి
మెచ్చి లోను చూడ మొదలుపురువులె
గచ్చుల యివి మాని కనవద్దా హరిని ॥ లల ॥

బడలని పంట వో పైపైనె హరిభక్తి
కడలేని కల్పవృక్షమువంటిది
కడఁగి కొలువ శ్రీవేంకటనాథుఁడై గురి
బడినె యీతనిఁ గని బ్రదుకఁగ వలదా ॥కుడు॥

**అవతారిక:**

కుడుపు అంటే భోజనము. అది కుడువగానే రూపుమాసి పోతుంది. అవునా? కుడువకపోతే (తినకపోతే) సరే. అట్లాగే మమతలు చిరకాలం కొనసాగవు. కుడుపు కుడువకుండా వుండటం యెలా సాధ్యం కాదో మమతలు కొనసాగటం కూడా అలాగే సాధ్యం కాదు. కుడుపు ఎలా జీర్ణమైపోతుందో మమతలు కూడా మాయమైపోతాయి. అశాశ్వతమైన వాటికోసం శ్రీహరిని వదులుకోవటం ఎంత అవివేకం? అందుకనే కడువేగ శ్రీహరిన్కానగ వలదా? అని ప్రశ్నిస్తున్నారు చిన





తిరుమలాచార్యులవారు. పల్లవి అర్థం కావటానికే తలపట్టుకోవలసి వచ్చిందంటే ఈయన తాతగారివంటి దిట్టయే... సుమా! “ఏడ వలపేడ మచ్చిక యేడ సుద్దులు”... వంటి కీర్తనలే దీనికి స్ఫూర్తి అని నా భావన.

**భావ వివరణ:**

ఓ మానవులారా! కుడుపు (భోజనం) కుడువగానే కడుపులోకి మాయమైపోతుంది. ఒకవేళ కుడువకపోయినా (తినకపోయినా) పాసిపోయి పాడవుతుంది. ఈ మమతలు, అనుబంధాలూ కొనసాగి ఒకనాటికి మాయమైపోతాయి. ఒకవేళ అవి కొనసాగినా మన ఆయుర్దాయం కొనసాగక అవి యెలాగైనా అంతమవుతాయి. అందుకనే కడువేగ (శీఘ్రముగా) శ్రీహరిని కానగవలదా (శరణు అనవద్దా?).

నాతుల సుద్దులు (స్త్రీల తీపికబుర్లు) నమలకుండా వువ్విళ్ళూరే రుచులువంటివయ్యా! కనిపించే చింతకాయలవంటివి. చింతకాయ రంగును చూచి తియ్యగా వుంటుందనుకొని భ్రమపడి నమిలితే మీ పండ్లు పులిసిపోతాయి. అవునా? అట్లాగే ఆడువారి అమాయకమైన, అందమైన మాటలను విని వారిప్రేమలు నిజము, నిత్యము అనుకొంటే దెబ్బతింటావు. ఆ భ్రమతో తెమలక (చలించక) శ్రీహరిని తెలుసుకోవద్దా?

విడివడ్డవలపులు (ఎడబాటు తరువాత ప్రేమ) యెన్నటికీ కొనసాగదు. అవి విచ్చుక మెరుగులు (మెరవని మెరుపుల్లాగ) కనబడవు. వలపులు పచ్చిమేడిపండువలె బంగారురంగులో మెరిసిపోతుంటాయి. కానీ ఆ పండ్లను విప్పి చూస్తే, మొదలు పురుగులే (మొదటినుండీ పురుగులే) వుంటాయి. గచ్చుల (బయటపడి) ఇకనైనా మానివేసి శ్రీహరిని దర్శించవద్దా?

పైపైన హరిభక్తి (సులభమైన శ్రీహరిపై భక్తి) బడలని పంట (యెండిపోని పంట వంటిది), కల్పవృక్షము వలె కడలేనిది (అంతములేనిది). శ్రీవేంకటేశుని కడగికొలువ (పూని ఆరాధిస్తే) గురియై (లక్ష్యమైన) ఆయనే అనుగ్రహిస్తాడు. బడినె (దట్టముగా) ఈతనిని గని (భావనలో దర్శించుచూ) బ్రతుకవలదా? (బ్రతుకును కొనసాగించవద్దా?).

సంపుటి: 10-1 కీర్తన : హరికి మొరవెట్టితె అన్నిపనులు లెస్సవును
సంఖ్య : 6 పుట : 4 రాగం: మలహరి

**మలహరి**

86. హరికి మొరవెట్టితె అన్నిపనులు లెస్సవును
సరవి నెన్నాళ్లని జాలిఁబడవచ్చును ॥ పల్లవి॥

యేమిసేయు నీ జీవుఁ డీ యరివర్గాలతోడ
బూమెల నెన్నాళ్లని పోరాడీని
చూమరలఁ జూడఁజూడఁ జుట్టాలవలెనె వుండి
దోమటి పంచేంద్రియాలు దోడుగాకపోయను ॥హరి॥

యెక్కడ చొచ్చీ జీవుఁ డీ కర్మపురుణములు
పెక్కువిధములఁ బిరువీకు సేయఁగా
వొక్కొక్కనాఁటి వడ్డె వొదిగీఁగాని తల
తిక్కగొన్న పాపములు దీరకె పోయను ॥హరి॥

యెవ్వరు దిక్కీ జీవుని కెంతని యీఁదఁగలఁడు
యివ్వల సంసారమనె యీ వారిధి
నవ్వుతా శ్రీవేంకటనాథుని మఱఁగు చొచ్చి
యివ్వగఁ దా దరిచేరి యిన్నియు గెలిచెను ॥హరి॥

**అవతారిక:**

ఈ జీవుడు యెంత? వీడిసామర్థ్యమెంత? వీడు అరిషడ్వార్గాలను గెలువగలడా? పంచేంద్రియాలను వంచగలడా? వీడు చేసిన కర్మల ఋణాలు తీరుతాయా? ఈ తిక్క వెధవ చేసే పాపాలు ఒక్క నాటికి పూర్తి అవుతాయా? అసలు వీడికి దిక్కెవరు? వీడు ఈ సంసారసాగరాన్ని ఈద గలడా? లేదు లేదు వీడివల్లకాదు. అదిగో ఆ ఏడుకొండలవాడే గతి అంటే... ఆయనను చేరితే సరేసరి. నాయనలారా! ఇప్పుడు ఈ అవతారిక





అంత సులభం కాదు ఈ చినతిరుమలయ్య కీర్తన. రుచి చూడండి, మీకే తెలుస్తుంది. దిమ్మ తిరుగుతుంది, నిజము. అన్నట్లు "చూమరులు" అనేమాటకు అర్థమేమిటి?

**భావ వివరణ:**

ఓ మానవులారా! శ్రీహరికి మొరబెట్టుకొంటే (బాధలను యేకరువుపెట్టుకొంటే) అన్ని పనులూ లెస్సవును (బాగుగా అవుతాయి). సరవి (ఈ క్రమములో) ఈవిధంగా యెన్నాళ్ళని జాలిబడవచ్చును? (ఖేదమునొందవచ్చును?)

ఈ జీవుడు కామక్రోధములాదిగాగల అరివర్గములతో (అంత: శత్రువులతో) యేమి చేయగలడు? బూమెల (ఆ వంచనలతో) యెన్నాళ్ళని పోరాడగలడు? వీడి పంచేంద్రియాలూ (కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము) వీడికి దోమటివి (ఆధారభూతమైనవి). చూమరులు (చూచేవారు) చూడచూడ అవి చుట్టాలవలెనే అనిపిస్తాయి. కాని అవి యెన్నటికీ వాడికి తోడుగాక పోవును.

ఈ జీవుడు గతంలోచేసికొనిన కర్మల యొక్క ఋణము యెక్కడ చొచ్చీ (యెక్కడికి పోతుంది?) అవి వాడిని అనేక విధముల పిరువీకుసేయు (పీకులాటపడునట్లు చేస్తాయి). ఒక్కొక్క నాటికీ (రోజురోజుకీ) వాడు చేసిన పాపాలకు శిక్ష వడ్డీ పెరిగినట్లు పెరిగిపోతూనే వుంటుంది. తిక్కగొన్న పాపాలు (వెర్రెత్తిన పాపములు) ఎన్నడూ తీరకపోవును.

ఈ జీవుడికి దిక్కు యెవ్వరు? వీడు ఈ సంసార వారధిని (సాగరమును) యెంతని ఈదగలడు? మరి వీడికి దారేమిటి? శ్రీవేంకటేశ్వరుని యొక్క మఱుగుజొచ్చి (అండలో జేరి) ఆయన శరణు జొచ్చితే ఆ జీవుడు అన్నిటినీ అధిగమించి నెగ్గుకువస్తాడు.

సంపుటి: 10-1 కీర్తన : ఐనదేది కాని దందులో నేది
సంఖ్య : 27 పుట : 15 రాగం: నారాయణ దేసాక్షి

## నారాయణదేసాక్షి

87\. ఐనదేది కాని దందులో నేది
నానారూపి శ్రీనాథుఁడె కాకా ॥ పల్లవి॥

యెవ్వరి దూషించె మెవ్వరి భూషించే
మెవ్వరు స్వతంత్రులిందులో
అవ్వల నివ్వల నంతరాత్ముఁడైన
య వ్వనజాక్షుని ననుటగాకా ॥ఐన॥

యెందుకుఁ గోపించే మెందుకు మెచ్చే
మెందుఁగద్దు మే లిందులో
అందు నిందుఁ దానె యల్లుకొన్న
నందనందనునే నమ్ముటగాకా ॥ఐన॥

యే చోటు మంచిది యే చోటు చెడ్డది
యే చోటు సతమౌనిందులో
కాచేటి శ్రీవేంకటనాథుఁడె
చేచేతఁ గాణాచై చెల్లించెఁ గాకా ॥ఐన॥

**అవతారిక:**

వనజాక్షుడైన శ్రీహరి తప్ప ఎవ్వరూ స్వతంత్రులు కారు. అటువంటప్పుడు ఎవ్వరిని దూషించేది? ఎవ్వరిని భూషించేది? ఎవ్వరిని కోపించేది? ఎవ్వరిని మెచ్చుకొనేది? ఏచోటు మంచిది? ఏచోటు చెడ్డది? వీటన్నింటినీ చెల్లించేదెవరు? శ్రీవేంకటేశ్వరుడే కదా! అనేక రూపములను ధరించగల ఆ శ్రీనాథుడు కాక అయినదేది? కానిదేది? అంటున్నారు చినతిరుమలాచార్యులవారు. ఏదన్నా అవ్వాలి అంటే ఆయనకే సాధ్యం. అదేపని అవకూడదు అంటే కూడా ఆయనకే సాధ్యం. అందుకే ఆ స్వామిని "ఘటనాఘటనసమర్థుడు" అన్నారు. తేలికగా కనుపించే క్లిష్టమైన కీర్తన ఇది.





**భావ వివరణ:**

ఈ సృష్టిలో అనేకానేక రూపాలున్నాయి. ఆ రూపాలలో అనేకానేక జీవులున్నాయి. దేని విశిష్ఠత దానికుంది. ఇవన్నీ తమ మనుగడ కొనసాగించటానికి కారణమేమిటి? నానారూపాలలో వాటిలో వున్న శ్రీనాథుడే. ఇందులో ఆయన అయినదేది? కానిదేది? అన్నీ... ఆ శ్రీనాథుడే.

మనచుట్టూ వుండే శత్రువుల్లోనూ మిత్రులలోనూ ఆయనేవున్నాడు. వారి అంతరాత్ముడైవున్నది కూడా ఆ శ్రీహరియే. అవ్వల (దివిలోని దేవతలలోను) ఇవ్వల భువిలోని జీవులలోనూ ఆయనేవున్నాడు. ఇక నేను ఎవ్వరిని దూసించేది (తిట్టేది) ఎవరిని భూషింతు (పొగిడేది?) అన్నీ ఆ వనజాక్షుడే (పద్మలోచనుడే) అని కీర్తించుట తప్ప ఇంకా యేమిచేయాలి?

మన పురాకృత కర్మలకి ఫలితం, దానంతట అది రాదు. ఇంకొకరి ద్వారా ఆ ఫలితం మనకు సంక్రమిస్తుంది. అదే ఆ జగన్నాథుడిమాయ. అందువలననే కొందరు మనకు మేలు చేస్తారు మరి కొందరు కీడు చేస్తారు. ఇందులో అందరూ నందనందనుడైన గోవిందుడే. మరి మనం కొందరిని కోపిస్తామెందుకు? కొందరిని మెచ్చుకొంటామెందుకు? ఇందులో మేలు దేంట్లో కద్దు (వున్నది)... దేంట్లో లేదు? మరి అందు నిందు (వారిలోనూ వీరిలోనూ) తానే అల్లుకొని (వ్యాపించి వున్నప్పుడు) ఆయనను తప్పించి ఇంకెవర్ని నమ్మగలను?

మన కర్మలననుసరించే మనకు సుఖదు:ఖాలు కలుగుతాయి. వాటిలో కొన్నిటిని భూమిమీదా కొన్నిటిని పరలోకాల్లోనూ (స్వర్గ నరలోకాలలో) అనుభవిస్తాం. ఈలోకంలో అనుభవించే మంచిని "అయినవారితోనూ" చెడుని "కానివారితోనూ" అనుభవిస్తాం. అనుభవించాక, క్షణం కూడా అక్కడా వుండము ఇక్కడా వుండము. ఏచోటూ సతమైనది (శాశ్వతమైనది) కాదు. మనల నందరిని కాచేటి (సంరక్షించే) శ్రీవేంకటేశ్వరుడే, చేచేత కాణాచి (ఈమాటకు సరితూగే మాట... (అరచేతిలో చింతామణి), ఆయనే అరచేతిలో మాణిక్యమై అన్నీ చెల్లిస్తుంటే ఇంకా చెడేమిటి? మంచేమిటి చెప్పండి.

సంపుటి: 10-1 కీర్తన : మాయలో మునుఁగ నేల మమతలేల
సంఖ్య : 42 పుట : 24 రాగం: రామక్రియ

## రామక్రియ

88. మాయలో మునుఁగ నేల మమత లేల
చేయారా దేవుఁ డీపాటి సేయ నోపఁడా ॥ పల్లవి॥

అట్టె దేహసమ్మంధ మాసపడే జీవులాల
పట్టి హరిసమ్మంధాన బ్రదుకరాదా
నెట్టన సర్వాంతరాత్మై నిలుచున్న దేవుఁ డిట్టె
చుట్టాలపక్కాలపాటి శుభ మియ్య నోపఁడా ॥మాయ॥

మోసపోక ధనధాన్యములు గూర్చే దేహులాల
వేసరక విష్ణుభక్తి వెదకరాదా
రాసి కెక్క యిందరిని రక్షించే దేవుఁడె
కాసువీసములపాటి కావ నోపఁడా ॥మాయ॥

వెలయ రాజులను దీవించే ప్రాణులాల
కల శ్రీవేంకటనాథుఁ గానఁగ రాదా
వలె నని యిందరికి వరాలిచ్చే దేవుఁ డేమి
కొలువునిలవుపాటిగుణ మియ్య నోపఁడా ॥మాయ॥

**అవతారిక:**

చిన తిరుమలయ్య కీర్తనలలో పల్లవినర్థం చేసికోవటం చాలా కష్టమవుతుంటుంది. ఈ కీర్తన చూస్తే ఆ సంగతి స్పష్టమౌతుంది. మాయలోమునుగనేల? మమతలేల? దేవుడు ఈపాటి చేయార చేయనోపడా? అంటున్నారు. మనల్ని పుట్టించి, పెంచి మనకోసం ప్రకృతిలో మనకు కావలసినవన్నీ సమకూర్చిన ఆ దేవదేవునికి ప్రతిఫలంగా మనం యేమిస్తున్నాం? రాజుకి అడుగడుగుదండాలు





పెడుతున్నాం, చుట్టాల పక్కాలకోసం ఆరాటపడుతున్నాం, కాసుల కోసం కక్కుర్తిపడుతున్నాం. శ్రీవేంకటేశ్వరుని శరణు అనమన్నా అనం. ఏమిటీ మాయ!!

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! ఈ సంసారము మిథ్య. ఇది ఈశ్వరుని మాయచే వర్ధిల్లుచున్నది. ఈమాయలో తలమునకలై పోవుటెందులకు? అక్కరకు రాని మమతల వల్ల ప్రయోజనమేమిటి? చేయార (మీ చేతులారా) ఆ దేవదేవునికి సేవచేయరాదా? మన ఈ మనుగడకే కారణమైనవాడు ఈపాటికూడా చేయతగడా?

ఓ జీవులారా! కేవలం దేహ సంబంధాల కొరకే ఆశపడెదరేల? శ్రీహరితో సంబంధం పెట్టుకొని బ్రతుకరాదా? ఇదిగో మీ నెట్టనే (యెట్టయెదుటనే) ఆ సర్వాంతర్యామి నిలచిన దేవుడైయుండగా మీరు భయపడతారేమి? ఆయన మీ చుట్టాలపక్కాలపాటి శుభము మీకు అందించలేడా?

ఓ దేహులారా! (దేహమును ధరించిన మానవులారా!) ధనధాన్యములనెంత పోగుచేసికొనినా మీరు మోసపోక తప్పదు. వాటితో వేసరక (ఇబ్బంది పడక) విష్ణు భక్తిని వెదకి కనుగొనరాదా? రాసికెక్కి (జగత్ప్రసిద్ధుడై) అందరినీ రక్షించే ఆ దైవశిఖామణి మిమ్మల్ని కాసువీసము పాటి (కాసులో పదియారవవంతు మాత్రం) కాపాడలేడా? ఎంత విడ్డూరం!!

ఓ ప్రాణులారా! వెలయ (జీవించుటకు) రాజుల్ని దీవించే మీరు ఎంత దౌర్భాగ్యులు!! దానిబదులు కల (మీ అందరిలోనూ గల) శ్రీవేంకటేశ్వరుని కానగరాదా? (దర్శించకూడదా?) ఆయన వలెనని (కావాలి అనునట్టి) ఇందరికీ కోరిన వరాలనిచ్చే దేవుడు. కొల్వునిల్వు (నిలుచుండే కొలువు) పాటి గుణము (మేలు) ఇయ్యనోపడా (ఈయలేడా?)

సంపుటి: 10-1 కీర్తన :తనకోరిక లేఁటికి నాతడె యిన్నియు గల్పించగ
సంఖ్య : 17 పుట : 10 రాగం: బౌళి

**బౌళి**

89. తన కోరిక లేఁటికి నాతఁడె యిన్నియుఁ గల్పించఁగ
అనువుగ నిందుకు యిద్దరి యత్నంబులు వలెనా ॥ పల్లవి॥

అద్దముచూచెటియాతఁ డలరుచు నవ్విన నవ్వును
అద్దములోపలినీడయు నా రీతినె కాదా
గద్దరియగు శ్రీవిభు సంకల్పంబుననె జగముల
సుద్దులు దు:ఖము సుఖమును సూటిఁబడెఁగానా ॥తన॥

నాఁటక మాడించునతఁడు నయమునఁ గదలింపంగా
నాఁటకమందలి బొమ్మలు నానాగతిఁ జెలఁగున్
ఆటలఁ జేతన్యాత్మకుఁడగు దేవునిచేష్టలనె
పాటిగఁ బాపముఁ బుణ్యము బహుళం బగుఁ గానా ॥తన॥

అరదము నడపెటి సారథి యటునిటు వాగెలు వట్టిన
అరదముగుఱ్ఱములు మెలఁగు నాయాముఖములను
నరులను శ్రీవేంకటగిరినాథుఁడె తగఁ బ్రేరింపఁగ
గరువము లేమియుఁ గలిమియుఁ గలిగుండుఁ గానా ॥తన॥

**అవతారిక:**

ఈ కీర్తన పల్లవిని అర్థం చేసికోవటం గగనమయ్యిందంటే నమ్మండి. ఎంతో ప్రయత్నంతో నేనిలా భావించగలిగాను. అంతర్యామివలె హరియే మనలో వుండి మన పురాకృత కర్మలఫలముగా మనకు త్రిగుణములనిస్తున్నాడు. వాటిననుసరించే మనకు కోరికలు కలుగుతాయి. కాని సంకల్పములను కల్పించేదిమాత్రం ఆ సర్వేశ్వరుడే. ఇందుకు (ఈ సంకల్ప జననమునకు) ఇద్దరి యత్నము కూడా కావలెనా? అని ప్రశ్నిస్తున్నారు చినతిరుమలయ్య. తమాషా యేమిటంటే ఆ సంకల్పం నాదే అని మనం భ్రమపడుతుంటాం. అందంలోని ప్రతిబింబాలలాంటివాళ్ళం ఆ





బింబానికి ఎలా స్వతంత్ర్యం లేదో మనకూ అంతే. ఆయన ఆడిస్తున్న బొమ్మలాటలో మనం తోలుబొమ్మలం. అంతే... మరి...

**భావ వివరణ:**

ఓ మానవులారా! ఆతడె (ఆ శ్రీహరియే) ఇన్నియున్ కల్పించగ (ఈ కోరికలనన్నింటినీ ప్రేరేపిస్తుంటే) తన కోరికలేటికి? (ఈ కోర్కెలు తమ కోర్కెలని భ్రమపడుతున్నాం. అవి మన కోర్కెలెలా అవుతాయి?) ఇందుకు (ఈ సంకల్పముల పుట్టుకకు) ఇద్దరి యత్నము కావలెనా? మనం నిమిత్తమాత్రులం... అన్నీ కల్పించేది ఆ శ్రీహరియే సుమా!

అద్దములో చూచేవాడు తను నవ్వితే వాడి ప్రతిబింబముకూడా నవ్వుతుంది. దానికేమి స్వతంత్ర్యముంటుంది? అదే రీతిగా, గద్దరి (ఘటనాఘటన సమర్థుడైన) శ్రీపతియొక్క సంకల్పముతోనే జగములన్నిటిలో వ్యవహారాలన్నీ నడుస్తాయి. మన సుఖదు:ఖాలన్నీ సూటిపడేది (కల్పించబడుతున్నది) ఆయన వల్లనే గానా (కావున) మనం కేవలం నిమిత్తమాత్రులం (మనం కర్తలుగా కనిపించినా కర్తలు కాని వాళ్ళం. ఈ కీర్తనకి ఈ విధంగా వివరణ వ్రాసేది నేనా? కాదు. నాలోని అంతర్యామి. నాకంత జ్ఞానం యేదీ?)

ఒక నాటకంలో పాత్రధారులు దాని దర్శకుడు చెప్పినట్లు చేస్తారు, మాట్లాడుతారు. ఆ నాటకంలో బొమ్మలు (పాత్రలు) నానాగతి చెలగున్ (రకరకాలుగా వుంటాయి). కొన్ని మంచివి కొన్ని చెడ్డవి. చేతనాత్మకుడు (ఆత్మలో చైతన్యం కలిగించే) ఆ దేవదేవుని చేష్టలనే మనం పాటించి కొన్ని పాపము కొన్ని పుణ్యము అనుకొంటున్నాం. బహుళమైన ఇవన్నీ ఆయన ఆటలే అని గ్రహించండి.

ఒక రథసారథి తన గుఱ్ఱములయొక్క వాగెలువట్టిన (పగ్గాలు పట్టుకొంటే) వాడి అరదము (రథము) వాడు అనుకొన్న చోటికి ఆ గుఱ్ఱాలు తీసికెళతాయి. మనం కేవలం గుఱ్ఱాలవంటివాళ్ళం. శ్రీవేంకటేశ్వరుడు సారథియై తోలుతుంటే, మనల్ని ప్రేరేపిస్తుంటే మనం పరుగులు తీస్తున్నాం. కలిమిలేములు (సంపద, దారిద్ర్యం) రెండూ కలిగుండగా (ఆయనిచ్చేవే, కానీ) అవి మనవి అని మనం భ్రమతో గర్వపడుతుంటాం. ఎంతటి పిచ్చోళ్ళం!!!

సంపుటి: 10-1 కీర్తన : భవరోగవైద్యుఁడైన బలువెజ్జు
సంఖ్య : 22 పుట : 13 రాగం: రామక్రియ

## రామక్రియ

90. భవరోగవైద్యుఁడైన బలువెజ్జు
సవరని పైఁడిపక్షి సకినగాఁడు ॥ పల్లవి॥

తల్లివద్ద నోరిలోన తగ లోకములు చూపి
వెల్లివిరి నింద్రజాలవిద్యవాఁడు
చెలుల్బడి నొక్కకొండ చేతఁబట్టి యెత్తినాఁడు
బల్లిదుఁడు వాఁడివో బారివిద్యవాఁడు ॥భవ॥

మునుపె సకలభూతములకు నేలికయై
మనసెల్లా నెరిగిన మంత్రవాది
చనవున జలధిలో సంప దింద్రునికిఁ జూపె
అనువరి వాఁడివో అంజనగాఁడు ॥భవ॥

పట్టరాని కాళింగుపడిగెలమీఁదు మెట్టి
పట్టినాఁడు వాఁడువో పాములవాఁడు
అట్టె శ్రీవేంకటనాథుఁ డమరుల నెల్లనుఁ జే-
పట్టి దైత్యులఁ జంపించే పాళగాఁడు ॥భవ॥

**అవతారిక:**

ఈ వైద్యుడు మామూలుగా అందరికీ వచ్చే రోగాలు మాన్పేవాడు కాదు... భవరోగాలను పోగొట్టేవాడు అంటున్నారు చినతిరుమలయ్య. సంసారములో అనేక భవరోగాలు వస్తుంటాయి. వాటిని మాన్పే వైద్యుడే ఈ బంగారు రంగుగల పక్షిమీద పయనించే సకినగాడు. ఆ పక్షియెన్నడూ సవరనిది అంటున్నారు. చినతిరుమలయ్య కీర్తనల పల్లవి అంత తేలికగా అర్థం కాదు. బారి విద్యవాడు, మంత్రవాది, అంజనగాడు, పాళగాడు వంటి మాటల అర్థాలు అంత సులువుగా కొరుకుడుపడవు. అర్థమైనట్లుంటుంది కాని అర్థం చెప్పమంటే చెప్పలేం. అన్నట్లు... ఇది





భక్తిరస ప్రధానమైన కీర్తన అని ప్రత్యేకంగా చెప్పాలా?

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! ఈ స్వామి భవరోగములను (జన్మత: సంసారములో సంప్రాప్తించే అనేక రోగాలను) నయము చేయగల బలువెజ్జు (గొప్పవైద్యుడు). ఈయన "సవరని పైడిపక్షి సకినగాడు" (చక్కని శుభశకునమైన బంగారు రంగుగల గరుడ పక్షి వాహనముగా అలంకరింపబడినవాడు).

ఈ వైద్యుడు అనేకానేక విద్యలలో శిశువైన నాటినుండే ఆరితేరినాడు. శిశువుగానే తన చిన్ని నోటిలో తల్లి యశోదకు త్రిభువనాలు వెల్లివిరి (విస్తృతంగా) చూపిన ఇంద్రజాలవిద్యవాడు (మెజీషియన్ అన్నమాట). తానొక అధికారివలె చెల్లుబడితో (అధికారంతో) నిర్దేశించి గోకులాన్నంతా కొండక్రింద (గోవర్ధన పర్వతం క్రింద) చేర్చి, చిటికెన వ్రేలిపై దానినెత్తి అహోరాత్రములు కాపాడిన బల్లిదుడు (బలాఢ్యుడు) వాడే. వాడుగొప్ప బారి విద్యవాడు (వెయిట్ లిఫ్టర్).

సకల భూతములకు (జీవులకు) మునుపె (వారు పుట్టబోవుటకు ముందే) ఈ ఏలికయైన స్వామి, వారి మనస్సు నెరిగి జన్మ ప్రసాదిస్తాడు. ఈయన మంత్రం వేయగానే ఆ నూతన జన్మలో పాత జన్మ పూర్తిగా మరిచిపోతారు. ఈయన అంత గొప్ప మంత్రవాది, మాంత్రికుడు (హిప్నటిస్ట్). వాత్సల్యంతో ఇంద్రునికి క్షీరసాగరంలో అనేక దివ్యసంపదలున్నాయని చూపి దానినెలా మథించాలో చెప్పిన ఈ అనువరి (ఉపాయశాలి) గొప్ప అంజనగాడు (అంజనం వేసి కళ్ళకు నిక్షిప్తాలు చూపే టెక్నీషియన్).

పట్టుకోటానికసాధ్యమైన కాళింగు సర్పముయొక్క పడిగెలమీద మెట్టి (యెక్కి) నృత్యం చేసి విషంతో పాటు రక్తాన్ని కూడా కక్కించి ఆ పామును దారికి తెచ్చుకొన్న ఈయన గొప్ప పాములవాడు (స్నేక్ చార్మర్). అదంతా ద్వాపరయుగంలో జరిగింది. అట్టె (అదేవిధంగా) నేడు ఈ కలియుగంలో కూడా శ్రీవేంకటేశ్వరుడై అమరులను (దేవతలవంటి సాత్వికులను) రక్షించి దైత్యులను (రాక్షసులవంటి దుర్మార్గులను) చంపించే ఈ దేవదేవుడు గొప్ప పాళగాడు (దండనాయకుడు) (ఎక్జిక్యూషనర్).

సంపుటి: 10-1 కీర్తన :పచ్చిగా దెలియకుంటె బహుముఖమై తోచు
సంఖ్య : 13 పుట : 7 రాగం: లలిత

## లలిత

91. పచ్చిగాఁ దెలియకుంటె బహుముఖమై తోఁచు
అచ్చమై యిన్నియును శ్రీహరికల్పితములే ॥ పల్లవి॥

కొందరు దిట్టుదురూ, కొందరు దీవింతురు
చందపుసంసారము జాడ లివి
కందువ రేయీఁ బగలుఁ గాలము నడచినట్టె
అందరిలోఁ గలుగు శ్రీహరికల్పితములే ॥పచ్చి॥

కొన్నిటిపై కోపము కొన్నిటిపై వేడుక
వున్నతి దేహధారుల వోజ లివి
పన్ని కాయ పండు దొండపంటియందె తోఁచినట్టు
అన్నియుఁ బుట్టించిన శ్రీహరికల్పితములే ॥పచ్చి॥

కొంతచోట మనుజులు కొంతచోట దేవతలు
అంతా శ్రీవేంకటనాథు నాజ్ఞ యిది
చెంత చప్పనయుఁ దీపు చెఱకందె వుండినట్టు
కాంతుఁడైన శ్రీహరికల్పితములే ॥పచ్చి॥

**అవతారిక:**

"ఈ సృష్టిలో సమస్థమూ సృష్టించినది ఆ శ్రీహరియే కదా! అందరికీ అచ్చమైన ఆయన కల్పితములే అన్నీ. ఈ విషయం స్పష్టంగా తెలియకపోతే అనేక రకాలుగా ఆయనే తెలియజేస్తున్నాడు" అని అంటున్నారు చినతిరుమలయ్య. దీని భావవివరణ చదివాక మీ మనస్సు ఆనందంతో ఈ సంకీర్తనాచార్యుని సెభాస్ అంటుంది. నామటుకు నేనే, కొందరితో ప్రీతిగా వుండేవాడిని కొందరిని పలుకరించుట కూడా





చేయను. ఏమిటీ వింత అనుకొనేవాడిని. నాకు నేడు జ్ఞానోదయమయింది. ఓ శ్రీహరీ! ఇతరులకు నిన్నెరుగ తరమా? అన్నారు కదా! అన్నమయ్య.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! ఈ విషయం పచ్చిగా దెలియకుంటే (మర్మము లేకుండా పైకి తెలియకపోతే) బహుముఖమై తోచు (ఎన్నో విధములుగా మనకే తోస్తున్నది). ఏమిటా తోచేది? అన్నియునూ (సమస్తమూ) అచ్చముగా (కేవలము) శ్రీహరి కల్పితములే (సృష్టించినవే సుమా!)

కొందరు మనల్ని తిడుతుంటారు. కొందరు మనల్ని దీవిస్తుంటారు. ఈ ప్రపంచము తీరే అంత. దినదినమూ రేయింబవళ్ళు (రాత్రీపగలూ) వచ్చినట్లు కందువ (సామర్థ్యంతో) కాలము నడుస్తూనే వుంటుంది. మరి ఈ కాలాన్ని మనోవికారాలను ఎవ్వరు సృష్టించారు? మీరా? కాదుకదా! అవి అందరిలోనూ నెలకొని వున్న ఆశ్రీహరి కల్పితములు (సృష్టించినవే).

మనకు అకారణంగా కొన్నిటిపై కోపము కలుగుతుంటుంది. కొన్నిటిపై వేడుక (ప్రసన్నత) కలుగుతుంటుంది. దేహధారులకు (మానవదేహము ధరించిన మనందరికీ) ఓజలివి వున్నతిని (ఇవి గొప్పగా అమరిన సహజ స్వభావములే). ఉదాహరణకి ఒక దొండపండును తీసికొండి. ఒకప్పుడు అదే పచ్చి దొండకాయ కదా! కాయ పండూ రెండూ దాంట్లోనే వున్నాయి కదా! అన్నీ పుట్టించింది ఆ శ్రీహరే అని అర్థం కాలేదా.. ఇంకా?

ఈ అనంత విశ్వంలో కొంతచోట (ఒకచోట) మానవులున్నారు. కొంత చోట (వేరొకచోట) దేవతలున్నారు. జన్మాంతమున కొందరిక్కడివారు అక్కడికి, కొందరక్కడివారిక్కడికీ వస్తుంటారు. ఇది నిర్ణయించేదెవరు? మీరా? కాదుకదా! అది అంతా ఆ శ్రీవేంకటేశ్వరుని ఆజ్ఞపై నడుస్తుంటుంది. ఒక చెఱకు గడను తీసికొండి. పచ్చిగా వున్నప్పుడు అది చప్పనయీ (వగరుగా వుంటుంది). ఉన్నట్లుండి కొంతకాలానికి అదే తియ్యగా అవుతున్నది. ఇదంతా కాంతుడైన (జగన్నాథుడైన) శ్రీహరి కల్పితములే (లీలలే) అవునా?

సంపుటి: 10-1 కీర్తన : నిందునిధానమువలెనీవు
సంఖ్య : 29 పుట : 17 రాగం: మలహరి

## మలహరి

92. నిందునిధానమువలె నీవు గలిగుండఁగాను
పండిన యోగికిఁ బూర్ణభావనె మంచిది ॥ పల్లవి॥

కలకాలము భూమిఁ గతలె విటిమిగాని
నల నహుషాదు లున్నారా యేమి
యిలలో నితరులెల్లా నేమిలెక్క యిందుకుఁగా
యెలయింపువిషయాల యేమరఁగఁ దగునా ॥నిందు॥

చేపట్టి పురాణాలు చెప్పఁగా వింటిమిగాని
బాపురె దుర్యోధనుసంపద యేది
కాపాడ నిప్పటివారికలిమి యెంచఁగ నేది
యీ పాటిపనికిఁగా నిది గోరఁ దగునా? ॥నిందు॥

మళ్లిమళ్లి భూమిలోన మాటలె వింటిమిగాని
తొల్లిటి బలాఢ్యుల సత్తువ లేవి
వెల్లివిరై యెప్పుడూ శ్రీవేంకటనాథ నీదాసు
లెల్లకాలముఁ జెడని యీ బలిమె నిజము ॥నిందు॥

**అవతారిక:**

పుట్టిన ప్రతివాడు గిట్టేవాడే కదా! సప్తఋషులతో పల్లకీ మోయించుకొన్న నహుషుడి గతేమయింది? పన్నెండు అక్షౌహిణీల సైన్యం వున్న దుర్యోధనుడు తొడలు విరిగి దిక్కులేని చావు చచ్చాడు కదా! ఎంతమంది గురించి యెన్నికథలు వినలేదు? ఒక్కడైనా కలకాలం వున్నాడా? ఓ శ్రీవేంకటేశ్వరా! ఒక్క నీదాసులు మాత్రమే యెల్లకాలమూ లబ్ధప్రతిష్ఠులై వుంటారు. తతిమ్మా వాళ్ళంతా తలా ఒక దారిన





కాలప్రవాహంలో కొట్టుకొని పోతారు అంటున్నారు, చినతిరుమలయ్య. మనకర్థమయ్యే భాషో చెప్పాలంటే... "అక్షౌహిణీ" అంటే 21870 రథసైన్యం, అంతే సంఖ్యగల గజసేన, 65650 మంది అశ్వసేన, 1,09,350 మంది కాల్బటులసేన. ఇట్లాంటి అక్షౌహిణీలు పన్నెండు వున్నాయట ఆ దుర్యోధనుడికి.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! పండిన యోగికి (పరిపక్వతనొందిన యోగికి) పూర్ణ భావనే (పరమాత్మ సమస్తమునందు సంపూర్ణముగా నున్నాడు అనే ఆలోచనే) శ్రేష్ఠమైనది. ఎందుకంటే సర్వమునా, నిందు నిధానము (దాచిన పెన్నిధివలె) నీవు వారి భావనలలో నుంటివి కదా!

ఈ భూమ్మీద చాలా కాలంనుంచి కతలె (పురాణ గాథలు) వింటూనే వున్నాము. అందులో చెప్పిన నహుషుడు మొదలైనవారు ఈనాడు వున్నారా యేమయ్యా? ఆయనకే ఆ గతి (సర్పం అయిపోయాడు) పట్టితే ఇతరులు ఒక లెక్కా!! ఇందుమూలముగా తెలియాల్సిందేమిటి అంటే విషయాల యెలయింపులో (ఇంద్రియభోగాలలో) ఏమరుపాటు (పరవశత్వము) తగదు.

చేపట్టి (పూని) పురాణాలనన్నింటినీ విన్నాము. బాపురె (ఓరినాయనో!) దుర్యోధనుడి సంపద యెవరికన్నా వుంటుందా? వాడు రారాజు. వాడిచేతిలో పన్నెండు అక్షౌహిణీల సేనవుంది. భీష్మాది వీరులున్నారు. అంతులేని సంపదవున్నది. కాని అవేమన్నా వాడిని కాపాడాయా? వాడికే అట్లా అయితే నేటివారి గురించి చెప్పేదేముంది? ఈ పాటిదానికి పరమాత్మను నాకు సంపదలు కావాలి అని కోరుకోమంటారా?

ఈ భూమిమీద, మళ్ళీ మళ్ళీ యెన్నిసార్లు గొప్ప బలవంతుల గురించి విన్నామో కదా! తొల్లిటి (ఆనాటి) వాడు ఈనాడు ఒక్కడన్నా వున్నాడా చెప్పండి. అందరూ కాలగర్భంలో కలిసిపోయారు కదా! కానీ ధ్రువుడు, ప్రహ్లాదుడు వంటి నీదాసులు మాత్రం కలకాలం మానవుల మనస్సులలోనే వెల్లివిరై నిలిచివుంటారు (విఖ్యాతులై స్థిరముగావుంటారు). ఓ శ్రీవేంకటేశ్వరా!

యేనాటికీ చెడిపోని నీ బలిమే (శక్తియే) నిజమైనది తండ్రీ!

సంపుటి: 10-1 కీర్తన:పండించి తేగలుగునా పరమాత్మునిదాస్యము
సంఖ్య : 30 పుట : 17 రాగం: లలిత

**లలిత**

93. పండించితేఁ గలుగునా పరమాత్మునిదాస్యము
నిండుమతి నుండితేను నెరవేరుఁగాక ॥ పల్లవి॥

బాధకు నోపనివాఁడు పాపము సేయనేల
పోదిసేయఁ దొలుతేమి బుద్ధి లేదా
సాదువలె నుండితేను సర్వేశ్వరుఁడె తన్ను
వాదులాట లెల్ల మాన్పి వహించుకో లేఁడా ॥పండి॥

దండుగ కోపనివాఁడు తప్పులు సేయఁగ నేల
వుండరాదా తా నుండె వొడికానను
కొండవంటియాసతోడ కోరక తా నుండితేను
తండుముండై లంపటాలు తగిలీనా తనకు ॥పండి॥

వళుకు కోపనివాఁడు వచ్చి పూఁటవడనేల
వొలిసినట్లు తనంత నుండరాదా
కలకాలము శ్రీవేంకటనాథుఁ గొలిచితె
అలరి యభయ మిచ్చి అట్టె కావ నోపఁడా ॥పండి॥

**అవతారిక:**

పరమాత్మపై భక్తి శరణాగతి, నమ్మకము... పండించితే కలుగవు. అంటే కృషిచేసి సాధించాలని చూస్తె కుదిరే పనికాదు. నిండుమతి నుండితే అంటే.. పరిపూర్ణ విశ్వాసంతో వుంటే అది నెరవేరుతుంది అంటున్నారు





చినతిరుమలాచార్యులవారు. పాపంచేస్తే బాధ తప్పదు. అది పరమాత్మ తీర్పు. మొదట్లోనే బుద్ధి తెచ్చుకొని సన్మార్గంలో వుంటే నరకంయాతనలుండవు గదా! ప్రతిక్షణం నీవేనాకు దిక్కు అంటే ఆ వేంకటపతి తన అభయహస్తంతో మీకు శరణునందిస్తాడు గదా! అంటున్నారు. కాని మనం తప్పులమీద తప్పులు చేస్తూనే వున్నాం.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! పరమాత్ముని దాస్యము (శరణాగతి) పండించితే గలుగునా (కృషిచేసినంతమాత్రాన లభిస్తుందా?) అది నెరవేరాలంటే తేలికపనికాదు. నిండుమతినుండితేనే (పరిపూర్ణమైన విశ్వాసం వుంటేనే) అది నెరవేరుతుంది.

బాధకునోపనివాడు (నరకయాతనలకు తాళలేనివాడు) అసలు పాపమెందుకు చేయాలి? పోది (పూని) సేయదొలుతే (చేసేముందే) బుద్ధిలేదటయ్యా! మొదట్లోనే సాధువర్తనుడైవుంటే, తనను ఆ సర్వేశ్వరుడే వాదులాటలెల్ల (పోట్లాటలు మాన్పి) వహించుకోలేడా (ఆదరించేవాడు కదా!)

దండుగ (శిక్ష)కు ఓపనివాడు (తాళలేనివాడు) తప్పులు చేయటందేనికి? వాడు తానుండే హద్దులలోనే తగినట్లు వుండవచ్చును గదా! కొండలంతవున్న ఆశతో తాను కోర్కెలు లేకుండా వుంటే తండుముండై (తడబాటు కలిగించే) లంపటాలు (తగులములు) తనకు తగిలీనా (తగిలేవా?)

వళుకుకోపనివాడు (తగవులాటకు తాళలేనివాడు) వచ్చి పూటవడనేల (పోట్లాటకు రావటం యెందుకు)? వొలిసినట్లు (తగినట్లు) తాను వుండవచ్చును కదా! శ్రీవేంకటేశ్వరుని యెల్లవేళలా కొలిచిన యెడల చక్కగా అభయం ఇచ్చి కావనోపడా (రక్షించడా!!)

సంపుటి: 10-1 కీర్తన : నిచ్చలూ జెడనియట్టి నీకె తెలుసుగాక
సంఖ్య : 26 పుట : 15 రాగం: గౌళ

### గౌళ

94. నిచ్చలూఁ జెడనియట్టి నీకె తెలుసుఁగాక
యిచ్చల మావంటివా రేమెరుగుదు రయ్యా ॥ పల్లవి॥

బాలుఁడు వృద్ధనియెటి పరిభాష లన్నియును
మూలమూలలను దేహమునకె కాక
యీలో నెంచిచూచితే నెన్నటివాఁడు
కోలుముంద్రై పెరిగీనో కొంచె మయ్యీనో ॥నిచ్చ॥

మంచిది చెడ్డ దనెటి మాట లెల్లా భువిలోన
యెంచిచూడ మనుజుల కింతెకాక
నించి సర్వపూర్ణుఁడవై నీవులేని చోటేది
తుంచరాదు పెంచరాదు తొల్లె కలవు ॥నిచ్చ॥

వాఁడు వీఁ డనియెటి వచనాలు జగములో
పోఁడిమి జీవులయందె పొసఁగెఁ గాక
వేఁడినా కొసరినాను విశ్వవ్యాపకుఁడవై
నాఁడు నేఁడు శ్రీవేంకటనాథుఁడవె కలవూ ॥నిచ్చ॥

**అవతారిక:**

"దేవదేవా! నీవు అనాదివి. నిత్యుడవు. అచ్యుతడవు. నీ తత్త్వం నీకు తప్ప పరులకు అగమ్యగోచరము. ఇక మావంటివారు నిన్నెట్లు తెలియగలరు?" అనే మాటల్ని అన్నమయ్య కాలంనాటి వాడుక తెలుగులో చెప్తే ఈ కీర్తన పల్లవి అవుతుంది. చినతిరుమలయ్య చెప్పిన ఈ కీర్తనలో అయ్యలారా! అన్నీ మనం చెప్పుకొనే మాటలే కానీ పదార్థం మాత్రం ఒక్కటే అంటున్నారు. దేహంలో వుండే జీవుణ్ణే ఒకసారి బాలుడంటున్నాం,





ఒకసారి యువకుడంటున్నాం, ఒకసారి ముసలాడు అంటున్నాము. కానీ మూలమూల నున్నది ఒక్కడే. వీడు ఇంత అజ్ఞాని అనితెలిసే ఆ వేంకటపతి వీడు వేడినా తిట్టినా వీడిని రక్షిస్తూనే వుంటాడు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నిచ్చలు చెడనియట్టి (నిత్యుడవు అయిన) నీకె తెలుసుగాక (నీవొక్కడివే జ్ఞానివి). ఇచ్చల (కోర్కెతో సతమతమయ్యే) మాబోటివారు నిన్నేమి తెలుసుకోగలరు?

మేము బాలుడు, యువకుడు, ముసలివాడు అని పరిభాషలో (వాడుక భాషలో) అంటుంటాము. ఇవన్నీ మా దేహాలకు చెందేమాటలు. ఈ లోన (ఈ దేహంలోపల) యెంచి చూచిన మూలమూలలలో (అంతరాంతరాలలో) వున్న జీవుడు యెన్నటివాడు? వాడికి కోలుముంద్రై (విజృంభించి) పెరుగుట లేక తరిగి కుచించుకుపోవుట వుంటాయా? వుండవు. అవి కేవలం దేహానికే.

ఈ భూమిమీద మంచిది చెడ్డది అని యెందరినో అంటుంటాం. ఆలోచించి చూస్తే మేము ఇలా యెవరినంటున్నాము? మాతోటి మనుష్యులను, అవునా? కానీ సర్వపూర్ణుడవై (అంతా నిండిపోయి పూర్తిగా మాలో నిండివున్న) నిన్ను కాదా? అసలు నీవులేని చోటేది? నీవు తొల్లె (అనాదిగా) ఆత్మవై మాతోనే వున్నావు. ఈ ఆత్మ తుంచరాదు (నశింపచేయరాదు) పెంచరాదు (వృద్ధిని చేయరాదు). ఈ మాటలు నీవే భగవద్గీతలో చెప్పావు.

ప్రభూ! మేము పరులని భావించి "వాడు" లేక "వీడు" అనే మాటలను వుపయోగిస్తుంటాం. ప్రపంచంలో ఈ మాటలు వేరెవ్వరికీ పొసగవు (సరిపోవు). పోడిమి (చక్కగా) అవి "జీవులకే" తగివున్నాయి. కాని వారిలో వున్న నీకుగాదు. ఎందుకంటే... ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు విశ్వవ్యాపకుడవై నాడూ నేడూ మాలోనే కలవు. మేము నిన్ను వేడినా కొసరినా (అవమానించినా) యెన్నడూ మమ్ము విడిచిపోవు. ఎందుకంటే... తండ్రి బిడ్డను యెన్నటికీ వదలడు. (తప్పు చేస్తే నాలుగు తంతాడు అంతే...)

సంపుటి: 10-1 కీర్తన : నేరి చెవ్వడు బ్రదికె నేరక యెవ్వడు చెడె
సంఖ్య : 24 పుట : 14 రాగం: దేవగాంధారి

## దేవగాంధారి

95. నేరి చెవ్వడు బ్రదికె నేరక యెవ్వడు చెడె
భారకుఁ డందరికి శ్రీపతి యింతెకాక ॥ పల్లవి॥

వొక్కరి నేరము లైతె నూరకె వెదకఁజూచే
నక్కటా నా గుణదోషా లవి యెంచను
వొక్కటై విచారించితే వొరులేమి తానేమి
అక్కడ నిక్కడ గురి హరి యింతె కాక ॥నేరి॥

దట్టించి వొక్కరినైతె తప్పు లెంచఁజూచేను
అట్టె నా యపరాధాల కాజ్ఞ యేదో
నెట్టనఁ దలపోసితే నేనేమి పరులేమి
గట్టిగా స్వతంత్రుఁడు శ్రీకాంతుఁ డింతెకాకా ॥నేరి॥

వూరకె వొక్కరి నైతె వొచ్చములు వట్టేను
కారుకమ్మినట్టి నా కల్ల లెంచను
గారవించి శ్రీవేంకటనాథుఁడు నన్ను
సారెకు రక్షించఁగాను జయ మాయఁగాకా ॥నేరి॥

**అవతారిక:**

సర్వుల భారము వహించి రక్షించేవాడెవరు? ఆ శ్రీపతి. ఇంతెగాక ఇంకా నేర్వవలసినదేమి? దీనినెరిగి జీవిస్తున్న వాళ్ళెంతమంది వున్నారు? దీని నేర్వక చెడిననూ చెడకున్ననూ రక్షకుడు మాత్రం ఆ శ్రీహరియే అంటున్నారు చినతిరుమలాచార్యులవారు. తనకో న్యాయం పరులకో న్యాయం అనే గుణదోషము జీవలక్షణము. "కారుకమ్మినట్టి నాకల్లలెంచను.. వూరకె వొక్కరినైతేవొచ్చములు వట్టేను" అనే మాట





ఐదువందలయేళ్ళనాడు వాడుక భాషే, కాని ఈ నవీన యుగంలో కారుకోసం కల్లు అమ్ముకొన్నారని అనుకొనే నాగరికులు వుంటే ముక్కుపై వేలుపెట్టుకోకూడదు. అదంతే... అనుకోవాలి. మీరు దీనిని భక్తితో చదువుకోండి. పరుల గోలమనకేల గోపాలబాలా?

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! అందరికీ భారకుడు (భారమును వహించువాడు) శ్రీపతి. ఇంతేకాక మరేదియు లేదు. దీనిని నేర్చి బ్రతికినవాడేడీ? (అంటే.. అందరూ ఆ జ్ఞానం లేకుండానే బ్రతుకుతున్నారు). ఇట్లా అయితే నేరక (తెలియక) ఎవ్వడు చెడిపోడు?

అక్కటా! (అయ్యో!) వొక్కరి నేరములైతే (ఇంకొకరి నేరములైతే) వూరకె (పనివదలి) వెతుకుతాను, కాని నాగుణదోషములైతే లెక్కచేయను. ఒక్కటిగా భావించి చూస్తే పరులేమిటి? తానేమిటి? అక్కడా నిక్కడా (వారిలో వున్నదీ, వీరిలో వున్నదీ) గురి (సాక్షీభూతుడు) యెవరు? శ్రీహరియే. ఇంతేకాక వేరే సత్యం యేముంటుంది?

ఒకరినైతే (ఇంకొకరినైతే) దట్టించి (అదిలించి) తప్పులు వెదుకుతాను. అట్లాగే నాతప్పులైతే ఆజ్ఞయేదీ (అనుమతిస్తానా? యెన్నటికీ ఒప్పుకోను.) నెట్టున (తప్పకుండా) తలపోసితే (ఆలోచిస్తే) నేనేమిటి? పరాయివారేమిటి? ఎవ్వరమైనా అస్వతంత్రులమైన మానవులమే. గట్టివాడు (స్వతంత్రుడు) యెవరన్నా వున్నారంటే ఒక్క శ్రీకాంతుడే కదా!

నేను వూరకనే, వొక్కరినైతే (ఇంకొకరినైతే) వొచ్చములు వట్టేను (పొరబాట్లను పట్టుకొంటాను). కారు కమ్మినట్టి నాకల్లలు (నా నల్లబడిన, అబద్ధాలను మాత్రం) యెంచను (లెక్కజేయను). ఇన్ని అవగునాలున్న నాబోటివాడిని కూడా ఆ శ్రీవేంకటేశ్వరుడు గౌరవించి, సారెకు (ప్రతియొక్క పర్యాయము) రక్షించాడు. అందుచేతనే నాకు జయమాయగాకా (విజయం దక్కింది కదా!) లేకుంటే నేనేపాటివాడను తండ్రీ!

సంపుటి: 10-1 కీర్తన : సకలపురాణములు చాటి నిను బొగడగా
సంఖ్య : 58 పుట : 33 రాగం: లలిత

**లలిత**

96. సకలపురాణములు చాటి నినుఁ బొగడఁగా
తకమకలుగా నల్పార్థము చెప్పఁ దగునా ॥ పల్లవి॥

నిను నిర్గుణుఁ డనేటి నీచజాతులయందె
యెనయు దుర్గుణము దా నెంతో
కనకంబు నిను మనుచు కారునాయంబులను
యెన లేనిదుర్వాదుల నేమనఁగఁ గలము ॥సకల॥

నీవె తా మనుకొనేటి నిందితాత్ములు దాము
కావించుద్రోహంబు కడమా
దావతులఁ దనుఁ గన్నతల్లి గొడ్డని పల్కు
దేవతానిందలకుఁ దెలుపఁగ వశమా ॥సకల॥

అమరుసర్గము మిథ్య యను శూన్యభాషలకు
తమితోడ భ్రమ యేల తరగు
తమగురువు శాస్త్రంబు తామె కల్లనఁగాను
క్రమబుద్ధి శ్రీవెంకటనాథ యిత్తువా. ॥సకల॥

(చినతిరుమలయ్య - అధ్యా - సంఖ్య 58)

**అవతారిక:**

భగవంతుడు 'నిర్గుణుడు' అంటే గుణాతీతుడని అని అర్థం. అసలు గుణమే లేనివాడని పెడర్థం తీసే నీచజాతి మానవుల నేమంటాము? పురాణములన్నీ ఆయనను పురుషోత్తముడని కీర్తిస్తుంటే, తికమకలైన అల్పార్థములు చెప్పే దుర్వాదులను నిరసించవద్దా, అంటున్నారు తాళ్ళపాక చినతిరుమలాచార్యులవారు. కనకము వంటి నిన్ను అన్యాయమైన





వాదనలతో హేళన చేసే నీచులను యేమనగలం చెప్పవయ్యా! ఓ వేంకటపతీ! కాస్త వాళ్ళకు క్రమబుద్ధి ఇవ్వవయ్యా! అని ప్రార్థించగలము. మీదపడిపోట్లాడలేం కదా! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! అష్టాదశ పురాణములూ నీవు జగన్నాథుడవని చాటి నిన్ను పొగుడుతుంటే నాస్తికులైన వారు తకమకలుగా (తికమకజెందునట్లు) అల్పార్థములను (పెడర్థములు) చెప్పిన, అది తగిన పనియేనా?

వేదము నిన్ను నిర్గుణుడు అన్నది. అనగా నీచమైన అల్పగుణములు లేని వాడని కదా! నీచ జాతికి చెందిన కొందరు మానవులు గుణమేలేని వాడివని విమర్శిస్తున్నారు. ఆ దుర్గుణము తానెంతయో ఆ నీచులయందే వున్నది. కనకము (బంగారము) వంటి నిన్ను కారునాయంబుల (న్యాయం అనేది లేకుండా) మనుచు (వుంటూ) చెప్పలేని దుర్వాదులు (చెడువాదనలు) చేస్తున్నారు. వాళ్ళ కర్మకు వాళ్ళనొదిలేయటం కన్న యేం చేయగలం చెప్పండి.

"అహం బ్రహ్మాస్మి" లాంటి వేదవాక్యములను పట్టుకొని, నీవే తాము అనుకునే నిందితాత్ములు (పాపాత్ములు) తాము చేసే ద్రోహం చెప్పశక్యమా? దావతుల (పదిమందిలో) తనకు కన్నతల్లినే గొడ్డని (గొడ్రాలు) అని నిందించే వాడు దైవదూషణ చేసినవాడే కదా! వాడెంత నీచుడో చెప్పటం ఎవ్వరికైనా వశమా?

అమరు సర్గము (అమరుల స్వర్గము) మిథ్య అనే శూన్య భాషలకు (శూన్యవాద నాస్తికులకు) తమి భ్రమకలుగుతూనే వుంటుంది. అది యెందుకు తగ్గుతుంది చెప్పండి. తమ గురువు చెప్పిన శాస్త్రమును తామే కల్ల (అబద్ధం) అనే దుష్టులకు చెడే జరుగుతుంది. ఓ శ్రీవేంకటేశ్వరా! వారికి నీవు మాత్రం సక్రమమైన బుద్ధిని యెలా ఇస్తావు?

## మాతృశ్రీ తరిగొండ వేంగమాంబ కీర్తనలు

### దరువు, ఆట తాళం

97. గణనాయకా! శరణు - గణనాయకా! శరణు
గణనాయకా! శరణు - గణనాయకా! ॥ పల్లవి॥

శ్రీశివ వరపుత్ర!- చిరతర ఘనచిత్ప్ర-
కాశ! మమ్మేలు! శ్రీ - గణనాయకా! ॥గన॥ 1

భవరోగ సంహార! - భక్త చిత్త విహార!
కవిజన మందార! - గణనాయకా! ॥గన॥ 2

మునిజన పాలన! - మూషక వాహన!
ఘన సుగుణ సంతాన! - గణనాయకా! ॥గన॥ 3

నీరధి గంభీర! - నిగమ గోచర! విశ్వ-
కారణ విగ్రహా! - గణనాయకా! ॥గన॥ 4

అలరార నిను నమ్మి - నటువంటి మాపాల
కలిగియుండుము నీవు - గణనాయకా! ॥గన॥ 5

తాపత్రయంబును - తలcగించి మముc బ్రోచి
కాపాడవయ్యా! శ్రీ - గణనాయకా! ॥గన॥ 6

తలcగక విఘ్నకా - రులc ద్రుంచి, బ్రహ్మ స-
త్కళలో నన్నుంచు శ్రీ - గణనాయకా! ॥గన॥ 7

ఆరూఢిc దరిగొండ - హరికి సోదరియైన
గౌరికుమార! శ్రీ - గణనాయకా! ॥గన॥ 8

**అవతారిక:**

విఘ్ననాయకుడు, శివపార్వతీ తనయుడు, గణపతి అయిన గజాననుని కీర్తిస్తున్నారు వెంగమాంబ. భవరోగసంహారా! శరణు శరణు అని ప్రార్థిస్తున్నారు. స్వామి నీరధిగంభీరుడట. తనకు విఘ్నములు కలిగించే దుర్మార్గులను ఏమాత్రం వెనుదీయక త్రుంచి తనను బ్రహ్మసత్కళలో వుంచమని వేడుకొంటున్నారు. అంటే బ్రహ్మదేవుడు తనకు జన్మత:





ప్రసాదించిన కళలను పెంపొందింపజేయమని ప్రార్థిస్తున్నారు. వీనుల విందుగా పాడుకోదగ్గ కీర్తన ఇది.

**భావ వివరణ:**

ఓ గణపతిదేవా! నిన్ను శరణు వేడుచున్నాను. ఓ గణనాథా! శరణు శరణు. ఓ గణనాయకా! నాకు శరణునొసంగుము.

శ్రీశంకరుని వరప్రసాదివైన కుమారా! నీవు చిరతర (అనంతమైన) ఘన (గొప్పదైన) చిత్ప్రకాశము (అనిర్వచనీయమైన ప్రకాశము) గలవాడా! ఓ గణనాయకా! మమ్ము పరిపాలింపుము.

భవబంధములే రోగములై పీడించగా ఆ పీడను, నివారించెడి నీవు భక్తుల చిత్తములలో విహరింతువు. కవిజనులకు (పండితులకు) పారిజాతవృక్షము వంటివాడవు. అట్టి గణనాయకా! శరణు.

మునీశ్వరులను పాలించు ఓ మూషికవాహనా! నీవు గొప్ప సుగుణముల పరంపర కలవాడవు. అట్టి గణనాయకా! శరణు.

ఓ ప్రభూ! నీవు సముద్రమువలె గంభీరమైనవాడవు. నిగమగోచరుడవు (వేదముల ద్వారా గోచరింపబడువాడవు). విశ్వము జనించుటకు కారణమైన రూపము కలవాడవు. అట్టి గణనాయకా! శరణు

ఓ గణేశ్వరా! అతిశయించి నిన్ను నమ్మినట్టి మాయెడల అనుగ్రహము కలిగియుండుము ప్రభూ!

ఓ గణనాయకా! మా తాపత్రయములను (ఆధ్యాత్మికము, అధిభౌతికము, ఆధిదైవికము), తొలగించి మమ్ము అనుగ్రహించి రక్షించుము.

ఓ దేవా నాకు విఘ్నములను కలిగించే దుర్మార్గులను తలగక (ఏమాత్రము వెనుదీయక) త్రుంచుము (నశింపజేయుము). అట్లు త్రుంచి నన్ను బ్రహ్మసత్కళలో (బ్రహ్మదేవుడు నాకు జన్మత: ప్రసాదించిన కళలను పెంపొందజేయుము). శ్రీ గణనాయకా! నిన్ను శరణువేడెదను.

శ్రీగణనాయకా! ఆరూఢి (అతిశయించి) తరిగొండ హరికి (సింహానికి... అంటే... నరసింహునికి) సోదరి (చెల్లెలు) అయిన పార్వతీదేవి కుమారుడా! నిన్ను శరణువేడెదను. నన్ను అనుగ్రహింపుము.

## పంతువరాళిరాగం, ఆదితాళం

98\. ఏల నీకు బుద్ధి లేదురా? – ఓరోరి! జీవా!
ఏల నీకు బుద్ధి లేదు? – ఎవరితో నీకేల వాదు? ॥ పల్లవి॥

ఫాలభాగమందుఁ జూడారా! – భ్రమలన్ని యచట
భగ్నముగాఁ జెండి వీడరా!-వోరోరి జీవా! యేల నీకు బుద్ధి లేదురా ॥అనుపల్లవి॥

జనసంగములోనఁ జిక్కి – సంతోషాన మేను సొక్కి
నిన్ను నీవు జూడవేమిరా
సంసారసుఖము యెన్నటికీ–
విడనాడరా! వోరోరిఁ జీవా ॥ఏలనీకు॥1

ఆఱు చక్రములు నిలిపి – ఆఱుగురి గర్వ మణఁచి
మేరువపై నిలిచి చూడరా! మితి
మేరలేక మిన్ను లోను –
మిన్ను చూడరా! వోరోరి! జీవా ॥ఏలనీకు॥ 2

అండాండ, పిండాండములను–భేదించి, శోధించి, మించి అ
ఖండమాయను ఖండించరా! – అన్నిట నిలిచి, అ
ఖండపదవి నిండించరా! వోరోరి! జీవా ॥ఏలనీకు॥ 3

యాయీ యాల తరి – గొండ నరహరినిఁ జేరి
పండు వెన్నెల బయలుఁ జూడరా!
దండిగ వెలిఁగే నిండు జ్యోతి నీలోఁ
గానరా! వోరోరి! జీవా! ॥ఏలనీకు॥ 4

**అవతారిక:**

తెలుగు భాషకున్న విశిష్టత యేమంటే ఒకే ఒక అక్షరం మార్పుతో మొత్తం అర్ధమే మారిపోతుంది. అర్ధం ఎలాగైనా సమన్వయపరచవచ్చును. ఉదాహరణకి తరిగొండ వెంగమాంబ గారి ఈ కీర్తన అనుపల్లవిని చూడండి. ఫాలభాగమందు చూడరా! అచ్చుట భ్రమలన్నీ భగ్నముగా చెంది వీడరా!





వోరోరి జీవా! అని వున్నది. ఇందులో విడిచిపెట్టమనే ఆదేశం జీవునికి చేస్తున్నారు. అదే "వీడురా" అయితే భ్రమలన్నీ విడిచిపెట్టిపోతాయని అర్థం వస్తుంది. నామటుకు నాకు 'వీడురా' అయితే సబబుగా వుంటుందనిపించింది.

**భావ వివరణ:**

ఓరోరి జీవుడా! నీకెందుకు బుద్ధిలేదురా! ఏమాత్రం బుద్ధిరాదేమిరా! వాదు (జోలి) నీకు ఇంకొకరితో యెందుకురా?

నీ ఫాలభాగమందు (నుదుటిమీద ఏమివ్రాసి వున్నదో చూసుకో. అక్కడ నీ భ్రమలన్నీ భగ్నముగా జెండి (పటాపంచలయి) వీడురా (విడిచిపోతాయిరా!) ఓరోరి జీవా! ఇంకా నీకు యెందుకు బుద్ధిరాదురా!

జన సందోహంతో సంగత్వం పెట్టుకొని వారి సంతోషాలలో పాలుపంచుకొంటూ నీ ఒళ్ళు నీవు మఱచిపోతున్నావు. నిన్ను నీవు చూసుకోవేమిరా? ఈ సంసార సుఖములను విడిచిపెట్టరా!

ఆఱు చక్రముల నిలిపి (షట్చక్రయోగసాధనలో మనస్సు లగ్నంజేసి) ఆరుగురి గర్వమణచి (అరిషడ్ వర్గములను జయించి) చూడరా! మేరువపై నిలిచిన (మేరుపర్వతాన్ని అధిరోహించిన) అనుభూతి కలుగుతుంది. ఓరోరి జీవా! మతిలేని గగనాంతర సీమలను చేరిన అనుభూతి కలుగుతుంది.

అండపిండ బ్రహ్మాండములను భేదించి పరిశోధించు. అన్నిటినీ మించే అఖండమైన మాయను ఖండించి పారవేయరా! ఓరోరి జీవా! అన్నిటిలో నిలిచి (జ్ఞానము, జ్ఞేయమూ, జ్ఞాని – అన్నీ నీవే అయిపోతావు). అఖండపదవి (మోక్షము) నీకు సిద్ధిస్తుంది.

యాయీయాల? (అల్లరి యెందులకు?) తరిగొండ నరసింహస్వామిని చేరుకోరాదా? అక్కడ పండువెన్నెలలో ఆరుబయట చూడరా! అప్పుడు నీలో దండిగా (సమృద్ధిగా) వెలిగే ఆత్మజ్యోతి కనబడుతుంది. ఓరోరి జీవుడా! దాని చూచి తరించరా నాయనా!

## లాలి

99. లాలి ముద్దుల బాల! - లాలి గోపాలా!
లాలి కాంచన చేల! - లలిత గుణజాలా! ॥లాలీ॥1

ప్రవిమలాచార! యా - దవ కులోద్ధారా!
కవిబృంద మందార! - కలికలుషదూరా! ॥లాలీ॥2

నంద నందన! సదా - నంద! గోవిందా!
సౌందర్య వదనార - విందా! ముకుందా! ॥లాలీ॥3

వర చిన్మయాకార! - వనధి గంభీరా!
నిరుపమగుణ హార! - నిగమ సంచారా! ॥లాలీ॥4

శైలజస్తుత నామ! - సంపూర్ణ కామా!
నీలమేఘ శ్యామ - నిర్జర లలామా! ॥లాలీ॥5

తరిగొండపుర వాస! - తారక విలాసా!
చిరరమ్య దరహాస! - శ్రీ శ్రీనివాసా! ॥లాలీ॥6

**అవతారిక:**

తరిగొండ వెంగమాంబ శ్రీకృష్ణునిపై పాడిన లాలిపాటను ఆస్వాదించండి. ఇందులో వివరణకేమాత్రం ఆస్కారం లేకపోయినా పాట మాధుర్యం దృష్ట్యా ప్రస్తుతించవలసిన కీర్తన ఇది. ముద్దు లొలికే గోపాల బాలా! లాలి. ఓ కాంచన చేలా! లాలి. లలితగుణ జాలముకలిగిన దేవా! లాలి అంటున్నారు. పాఠకుల సౌకర్యార్థమే పద వివరణ కాని నిజానికి పదవివరణ అవసరమేలేని సరళమైన భాషవాడారు. అన్నమయ్య మాదిరిగానే ఈమె తరిగొండ వాసుడైన నరహరే, తిరుమల శ్రీశ్రీనివాసుడు అని భావిస్తున్నారు. అన్నట్లు 'నిర్జరలలామ' అంటే యేమిటి?





**భావ వివరణ:**

ఓ ముద్దులొలికే బాలుడా! గోపాలా! లాలిపాడెదనయ్యా! లాలి. ఓ కాంచనచేలా! (పచ్చని బంగారువర్ణపు పట్టుదట్టి కట్టిన కిట్టయ్యా! లాలి) మనోహరమైన గుణములు సమృద్ధిగా గల గోపాలా! లాలి.

గొప్ప నిర్మలమైన నడవడిగల గోపాలా! నీవు యాదవకులమును ఉద్ధరించుటకు అవతరించితివి. కవి బృందములకు (పండితమండలికి) మందారము వంటివాడవు. కలియుగ కాలుష్యమును దూరము చేయుటకు భూమిపై నవతరించిన దేవుడవు నీవే.

ప్రభూ! నీవు నందుని నందనుడవు (పుత్రుడవు). ఎల్లప్పుడూ ఆనందముతో వుండే గోవిందుడవు. సుందరమైన వదనారవిందము గలవాడవు. ముకుందమును (పద్మమును) చేతదరించిన ముకుందుడవు.

స్వామీ! నీవు చిన్మయాకారుడవు (చిదానంద స్వరూపుడవు). వనధిగంభీరుడవు (సముద్రమువలె గంభీరుడవు). సాటిలేని సుగుణములు హారముగా కలిగినవాడవు. నిగమ సంచారుడవు (వేదములయందు సంచరించువాడవు).

ఓ దేవదేవా! శైలజ (పార్వతీదేవి) స్తుతించునామ సముదాయము కలవాడవు. సంపూర్ణమైన కామనలు గలవాడవు. నల్లని మేఘపు కాంతిగల శరీరచ్ఛాయ గలవాడవు. నీవు నిర్జరలలాముడవు. (ముసలితనములేని దేవతలందరిలోనూ శ్రేష్ఠుడవు). ఓ సర్వేశ్వరా! నీవు తరిగొండ పట్టణ వాసుడవైన నారసింహుడవు. ఓ తారకవిలాసా! (మోక్షము నొసగే శ్రీహరీ!) రమ్యమైన చిరునవ్వు నిరంతరం పెదవులపై తాండవించే శ్రీశ్రీనివాసా! లాలి పాడెదను నిద్దురపోవయ్యా!

## మోహన రాగం - త్రిపుట చాపు తాళం

100. ఓ తల్లి! గంగాభవానీ! రావే!
ఖ్యాతిగ నిచటికి కపటము మాని ॥ఓ తల్లీ॥ ॥పల్లవి॥

హరిపాదమునఁ బుట్టినావు, పుర
హరుని జటాజూటమున నిలిచినావు
పరమ పవిత్ర వైనావు, మా
పాలిట వెలసి పూజలు గైకొన్నావు ॥ఓ తల్లీ॥ 1

హరి కర్పితముగ శ్రీతులసీవన
మలనాఁ దర్థితో నిన్నుఁ గావింప వెలసి
తరుణిది పెంచను మెఱసి యున్న
నర లేక రావె! శేషాద్రిలో వెలసి ॥ఓ తల్లీ॥ 2

వాసిగ నిను చాల నమ్మి, చిన్న
వాండ్ల కాదురువుగ నున్న సొమ్మమ్మి
చేసితి, నిను పని నమ్మి చేయ
నిరవుగనిచటికి బిరబిర రమ్మి! ॥ఓ తల్లీ॥ 3

తరిగొండ నరసింహుఁడైనా శేష
గిరివాసు నేవేళ కీర్తింపు జ్ఞాన!
కరుణ నాపై నుంచి శాన,
మమ్ము, కడతేర్చు భారము కల్గిన దాన ॥ఓ తల్లీ॥ 4

**అవతారిక:**

తుంబురవనంలో నివసించటానికి తరిగొండ వెంగమాంబగారికి యెట్టకేలకు అనుమతి లభించింది. కాని అక్కడ నీటిసౌకర్యంలేదు. ఆమె హితైభిలాషులు ఒక బావితవ్వటానికి ప్రయత్నించారు. కాని విధివశాత్తు రాయిపడింది. అందరి గుండెల్లోనూ రాయి పడింది. అయితే వెంగమాంబ





గారుభయపడలేదు. ఆమె శ్రీహరి శరణాగతురాలు. హరి పాదోద్భవియైన గంగాభవానిని ఈ కీర్తన పాడి ప్రార్థించింది. స్తంభంలోంచి పుట్టుకొచ్చి తనభక్తుని ఆదుకొన్న నారసింహుని భక్తురాలిని గంగమ్మ అనుగ్రహించి బావిలో తీయటి నీరు వూరింది. మరి యీ కీర్తన నాస్వాదించండి.

**భావ వివరణ:**

ఓ తల్లీ! గంగాభవానీ! రావమ్మా! కపటమును విడనాడి ఇక్కడకు వచ్చి ఖ్యాతిగడించు ప్రసిద్ధిబొందవమ్మా!

తల్లీ! నీవు శ్రీహరి పాదములవద్ద జన్మనొందినావు. తరువాత పురాంతకుడైన శంకరుని జటాజూటమున బంధింపబడి నిలిచిపోయావు. ఆయన శరీరమును తాకి పరమపావనివైనావు. మావద్దకు వచ్చి నెలకొని గంగామాతగా నిత్యమూ పూజలు గైకొంటున్నావు.

మళ్లీ నిన్ను హరికి అర్పితము చేశారు (బదరీనాథవద్ద) నిన్ను అలనాడు శ్రీతులసీవనంలో అర్థించగా వెలసినావు. నేడు అరలేక (బేధభావంలేక) ఈ తరుణాన మా పుణ్యం పెంచేటందుకు ఈ శేషాద్రిపైకి శోభాయమానంగా రావమ్మా!

ఓతల్లీ! నీవిఖ్యాతిని నమ్మి, పిల్లవాండ్ల ఆధారమైన వారి నగలను అమ్మి నిన్ను మనసారా నమ్మి బావితవ్వించటానికి వెచ్చించాను. ఇక నువ్వు బిరబిరా ఇక్కడకు వచ్చి ఇరవు (స్థావరము) పొందవమ్మా! రావమ్మా!

తరిగొండ నరసింహస్వామికూడా తానే అయిన శేషాచలపతి శ్రీవేంకటేశ్వరుని యేవేళనైనా కీర్తించే జ్ఞానస్వరూపిణీ! నాపై శాన (చాలా) దయ చూపించవమ్మా! మమ్ము ఈ కష్టంనుండి బయటపడవేయవమ్మా! నాపై ఎంతో బాధ్యత వున్నది తల్లీ! నన్ను రక్షించవమ్మా!

## మంగళము

### ముత్యాల హారతి పాట

101. శ్రీపన్నగాద్రివర శిఖరాగ్ర వాసునకు
పాపాంధకార ఘన భాస్కరునకూ,
ఆ పరాత్మునకు నిత్యానపాయినియైన
మా పాలి అలమేలు మంగమ్మకూ
జయ మంగళం నిత్య శుభ మంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 1

శరణన్న దాసులకు వరమిత్తునని బిరుదు
ధరియించియున్న పర దైవమునకూ,
మరువల దీ బిరుదు నిరతమని పతిని
ఏమరనియ్య నలమేలు మంగమ్మకూ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 2

ఆనంద నిలయమం దనిశంబు వసియించి
దీనులను రక్షించు దేవునకునూ,
కానుకల నొసఁగూర్చి ఘనముగా విభుని స-
న్మానించు అలమేలు మంగమ్మకూ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 3

పరమొసఁగ నా వంతు నరుల కని వైకుంఠ-
మరచేత చూపు జగదాత్మునకునూ,
సిరు లొసఁగ తనవంతు సిద్ధమని నాయకుని
ఉరముపై కొలువున్న శరధిసుతకూ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 4





తెలివితో ముదుపు లిటు తెమ్ము తెమ్మని పరుష
నళికించి కైకొనెడి అచ్యుతునకూ,
ఎలమి పాకంబుఁ జేయించి అందర కన్న
మలయ కెపు డొసఁగే మహామాతకూ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 5

మఱియు చిత్ర విచిత్ర మంటపావళులకును,
తిరువీథులకు, దివ్య తీర్థములకూ,
పరఁగ ఘన గోపుర ప్రాకారతతులకును,
చిరములై తగు కనక శిఖరములకూ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 6

తరచైన ధర్మసత్రములకును, ఫలపుష్ప
భరిత శృంగారవన పంక్తులకునూ,
మరువొప్పు ఉగ్రాణములకు, బొక్కసములకు,
సరసంబులగు పాకశాలలకునూ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 7

అహివైరి ముఖ్య వాహనములకు, గొడుగులకు,
రహి నొప్పు మకర తోరణములకునూ,
బహువిధ ధ్వజములకు, పటువాద్య వితతులకు,
విహిత సత్కల్యాణ వేదికలకూ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 8

దర చక్ర ముఖ్య సాధనములకు, మణిమయా-
భరణ దివ్యాంబర ప్రతతులకునూ,
కర చరణ ముఖ్యాంగ గణ సహితమై, శుభా-
కరమైన దివ్య మంగళ మూర్తికీ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 9

కలిత సుజ్ఞానాది కల్యాణగుణములకు,
బలమొప్పు నమిత ప్రభావమునకూ,
వలగొనిన సకల పరివార దేవతలకును,
చెలcగి పనులొనరించు సేవకులకూ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 10

అలరcగా బ్రహ్మోత్సవాదులై సంతతము
వలనొప్పు నిత్యోత్సవంబులకునూ,
పొలుపొందు విశ్వప్రభుత్వ మూలంబునకు,
నలువొందు వర విమానంబులకునూ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 11

అరయ తరిగొండ నరహరి యగుచు నందరికి
వరము లొసcగే శ్రీనివాసునకునూ,
మురియుచును విశ్వతోముఖు నిట్లు భరియించి
సిరుల వెలయుచునుండు శేషాద్రికీ
జయ మంగళం నిత్యశుభమంగళమ్,
జయ మంగళం నిత్య శుభ మంగళమ్. 12





**అవతారిక:**

తిరుమలలో నేటికీ స్వామికి మంగళగీతికవలె వినిపిస్తున్న ఆనాటి వెంగమాంబ హారతిపాటను ఆస్వాదించి తరించండి. శ్రీవేంకటేశ్వరునికీ, జనని అలమేలు మంగకు, ఆనందనిలయవాసుడైన శ్రీనివాసునికి, ఆయన పురముపై నెలకొన్న సముద్రరాజ తనయకు తిరువీధులకు, గోపురాలకు, మంటపాలకు, తీర్థములకు, శిఖరాలకు, ధర్మసత్రాలకు, శృంగారవనాలకు, స్వామివారి ధనాగారాలకు, వంటశాలలకు, ఆయన గరుడవాహనము మొదలైన వాహనములకు, గొడుగులకు, మకరతోరణాలకు, ధ్వజములకు, మంగళవాయిద్యములకు, వేదికలకు, స్వామివారి పట్టువస్త్రాలకు ఆయన కళ్యాణ గుణములకు, దేవతలకు, బ్రహ్మోత్సవాలకు, తరిగొండ నరసింహునికి, శేషాచలమునకు పేరుపేరునా మంగళాశాసనములను వినిపిస్తున్నారు. పాడి, విని, చదివి తరించండి. ఈ రచన పరిసమాప్తమవుతున్నది.

32 అన్నమయ్య భక్తి కీర్తనలు, 32 పెదతిరుమలయ్య రక్తి (శృంగార) 32 చినతిరుమలయ్య విరక్తి (అధ్యాత్మ) కీర్తనలు, అవతారిక, భావి వివరణలతో అందించబడ్డాయి. 5 తరిగొండ వెంగమాంబ కీర్తనలను కూడా వాటితో పాటు అందించాను. ఆనందమంతా మీదే సుమా!

**భావ వివరణ:**

శ్రీపన్నగాద్రివరశిఖ (వేషశైల శిఖరమున) వసించు మహానుభావునికి, పాపాంధకారము నణగించు గొప్ప సూర్యునికి, పరమపురుషునికి, నిత్య అనుపాయియైన (నిత్యమూ అనుసరించివుండే) అలమేల్మంగమ్మకు జయమంగళము మరియు శుభమంగళము.

తన శరణాగతులకు వరములిస్తాడనే బిరుదున్న పరదేవతామూర్తికి, ఓ స్వామీ! నీబిరుదును మరువకు అని ప్రతిక్షణం తనే ఆయనకు గుర్తుచేసే అలమేల్మంగకు మంగళా శాసనములు.

ఎల్లవేళలా ఆనందనిలయంలో నివసించి దీనులను రక్షించే దేవదేవునికి, ఆయనకు ఘనమైన కానుకలనొసగి ఆయనకు ప్రీతిగలిగించు అలమేల్మంగకు జయమంగళము మరియు శుభమంగళము.

తన అరచెయ్యి చూపిస్తూ మీకు వైకుంఠం ఇవ్వటమే నావంతు అని ఆయనంటుంటే, మీకు సిరిసంపదలివ్వటం నావంతు అని ఆయన పురముపైనెక్కిన అలమేల్మంగకు మంగళాశాసనములు.

మనస్ఫూర్తిగా ముడుపులను తీసికొనివచ్చినాకర్పించి తరించండిరా అనే అచ్యుతునికి అందరికీ అన్నపానములనొసగే మహామాతకు జయమంగళము మరియు శుభమంగళము.

తిరుమలలోని చిత్రవిచిత్రమైన మంటపములకు, తిరువీధులకు, దివ్యమైన తీర్థములకు, గొప్ప గోపురాలకు, ప్రాకారాలకు బంగారు శిఖరాలకు మంగళాశాసనములు.

అధికముగానున్న ధర్మసత్రములకు, ఫలపుష్ప సమన్వితమైన శృంగారవనములకు, మురువొప్పు దగ్రాణములకు (సౌందర్యమొప్పు భాండాగారములకు) చక్కటి వంటశాలలకు జయమంగళము మరియు శుభమంగళము.

పన్నగములశత్రువైన గరుత్మంతునికి, స్వామివారి గొడుగులకు, కాంతివంతమైన మకర తోరణములకు, మంగళవాయిద్యములకు, కళ్యాణ వేదికలకు మంగళా శాసనములు.

స్వామివారి శంఖ చక్రాది ఆయుధములకు, మణిమయమైన ఆభరణములకు, దివ్యమైన చీనాంబరములకు, కరచరణాది అంగములతోనున్న మంగళమూర్తికి జయమంగళము మరియు శుభమంగళము.

సుజ్ఞానము మొదలైన కళ్యాణగుణములకు, బలమైన ఆయన





భావమునకు, చుట్టూ చేరిన దేవతలు మొదలైన పరివారమునకు, అసంఖ్యాకులైన సేవకులకు మంగళాశాసనములు.

స్వామివారి బ్రహ్మోత్సవములకు, ఎప్పుడూ జరిగే నిత్యోత్సవములకు, స్వామివారు నిర్వహించు విశ్వపరిపాలనమునకు, ఆయన విమానములకు జయమంగళము మరియు శుభమంగళము.

అదిగో ఆ తరిగొండ నారసింహునకు, కోరినవారందరికీ వరములనొసగే శ్రీనివాసునికి, విశ్వతోముఖుడైన ఆ శ్రీవేంకటేశ్వరుని భరిస్తున్న సిరుల శేషాద్రికి అనేకానేక మంగళాశాసనములు.

"సర్వేజనా: సుఖినో భవంతు".

